


# ఫ్రాన్స్‌లో అంతర్యుద్ధం

కారల్‌మార్క్స్




మార్క్స్ ద్విశత జయంతి సందర్భంగా

# ఫ్రాన్సులో అంతర్యుద్ధం




కారల్ మార్క్స్




ప్రజాశక్తి బుక్‌హౌస్

*27-30-4, ఆకులవారి వీధి, గవర్నర్‌పేట, రాఘవయ్యాపార్కు వద్ద*

*విజయవాడ - 520 002. ఫోన్ : 0866 -2577533*




ప్రచురణ సంఖ్య : 1599

ప్రథమ ముద్రణ : ఏప్రిల్, 2019

వెల : ₹ 70/-

ప్రతులకు



PSBH

ప్రజాశక్తి బుక్‌హౌస్

27-1-54, కారల్‌మార్క్స్ రోడ్, గవర్నర్‌పేట,

విజయవాడ -2, ఫోన్ : 0866 -2577533

బ్రాంచీలు

విజయవాడ, విశాఖపట్నం, తిరుపతి, గుంటూరు, కాకినాడ,

ఏలూరు, విజయనగరం, ఒంగోలు, నెల్లూరు, కర్నూలు, అనంతపురం

ముద్రణ

ప్రజాశక్తి డైలీ ప్రింటింగ్ ప్రెస్, విజయవాడ

website : www.psbh.in

prajasaktipublishinghouse@gmail.com

ISBN : 978-93-88566-10-0



# విషయసూచిక


ముందుమాట 5

పీఠిక–ఫ్రెడరిక్ ఎంగెల్స్ 11

ఫ్రాంకో ప్రష్యన్ యుద్ధంపై, అంతర్జాతీయ కార్మిక సంస్థ జనరల్ కౌన్సిల్‌లో మొదటి ప్రసంగం 25

అంతర్జాతీయ కార్మిక సంస్థ కౌన్సిల్‌లో ఫ్రాంకో ప్రష్యన్ యుద్ధంపై రెండవ ప్రసంగం 31

1871, ఫ్రాన్సు అంతర్యుద్ధంపై అంతర్జాతీయ కార్మిక సంస్థ జనరల్ కౌన్సిల్ ప్రసంగం 40

**II, III, IV**

అనుబంధం 1 89

అనుబంధం 2 91

నోట్సు 94

నామ సూచి 99

# ముందుమాట

ఈ గ్రంథ రచన జరిగి 150సం॥లు కావస్తున్నది. అవి పెట్టుబడిదారీ వ్యవస్థ రూపుదిద్దుకుంటున్న రోజులు. అమానుషమైన తరతరాల భూస్వామ్యవ్యవస్థ బ్రద్దలు కొడుతున్న మొనగాడిగా పెట్టుబడిదారీ వర్గాన్ని ప్రజలు చూస్తున్న రోజులు. అయితే స్థిరపడేకొద్దీ దాని నిజస్వరూపం బట్టబయలు కాసాగింది. పెట్టుబడిదారీ వ్యవస్థ గొప్పతనం గురించి, దాని వికృతనైజం గురించి పోటాపోటీగా సాహిత్యం వెల్లువెత్తింది. అనేక సిద్ధాంతాలు, రకరకాల సోషలిస్టు సిద్ధాంతాలు రంగం మీదకు వచ్చాయి. వీటి మాటున రోజురోజుకూ స్పష్టంగా ముందుకు వస్తున్న పెట్టుబడిదారులకీ – కార్మికవర్గానికి మధ్య వైరుధ్యాన్ని, సమాజమార్పుకు కారకంకానున్న యీవైరుధ్య స్వభావాన్ని మార్క్స్ – ఎంగిల్స్‌లు మాత్రమే గుర్తించారు. ఈ వైరుధ్యం చుట్టూ ఓ గొప్ప శాస్త్రీయ విప్లవతాత్విక సిద్ధాంతాన్ని వారు రూపొందించారు. పెట్టుబడిదారీవ్యవస్థ ప్రాథమిక దశలు (యిప్పటితో పోలిస్తే) వుండగానే దాని నిర్మాణ సూత్రాలను వెలికితీసి వారు చెప్పగలగడం నిజంగానే ఆశ్చర్య కలిగిస్తుంది. ఆవిరినౌకలు, రైళ్ళు అరుదుగా వున్న నాడే రవాణారంగంలో విప్లవం ద్వారా పెట్టుబడిదారీవర్గం భూమండలాన్ని ఏకం చేస్తుందని మార్క్స్ ప్రకటించారు. భూస్వామ్యవ్యవస్థ కడుపులో పుట్టి పెరిగిన పెట్టుబడిదారీవ్యవస్థ దాన్ని కూల్చినట్లుగానే పెట్టుబడిదారీవ్యవస్థలో పుట్టిన కార్మిక వర్గం అనివార్యంగా దాన్ని కూలుస్తుందని, దోపిడీరహిత సమాజాన్ని – సమసమాజాన్ని నిర్మిస్తుందని మార్క్స్ – ఎంగిల్స్‌లు 'కమ్యూనిస్టు ప్రణాళిక' లోని (1848) ప్రకటించి ప్రపంచాన్ని కుదిపిలేపారు. అందుకు 1864 ఫస్ట్ ఇంటర్నేషనల్ (మొదటి అంతర్జాతీయ కార్మికసంస్థ) ను ఏర్పాటుచేసారు. ఐరోపాఖండంలోనూ అమెరికావంటి దేశాలలో దాని శాఖలు ఏర్పడ్డాయి. ఇది ఏర్పడిన 7 సం॥లకే పారిస్‌నగరంలో తొలి కార్మికవర్గరాజ్యస్థాపన జరిగింది. దానిని తీవ్రమైన కక్షతో, క్రూరంగా

పెట్టుబడిదారీవర్గం అంతర్యుద్ధాన్ని లేవనెత్తికూల్చింది. ఆ చరిత్రే యీ 'ఫ్రాన్సులో **అంతర్యుద్ధం**'.

తరతరాల భూస్వామ్యవ్యవస్థను కూలగొడుతున్న పెట్టుబడిదారీవర్గం ఆ వ్యవస్థతో, రాజరికపాలనతో సైతం ముడిపెట్టుకుని నూతన కార్మికవర్గరాజ్యానికి వ్యతిరేకంగా ఫ్రాన్స్‌లో అంతర్యుద్ధం ఎందుకు లేపింది? ఆనాటికే కాదు యీ నాటికి కూడా ఎంతో ప్రాధాన్యత వున్న సైద్ధాంతిక, ఆచరణకు కూడా సంబంధించిన ప్రశ్నయిదని '**ఫ్రాన్సులో అంతర్యుద్ధం**' చదివితే అర్థం అవుతుంది.

**నేడు - నాడు**

150 సం॥ గడిచాయి నేటి పరిస్థితి ఏమిటి? సోవియట్ రష్యా కూలిన అనంతరం యిక తిరుగులేదని విర్రవీగిన పెట్టుబడిదారీ ప్రపంచం నేడు దిక్కుతోచని స్థితిలో పడింది. ఆర్థిక అసమానతలూ, నిరుద్యోగం, పేదరికం, ఆకలి, అనారోగ్యం యిన్నేళ్ళుగా పేదదేశాల్లో (అభివృద్ధి చెందుతున్న) పెంచి, లాభపడ్డ అభివృద్ధిచెందిన (సామ్రాజ్యవాద) దేశాలన్నింటా యివి చుట్టుముట్టాయి. ఏమందేసినా ప్రకోపించే జబ్బులా 10 సం॥లకు పైగా ఆర్థిక సంక్షోభం పట్టి పీడిస్తున్నది. ఈ స్థితిలో పెట్టుబడిదారీ పాలకులకు మిగిలింది ఫాసిస్టు తరహాలో జాతి, మత, ప్రాంతీయ ఉన్మాదులను 'దేశభక్తి' పేరిట రెచ్చగొట్టడం, మరోప్రక్క ప్రజాఉద్యమాలపై విరుచుకుపడటం. వీటికి అమెరికా, ఇంగ్లండ్, ఫ్రాన్స్, జర్మనీ, ఇటలీ, ఇండియా ఏవీ మినహాయింపుగా కనబడటంలేదు. ఒకదేశాన్ని మరోదేశం ప్రత్యక్షంగా పాలించడంపోయింది. వలస వ్యవస్థేకూలిపోయింది. ఐక్యరాజ్యసమితిలాంటి అంతర్జాతీయ వేదికలు ఎన్నోవచ్చాయి. శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానం అసాధారణ స్థాయిలో పెరుగుతున్నది. అయినా యుద్ధాలు, అణచివేతలు, హింస పెట్టుబడిదారీవర్గ పుణ్యమా అని రాజ్యమేలుతున్నాయి. మరి యీ పరిస్థితులలో కార్మికవర్గం యొక్క జాతీయ, అంతర్జాతీయ సాంఘిక కర్తవ్యాలు ఎలా వుండాలో తెలుసుకోవడానికి '**ఫ్రాన్సులో అంతర్యుద్ధం**' ఎంతగానో వుపయోగపడుతుంది.

**పారిస్ కమ్యూన్ ఏంచేసింది?**

వంద సం॥ల క్రితం 1789లో ఫ్రెంచి పెట్టుబడిదారీవిప్లవం ఏం చెప్పి చేయలేకపోయిందో పారిస్ కార్మికవర్గరాజ్యం చేసి చూపించింది. ఆనాడు "స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం" నినాదాలిచ్చి అధికారంలోకి వచ్చిన పెట్టుబడిదారీవర్గం అధికారంలోకి రాగానే ఆ నినాదాలను డొల్లచేసింది. బలపడేకొద్దీ దేశాలమధ్య యుద్ధాలను అనివార్యం చేసింది. రిపబ్లిక్ (పార్లమెంటరీ ప్రజాస్వామ్యవ్యవస్థ)ల పేరిట

యుద్ధాలు సాగించింది. కానీ ఎంతో ప్రాథమిక దశలోవున్న వివిధదేశాల కార్మికవర్గం, ఫస్ట్ఇంటర్నేషనల్ నాయకత్వాన, మార్క్సిస్టు సిద్ధాంత స్ఫూర్తితో **కార్మికవర్గ అంతర్జాతీయ** నినాదాన్ని అందిపుచ్చుకుంది. ఈ నేపథ్యంలో (1870) ఫ్రాన్స్ నెపోలియన్ నాయకత్వాన జర్మనీపై యుద్ధానికి దిగింది. కాని ఫ్రాన్స్ కార్మికవర్గం 'ఇది రాచరికపాలనను స్థిరపరిచే యుద్ధం. ఈ యుద్ధాన్ని శక్తివంచన లేకుండా వ్యతిరేకిస్తాము. ఫస్ట్ ఇంటర్నేషనల్ పిలుపుకు కట్టుబడి వుంటామని ప్రకటించింది. దీనికి ప్రతిస్పందనగా జర్మన్‌కార్మికవర్గం 'మేము మీ నిరసనలలో హృదయపూర్వకంగా భుజంకలిపి నడుస్తాము... గెలుపైనా, ఓటమైనా అన్ని దేశాల శ్రామికబిడ్డల ఐక్యత కొరకు జరిగే సంఘటిత పోరాటంనుండి మన దృష్టిని మరల్చలేరు' అని ప్రకటించింది. ఈ నేపథ్యంలోనే కారల్‌మార్క్స్ "యుద్ధాలు లేని ప్రపంచం రావాలంటే సకల దేశాల్లో శాంతి అంతర్జాతీయ నియమంగా కలిగిన కార్మికవర్గం అధికారంలోకి రావల్సివుంటుందని" చెప్పారు. ఈ స్ఫూర్తితో ఏర్పడి 72 రోజులు అధికారంలోవున్న తొలికార్మికవర్గ రాజ్యం – పారిస్‌కమ్యూన్– ఎన్ని వందల సంవత్సరాలు పాలించినా పెట్టుబడిదారీవర్గం చేయని, చేయలేని గొప్ప చారిత్రక కర్తవ్యాలను నిర్వర్తించింది.

– వేతనవ్యవస్థలో మార్పు: కనీసవేతనంతో పాటు, గరిష్టవేతనాన్ని (ఆ రోజుల్లో 6000 ఫ్రాంకులు) నిర్ధారించి చట్టం చేయడం, ఉన్నతాధికారులు, ప్రజాప్రతినిధులలో సైతం యింతకంటే ఎక్కువ వేతనం యివ్వబడదు. ఉన్నతాధికారులను, ప్రజాప్రతినిధులను వారిపని సక్రమంగా లేకుంటే వెనక్కి పిలిపించి, వేరేవారిని ఎన్నుకునే హక్కు ప్రజలకు వుండేలా చట్టం తెచ్చింది కమ్యూన్. మనదేశంలోను, ఏ పెట్టుబడిదారీ దేశంలోనూ యిది సాధ్యంకాదు. ప్రజాసేవకోసమే వచ్చామనే ఎం.పిలూ, ఎంఎల్ఎలకు నగదురూపంలో వేతనం లక్షకుపైనే. మరోప్రక్క శ్రామికుడికి 3000/- లు మించి వుండదు (మనదేశంలో). ఇలా ఎన్నో గొప్ప నిర్ణయాలను పారిస్ కమ్యూన్ చేసింది. ఈ గ్రంథంలో వివరంగా వుంది.

## పెట్టుబడిదారుల కక్ష

పెట్టుబడిదారులకు, వారి ప్రభుత్వాలకు, వారి తాబేదార్లయిన మేధావులకూ ఎంత కక్షవుంటుందో తెల్సుకోవాలంటే "ఫ్రాన్స్‌లో అంతర్యుద్ధం" చదవాల్సిందే. 1870లో పెట్టుబడిదార్లు గొప్ప వాగాడంబరంతో ఏర్పాటు చేసామన్న రిపబ్లిక్‌ని మరింత పటిష్టంచేసి సోషల్‌రిపబ్లిక్ (సాంఘిక రిపబ్లిక్) గా చేయాలన్నది ఫ్రెంచి కార్మికుల వాదన. ఆ వాదనని ప్రజలు సమీక్షించారు. కార్మికవర్గం రిపబ్లిక్‌ని నిలబెట్టడానికి పోరాటాన్ని తీవ్రం చేసింది. అది విప్లవరూపం తీసుకున్నది. దీనితో

ఫ్రెంచి పెట్టుబడిదారీవర్గమే కాదు, నాటి ప్రపంచ పెట్టుబడిదారీవర్గం, నెపోలియన్ రాజ్యం గడగడలాడింది. మరోప్రక్క జర్మనీతో యుద్ధం భారంగా మారింది. కమ్యూన్ విప్లవనాయకుడు ఆగస్ట్‌బ్లాంక్వీ "తమపై యుద్ధం చేస్తున్న ప్రష్యన్లకన్నా ప్రభుత్వం కార్మికవర్గ విప్లవం గురించి ఎక్కువగా భయపడుతున్నదని' సరిగ్గా చెప్పాడు. పారిస్ కార్మికవర్గం నిలబడింది. 1871 మార్చి 28న పారిస్ పట్టణంలో ప్రభుత్వాన్ని ఏర్పర్చింది. ఏప్రిల్ 2న మతం (చర్చ్) నుండి ప్రభుత్వాన్ని వేరుచేస్తూ చట్టం చేసింది. నిజానికి 1789 ఫ్రెంచివిప్లవంలో పెట్టుబడిదారీవర్గం యీపని చేస్తానని లేక వ్యవస్థను నిర్మిస్తానని హామీ యిచ్చింది. అధికారంలోకి రాగానే ప్లేటు ఫిరాయించింది. మతంపై ఆధారపడకపోతే కార్మికవర్గవిప్లవాన్ని ఎదుర్కొనడం సాధ్యంకాదని పెట్టుబడిదారీ వర్గానికి తెలుసు. అందుకనే అధికారంలోకి రాగానే లౌకికతత్వానికి అర్థం మార్చేసింది. కాని కార్మికవర్గం అధికారంలోకి రాగానే ఆ పని పూర్తిచేసింది. అంతేకాక లౌకికతత్వం అంటే విద్య నుండి కూడా మతాన్ని దూరం చేయాలని ఆదేశించింది.

శాస్త్రీయ దృక్పథం చిన్ననాటినుండే అలవర్చాలని 'చదువులేని' ఆ కార్మికులు నిర్ణయించడం అద్భుతం కదూ!? అన్నిటికన్నా మించి శాశ్వతసైన్యాన్ని, ఉద్యోగగణాన్ని రద్దుచేసి దానికి కూడా ఎన్నికలు జరపాలని పారిస్‌కమ్యూన్ నిర్ణయించి అమలుచేసింది. గతకాలపు భావాలతో విర్రవీగే భూస్వామ్యవర్గమే కాదు, ఆధునికత్వానికి మారుపేరు తామేనని చెప్పుకునే పెట్టుబడిదారీ వర్గానికి కూడా గంగవెర్రిలెత్తింది.

మరోప్రక్క పారీస్‌కమ్యూన్ - తొలి కార్మికవర్గరాజ్యం ప్రపంచకార్మికులకూ పీడిత ప్రజలకూ గొప్ప ఆదర్శంగామారడం, పెట్టుబడిదారీ వర్గానికి ముచ్చెమటలు పట్టించింది. కక్షతో శత్రువుతో చేతులు కల్పింది. అంతేకాదు అందుకోసం తనదేశాన్ని సైతం తాకట్టు పెట్టడానికి ఒప్పందాలు చేస్తుంది. 72 రోజుల పారిస్ కమ్యూన్‌పై విరుచుకుపడ్డారు. రక్తపుటేరుల్లో పారిస్ నగరాన్ని ముంచేసారు.

## పారిస్ కమ్యూన్ అజరామరం !

"తిండికోసం పోరాడే కార్మికులు స్వర్గధామాన్ని కుదిపేసే దశకు తెచ్చింది పారిస్ కమ్యూన్". 'అంతేకాదు యిది ప్రపంచాన్ని పునర్‌నిర్మించే తొలిచర్య' అని కారల్‌మార్క్స్ వ్యాఖ్యానించాడు.

"కష్టాలలో వుండి పోరాడుతున్న కార్మికవర్గం ఎక్కడవున్నప్పటికీ వారి ప్రేమాభిమానాలు సాంఘిక విప్లవం గురించి తొలి అడుగులు వేసిన పారిస్ కమ్యూన్‌తోనే ఎల్లప్పుడూ వుంటాయి. పారిస్‌కమ్యూన్ జీవితం, మరణం, ప్రపంచ రాజధాని (పారిస్) ను జయించి కార్మికవర్గ ప్రభుత్వాన్ని 2 నెలలు వీరోచితపోరాటం

ద్వారా నిర్వహించి, కూలిన అనంతరం తీవ్రమైన దాడులను ఎదుర్కొన్న కార్మికవర్గం కోటానుకోట్ల కార్మికులు సోషలిజంవైపు నడిచేలా చేసింది పారిస్ కమ్యూన్" అని కామ్రేడ్ లెనిన్ పేర్కొన్నాడు. అందుకే పారిస్ కమ్యూన్ గురించి, దానిని ధ్వంసం చేసిన పెట్టుబడిదారుల ప్రతీఘాత విప్లవం గురించి తెల్సుకోవాలి. నేటి తరానికి తెలియజెప్పాలి. అందుకు "ఫ్రాన్సులో అంతర్యుద్ధం" పెద్ద బాలశిక్షగా ఉపయోగపడుతుంది. అంతర్యుద్ధం తీవ్రంగా సాగుతూ, కార్మికుల ప్రతిఘటన ఓడిపోతున్నప్పుడు మే 23న (1871) ఫస్ట్ ఇంటర్నేషనల్ జనరల్‌కౌన్సిల్ సమావేశాన్ని ఉద్దేశించి మాట్లాడుతూ మార్క్స్ "పారిస్ కమ్యూన్ ఆదర్శాలు అజరామరం. వాటిని ఎవరూ అణచలేరు. కార్మికవర్గాలు అంతిమంగా విముక్తి అయ్యేవరకు అవి మరల మరల ముందుకు వస్తూనే వుంటాయి" అని ప్రకటించాడు. అంతేకాదు "రానున్న పోరాటాలకు తర్ఫీదునివ్వడానికి, ప్రజలకు మరింత శిక్షణ యివ్వడానికి ఆశేలేని లక్ష్యం కోసం జనబాహుళ్యం జరిపే నిస్సహాయ పోరాటాలుకూడా చరిత్రలో అవసరం అవుతాయి" అని ఆ రోజు మార్క్స్ చెప్పిన మాటలు నేటికీ శిరోధార్యం అని చెప్పక తప్పదు. ఈ సందర్భంగా లెనిన్ "ప్రభుత్వాలన్నింటికీ మనం చెప్పాలి: కార్మికవర్గానికి వ్యతిరేకంగా ఎక్కుబెట్టబడిన సాయుధసైన్యం మీరని మాకు తెలుసు; అవకాశం వుంటే మేము మీపై శాంతియుతంగానే పోరాడుతూ, అవసరమైనప్పుడు ఆయుధాలతో పోరాడుతాం" అని అంత భయానక వాతావరణం నడుమ హెచ్చరించాడు. అది మనకు ఆదర్శం. ఆ మార్గంలో నడుద్దాం.

**కె. రఘు**

సిపిఐ(ఎం), ప్రధాన కార్యదర్శి,

తూర్పు కృష్ణ

# పీఠిక
# ఫ్రెడరిక్ ఎంగెల్స్

అంతర్జాతీయ కార్మిక సంస్థ జనరల్ కౌన్సిల్‌లో, ఫ్రాన్సులో అంతర్యుద్ధంపై జరిగిన ప్రసంగం కొత్తపాఠాన్ని తయారుచేసి, దానికి పీఠిక రాయవలసి వస్తుందని నేను ఊహించలేదు. కనుక అందులోని ముఖ్య విషయాలను మాత్రమే ఇచ్చట నేను ప్రస్తావించగలను.

పైన చెప్పబడిన సుదీర్ఘ రచనకు ముందుగా, ఫ్రాంకో ప్రష్యన్ యుద్ధంపై జనరల్ కౌన్సిల్‌లో మార్క్సు చేసిన రెండు ప్రసంగాలను నేను జత చేస్తున్నాను. ఇందులో మొదటి ప్రసంగం చదవనిదే రెండో ప్రసంగం బోధ పడదు. రెండో ప్రసంగం, ఫ్రాన్సులో అంతర్యుద్ధం పుస్తకంలో ప్రస్తావించబడ్డది. ఈ రెండు ప్రసంగాలను మార్క్సే రాశాడు. ఈ రెండు ప్రసంగాలూ, ఫ్రాన్సులో అంతర్యుద్ధం అను గ్రంథం వలెనే, రచయిత అసమాన సామర్థ్యానికి నిదర్శనాలు. ఈ సామర్థ్యం మొట్టమొదట లూయీ బోనపార్టీ 18వ బ్రూమైరి గ్రంథంలో రుజువైంది. ప్రముఖ చారిత్రక ఘటనలు ఇంకా మన కళ్ళముందు జరుగుతూండగానే, లేక, అప్పుడే ముగిసిన సందర్భంలో, ఆ ఘటనల స్వభావం, అంతరార్థం, అనివార్య పరిణామాలను స్పష్టంగా గ్రహించటం అసాధారణమైన ప్రతిభ వల్లనే సాధ్యం. అంతేకాదు, ఈ ఘటనల పర్యవసానంగా జర్మనీలో ఏ ఘటనా పరంపరను మార్క్సు ఊహించాడో, వాటిని మనం జర్మనీలో ఇంకా చవిచూడవలసే ఉన్నది.

లూయీ బోనపార్టీకి వ్యతిరేకంగా జర్మనీ ప్రారంభించిన ఆత్మరక్షణ యుద్ధం ఫ్రెంచి ప్రజలకు వ్యతిరేకంగా దురాక్రమణ యుద్ధంగా మారితే, విమోచన యుద్ధాలుగా* కీర్తించబడిన నెపోలియన్ యుద్ధాల తర్వాత జర్మనీకి కలిగిన దుస్థితి, అతి తీవ్ర రూపంలో జర్మనీలో పునరావృత్తం అవుతుంది అని మార్క్సు చేసిన ఊహ, నిజమైందా లేదా ! మరో ఇరవయ్యేండ్ల పాటు మనం బిస్మార్కు పాలనను ప్రత్యేక చట్టాన్ని[1]

---

* The wars against Nepolean I in 1813-15 Ed.

అనుభవించామా లేదా! వాగాడంబర ప్రచారకులపై లోగడ ఎంత నిర్బంధ విధానం అమలు జరిగిందో, అంతటి నిర్బంధ విధానం, హద్దులేని పోలీసుల నిరంకుశత్వం, చట్టానికిది తమకు తోచినట్లు వ్యాఖ్యానం చెప్పే ధోరణి, ఇవన్నీ, సోషలిస్టులకు వ్యతిరేకంగా అమలు జరుగుతున్నాయా! లేదా!

ఆల్సేక్-లారేన్‌ను జర్మనీ ఆక్రమిస్తే, ఫ్రాన్సు రష్యా చేతులలోకి పోతుంది. ఈ ఆక్రమణ తర్వాత జర్మనీ రష్యాకు బానిస దేశమన్నా కావాలి లేక కొంత విశ్రాంతి తర్వాత, కొత్త యుద్ధానికైనా తయారు కావాలి. ఆ యుద్ధం, స్లోవన్, రోమన్ జాతులకు వ్యతిరేకంగా జరిగితే జాతుల యుద్ధం అవుతుంది అని మార్క్స్ ముందుగానే చెప్పాడు. ఆ మాట ఇప్పుడు అక్షరాలా నిజమైంది. ఫ్రెంచి రాష్ట్రాలను జర్మనీ ఆక్రమించు కోవటంతో, ఫ్రాన్సు రష్యా చేతులలోకి పోయింది. ఇరవై ఏండ్ల నుండి రష్యా సానుభూతిని పొందటానికి బిస్మార్క్ వృధా ప్రయత్నం చేస్తూనే ఉన్నాడు. యూరప్‌లో మొదటి రాజ్యం కాకముందు. చిన్న ప్రష్యా, పవిత్ర రష్యా ముందు ఎంత అవమానకరంగా మోకరిల్లిందో అంతకంటె బానిస ప్రవృత్తిని, బిస్మార్క్ ప్రదర్శించాడు. ఏ రోజునైనా యుద్ధం మనపై రుద్దబడే ప్రమాదం ఉండనే ఉన్నది గదా? ఈ యుద్ధమే ప్రారంభమైతే, మొట్టమొదటి రోజుననే, అంతకు ముందు రాజకుమారులు చేసుకున్న ఒప్పందాలన్నీ చెత్తకాగితాల క్రింద చెదిరిపోతాయి. యుద్ధ ఫలితం ఎలా ఉంటుందో ఎవరూ చెప్పలేరు. అది మాత్రం ఖాయం. ఇదొక జాతుల యుద్ధం అవుతుంది. 15 లేక 20 మిలియన్ల సైనికులు జరిపే దురాగతాలకు, యూరప్ బలి అవుతుంది. నిజానికీ యుద్ధం ఇప్పటికే ప్రారంభం కాలేదంటే – యుద్ధం యొక్క అంతిమ ఫలితం ఎలా ఉంటుందో అని అతి బలోపేతమైన సైనిక రాజ్యాలు సైతం వెనకాడుతుండటమే కారణం.

జర్మన్ కార్మికులకు ప్రతిభావంతమైన రుజువు లన్నిటినీ తిరిగి తెలియ జేయటం మన విధి. 1870లో అంతర్జాతీయ కార్మికవర్గం అనుసరించిన విధానం విశిష్టత, దూరదృష్టి, ఇప్పటికే సగం మర్చిపోతున్నారు. దానిని తిరిగి జ్ఞాపకం చేయటం అవసరం.

ఈ రెండు ప్రసంగాలకు ఏది వర్తిస్తుందో, ఫ్రాన్సులో అంతర్యుద్ధం అనే గ్రంథానికి అదే వర్తిస్తుంది. మే 28వ తేదీన, బెలివిల్లీ సాదువులపై జరిగిన యుద్ధంలో కమ్యూన్. ఆఖరు పరిరక్షకులు, బలీయమైన ప్రత్యర్థుల చేతిలో పూర్తిగా ఓడిపోయారు. ఆ తర్వాత రెండు రోజులకే మే30న, జనరల్ కౌన్సిల్ సమావేశంలో మార్క్స్ తన ప్రసంగం చేశాడు. పారిస్ కమ్యూన్ చారిత్రక ప్రాముఖ్యత ఆ ప్రసంగంలో క్లుప్తంగానూ, శక్తివంతంగానూ రేఖామాత్రంగా వివరించబడ్డది. కాని ఈ వివరణలోని నైశిత్యమూ, చిత్తశుద్ధీ. ఈ సమస్యపై వెలువడిన విస్తృత సాహిత్యంలో మరెక్కడా కనపడదు.

1789 నుండి ఫ్రాన్సులో జరిగిన ఆర్థిక, రాజకీయ పరిణామాల ఫలితంగా, గత 50 ఏండ్లలో ఫ్రాన్సులో ఒక పరిస్థితి ఏర్పడ్డది. అక్కడ ఏ విప్లవం బద్దలైనా, అది కార్మికవర్గ స్వభావాన్ని స్వీకరించక తప్పదు. అనగా తన రక్తతర్పణంతో విజయం సాధించిన కార్మిక వర్గం, విజయానంతరం తన స్వంత కోర్కెలతో ముందుకు వచ్చితీరుతుంది. ఈ కోర్కెలు అంత స్పష్టమైనవి కావు, గందరగోళంతో కూడినవి కూడా. ఆ నిర్దిష్ట కాలంలో పారిస్ కార్మికులు సాధించిన అభివృద్ధి స్థాయికి ఇవి అనుగుణమైనవి. కాని చిట్టచివరకు, వాటన్నిటి సారాంశమూ ఒకటే, పెట్టుబడిదారులకు, కార్మికులకు మధ్య గల శత్రుత్వాన్ని రద్దు చేయాలనే కోర్కె ఇది ఎలా సాధించవలెనో, ఎవరికీ తెలియని మాట నిజమే. కాగా అసలీ కోర్కె, ఎంత అస్పష్టమైన మాటలలో దానిని పొదిగినప్పటికీ, ఆనాటి సామాజిక వ్యవస్థకు ఒక సవాలుగా పరిణమించింది. ఈ కోర్కెను ప్రతిపాదించిన కార్మికులు అప్పటికింకా సాయుధులుగా ఉన్నారు. కనుక అధికార స్థానంలో ఉన్న బూర్జువా వర్గం యొక్క తొలి కోర్కె ఏమంటే, కార్మికులను నిరాయుధులను చేయటం. కనుకనే కార్మికులు విజయవంతమైన ప్రతి విప్లవం తర్వాత, ఒక కొత్త పోరాటం జరిగేది. అందులో కార్మికులు ఓడిపోతూ ఉండే వారు.

మొట్టమొదటిసారిగా 1848లో ఇలా జరిగింది. పార్లమెంటరీ ప్రతిపక్షానికి చెందిన ఉదార బూర్జువా వర్గం, తమ పార్టీ ఆధిపత్యాన్ని సాధించే ఎన్నికల సంస్కరణల కోసం, విందు భోజనాల దౌత్యం కొనసాగించింది. ప్రభుత్వంతో తమ పోరాట ఫలితంగా అధికారికంగా వారు ప్రజలకు విజ్ఞప్తి చేయవలసివచ్చింది. తత్ఫలితంగా వారు బూర్జువా వర్గానికి చెందిన. రాడికల్, రిపబ్లికన్ వర్గాలకు, పెటీ బూర్జువాకు స్థానాలను కోల్పోవలసి వచ్చింది. కాగా వీరి వెనుక విప్లవ కార్మికులున్నారు. 1830 నుండి వీరు, బూర్జువా వర్గము, రిపబ్లికన్లు అనుమానించిన దానికంటె ఎక్కువ రాజకీయ ప్రాబల్యం సంపాదించారు. ప్రభుత్వానికి, ప్రతిపక్షానికి మధ్య సంక్షోభం ఏర్పడిన సమయంలో, వీరు వీధి పోరాటాలను ప్రారంభించారు. లూయీ ఫిలిప్పా, అతని ఎన్నికల సంస్కరణలు. అంతర్ధాన మయ్యాయి. అతని స్థానంలో రిపబ్లిక్ ఏర్పడ్డది. ఈ రిపబ్లిక్‌ను విజయవంతమైన కార్మికుల, 'సోషల్ రిపబ్లిక్'గా స్వయంగా నామకరణం చేసుకున్నారు. సోషల్ రిపబ్లిక్ అంటే ఏమిటో కార్మికులతో సహా ఎవరికీ స్పష్టమైన అవగాహన లేదు. అయితే వారి చేతిలో ఆయుధాలున్నాయి. రాజ్యంలో వారొక శక్తిగా ఉన్నారు. కనుక, బూర్జువా రిపబ్లికన్లు అధికారంలోకి వచ్చి, తమ కాళ్ళు పునాదిపై దృఢంగా ఉన్నాయని భావించిన వెంటనే, చేసిన మొదటి పని, కార్మికులను నిరాయుధులను చేయడం. ఇందుకు వారు అవలంభించిన పద్ధతి, ఏమంటే తిరుగు బాటు చేయక తప్పని స్థితికి కార్మికులను నెట్టటం. జూన్ 1848లో ఇది జరిగింది.

నిరుద్యోగులను, దూర ప్రాంతాలకు ప్రవాసం పంపుతామని, బహిరంగంగా ఎదురుతిరిగి, ప్రత్యక్ష విశ్వాస ఘాతుకులుగా బూర్జువా వర్గం ప్రవర్తించింది. తమ చేతిలో సైనిక బలాధిక్యత ఉండే విధంగా వారు ముందే జాగ్రత్త పడ్డారు. అయిదు రోజులు వీరోచితంగా పోరాడిన మీదట కార్మికులు ఓడిపోయారు. దాంతో, నిరాయుధులైన ఖైదీలపై రక్తపు టేరులు ప్రవహించాయి. రోమన్ రిపబ్లిక్ పతన సమయంలో జరిగిన అంతర్యుద్ధం తర్వాత ఇంతటి రక్తతర్పణం ఎన్నడూ జరగలేదు. ప్రత్యేమైన కోర్కెలు, ప్రయోజనాలతో కార్మికులు ఒక ప్రత్యేక వర్గంగా, తమకు ప్రతిస్ఫర్థిగా నిలచిన రోజున, బూర్జువా వర్గం ప్రతీకార చర్యగా ఎంతటి అమానుష కృత్యాలకు తలపడుతుందో మొట్టమొదటిసారిగా అర్థమైంది. ఇంత చేసినా, 1871లో వ్యక్తమైన బూర్జువా దౌర్జన్య కాండతో పోలిస్తే, 1848 కేవలం చిన్న పిల్లల ఆట వంటిది.

అయితే వెన్వెంటనే కఠినమైన శిక్ష అమలు జరగ సాగింది. ఫ్రాన్సును పరిపాలించటానికి కార్మిక వర్గానికి ఇంకా పరిపక్వం రాలేదు. అయితే బూర్జువా వర్గం కూడా ఇక పరిపాలించలేని స్థితికి వచ్చింది. ఫ్రాన్సులో అప్పటికి ఇంకా హెచ్చుమంది రాచరికం వైపు మొగ్గుతో ఉన్నారు. రాచరికం మూడు అనువంశిక రాచరిక పార్టీలు గానూ, నాలుగోదైన రిపబ్లికన్ పార్టీగానూ చీలి ఉంది. కనుక కనీసం ఆ స్థితిలో బూర్జువావర్గం పరిపాలించగల స్థితిలో లేదు. బూర్జువా వర్గ అంతఃకలహాల ఫలితంగా దుస్సాహసికుడైన లూయిబోనాపార్టీ అన్ని కీలక స్థానాలను. సైన్యం, పోలీసు, పరిపాలనా యంత్రాంగాలను స్వాధీనపరచుకున్నాడు. 1851 డిసెంబరు 2న, బూర్జువావర్గం యొక్క ఆఖరు స్థావరాన్ని, జాతీయ శాసన సభను స్వాధీనం చేసుకున్నాడు. రెండవ సామ్రాజ్యం ప్రారంభమైంది. రాజకీయ ఫైనాన్సు రంగాలకు చెందిన దుస్సాహసికుల ముఠా ఒకటి. ఫ్రాన్సును దోపిడీ చేయసాగింది. కాగా అదే సమయంలో పారిశ్రామికాభివృద్ధి కూడా ప్రారంభమైంది బడా బూర్జువావర్గంలో ఒక చిన్న విభాగం, ఈ అభివృద్ధిలో ప్రత్యేకమైన పెత్తనాన్ని సంపాదించుకున్నది. సంకుచిత స్వార్థ బుద్ధి కలిగి, నిత్యం భయంతో వణికిపోయిన లూయీ ఫిలిప్పా కాలంలో ఈ మాత్రం అభివృద్ధి కూడా సాధ్యం కాలేదు. కార్మికుల దాడి నుండి బూర్జువా వర్గాన్ని, బూర్జువా వర్గం దాడి నుండి కార్మికులను రక్షిస్తాననే సాకుతో, లూయిబోనపార్టీ పెట్టుబడిదారుల చేతులలో నుండి రాజ్యాధికారం స్వీకరించాడు. అందుకు ప్రతిఫలంగా, అతని పరిపానలో, దళారీ వ్యాపారం, పారిశ్రామికోత్పత్తి పెరిగాయి. అనగా, ఇంతవరకూ ఎన్నడూ లేనంతగా, మొత్తం బూర్జువా వర్గం సంపద్వంతమైంది. అంతకంటె ఎక్కువగానే, అవినీతి, బహిరంగ దోపిడీ పెరిగిన మాట నిజమే. ఇదంతా,

చక్రవర్తి అస్థానం చుట్టూ ఆవరించి, ఈ అధిక సంపద నుండి తమ అధిక లాభాల శాతాన్ని గుంజుకో సాగింది.

కాగా రెండవ సామ్రాజ్యం ఫ్రెంచి జాతీయ దురహంకారంపై ఆధారపడి ఏర్పడ్డది. 1814లో పోగొట్టుకున మొదటి సామ్రాజ్యపు సరిహద్దులను పునరుద్ధరించాలని, కనీసం, ప్రథమ రిపబ్లిక్ నాటి సరిహద్దులను పునరుద్ధరించాలనేది వారి కోర్కె. పాత రాచరికం సరిహద్దులలో, ఫ్రెంచి సామ్రాజ్యం, లేక 1815 నాటి కుదించబడిన సరిహద్దులలో ఫ్రెంచి సామ్రాజ్యం పునఃస్థాపించటం, జరిగే పనికాదు. జరిగినా ఎక్కువ కాలం నిలచేది కాదు. ఫ్రెంచి సరిహద్దులను విస్తరించాలనే అన్ని కోర్కెలలోకి, రైన్‌నది ఎడమ తీరాన ఉన్న జర్మన్ భూభాగం వరకు విస్తరించాలనే కోర్కె అంతగా, ఫ్రెంచి జాతీయ దురహంకారవాదుల కండ్లు మిరుమిట్లు గొలిపే కోర్కె మరొకటి లేదు. రైన్‌నదీ తీరంలో ఒక చదరపు మైలు ప్రాంతం. ఆల్ఫ్స్ ప్రాంతంలో గాని, మరొకచోట గాని పదిమైళ్ళ కంటె కూడా వారికి విలువైంది. రెండవ సామ్రాజ్యం ఏర్పడ్డది అంటే, రైన్ ఎడమ తీరాన్ని ఒక్కసారిగా కాని, అడుగడుగుగా కాని తిరిగి స్వాధీన పరచుకోవాలనే కోర్కె ఆవిర్భవించటం కొద్ది రోజులలో జరిగి తీరుతుంది. 1866 ఆస్ట్రో-ప్రష్యన్ యుద్ధ కాలంలో అట్టి అవకాశం వచ్చింది. నష్ట పరిహారంగా భూభాగాలను ఇప్పిస్తానన్న బిస్మార్క్ మాట బూటకమైంది. తన అత్యాశ అతి మోసపూరిత ప్రవర్తన తననే మోసపుచ్చింది. దాంతో నెపోలియన్‌కు యుద్ధం తప్ప మరో మార్గం లేకపోయింది. ఈ యుద్ధం 1870లో ప్రారంభమైంది. ఈ యుద్ధంలో అతడు మొదట సెడాన్‌కు. ఆ పిమ్మట విల్ హెర్మ్‌షో[2] వద్దకు అతడు నెట్టివేయబడ్డాడు.

అనివార్య ఫలితంగా 1870, సెప్టెంబరు 4న పారిస్ విప్లవం వచ్చింది. సామ్రాజ్యం పేకమేడలాగా కూలిపోయింది. తిరిగి రిపబ్లిక్ ప్రకటితమైంది. కాగా శత్రువు గుమ్మంలోనే ఉన్నాడు. సామ్రాజ్య సైన్యాలు మెజ్ వద్ద దారుణ చక్రబంధంలోనైనా చిక్కుకుని ఉన్నాయి. లేక జర్మనీయుల నిర్బంధంలోనైనా ఉన్నాయి. ఈ అత్యవసర పరిస్థితిలో, వెనుకటి శాసనసభలోని, పారిస్‌కు చెందిన శాసనసభ్యులు 'జాతీయ రక్షణ ప్రభుత్వం'గా ఏర్పడటానికి ప్రజలు అనుమతించారు. ఇంత త్వరగా ప్రజలు ఈ ప్రతిపాదనను ఆమోదించటానికి ఒక కారణం ఉంది. ఏమంటే రక్షణ ప్రయోజనాల కొరకు, ఆయుధాలు ధరించే సామర్థ్యం కలిగిన పారిస్ పౌరులందరూ, ఆయుధాలు ధరించి, జాతీయ దళంలో చేరారు. దాంతో, కార్మికులు అందులో అత్యధిక సంఖ్యాకులైనారు. కాని వెన్వెంటనే, నూటికి నూరుపాళ్ళు బూర్జువా స్వభావం కలిగిన ప్రభుత్వానికి, సాయుధులైన కార్మిక వర్గానికి బహిరంగ ఘర్షణ మొదలైంది. అక్టోబరు 31న, కార్మికుల సైనిక దళాలు, టౌన్‌హాలుపై దాడిచేసి, స్వాధీనం చేసుకున్నాయి. ప్రభుత్వ సభ్యులలో కొందరిని ఖైదు చేశారు. విద్రోహం. వాగ్దానాలను ప్రభుత్వం

బాహాటంగా ఉల్లంఘించడం, పెట్టీ బూర్జువా వర్గానికి చెందిన కొన్ని సైనిక దళాలు జోక్యం – వీటి ఫలితంగా ప్రభుత్వ సభ్యులు విడుదలైనారు. విదేశీ సైనిక అధికారులచే చుట్టుముట్ట బడిన నగరంలో, అంతర్యుద్ధ ప్రజ్వలన ఇష్టంలేక, మాజీ ప్రభుత్వమే అధికారంలో కొనసాగటానికి కార్మికులు ఆమోదించారు.

చిట్టచివరకు, 1871 జనవరి 28న, పారిస్ తిండిలేక లొంగిపోయింది. కాగా, యుద్ధాల చరిత్రలో ఎవ్వరూ, ఎన్నడూ పొందని ప్రతిష్టను పొందింది. కోటలన్నీ లొంగిపోయాయి. నగర ప్రాకారాలపై వారు ఖైదీలుగా మారిపోయారు. కాని జాతీయ రక్షక దళం మాత్రం ఆయుధాలను ఇచ్చివేయలేదు. కాల్పుల విరమణకు మాత్రం అంగీకరించింది. శత్రువులు సైతం పారిస్ నగరంలోకి విజేతలుగా ప్రవేశించలేక పోయారు. పారిస్‌లో ఒక చిన్న భాగాన్ని మాత్రమే వారు ఆక్రమించుకున్నారు. అందులో ఎక్కువగా బహిరంగ ఉద్యానవనాలు మాత్రమే ఉన్నాయి. ఈ ఆక్రమణ ఐనా కొద్ది రోజుల మాత్రమే సాగింది. ఈ ఆక్రమణ కాలంలో సాయుధులైన కార్మికులు ప్రష్యన్‌లపై గట్టి నిఘావేసి, విదేశీ ఆక్రమణదారుకు ఇచ్చిన కొద్దిపాటి భూభాగాన్ని వారు దాటకుండా నిరోధించారు. 131 రోజులపాటు, పారిస్ నగరాన్ని ముట్టడించిన విదేశీ సైనికులు, పారిస్ నగరంల లోపల, పారిస్‌కు చెందిన సాయుధ కార్మికుల ముట్టడికిలోనైనారు. ప్రష్యన్ సామ్రాజ్యంలోని అన్ని సేనలు ఏ సేనల ఎదుట నిరాయుధం చేయబడ్డాయో, అట్టి సేన,పారిస్ కార్మికుల పట్ల భయభక్తులతో ప్రవర్తించక తప్పలేదు. విప్లవ స్థావరమై పారిస్‌లో ప్రవేశించి కక్ష సాదిద్దామనుకున్న ప్రష్యన్ జంకర్లు, మర్యాదతో పక్కన నిలబడి. సరిగ్గా ఆ సైనిక విప్లవానికే వందనం చేయవలసి వచ్చింది.

యుద్ధ కాలంలో పారిస్ కార్మికుల ఒకే ఒక కోర్కె, యుద్ధాన్ని తీవ్రతరం చేయండి అని. తీరా పారిస్ లొంగిపోయి, శాంతి ఏర్పడిన మీదట, ప్రభుత్వానికి థియర్స్ సర్వాధిపతి ఐనాడు. బడా భూస్వాములు, పెట్టుబడిదారుల–అనగా ఆస్తిపర వర్గాల పాలనకు. పారిస్ కార్మికులు సాయుధులై ఉన్నంత కాలం నిరంతర ప్రమాదం తప్పదు అని అతడు గుర్తించక తప్పలేదు. కనుక అతడి మొదటి చర్య కార్మికులను నిరాయుధులను చేయటం. మార్చి 18న, అతడు సైన్యాన్ని పంపి, జాతీయ రక్షక దళం తుపాకులను స్వాధీనం చేసుకోవలసిందిగా ఉత్తర్వు చేశాడు. ఈ తుపాకి దళాన్ని పారిస్ ముట్టడి కాలంలో ప్రజల చందాలతో ఏర్పరచారు. ఈ ప్రయత్నం విఫలమైంది. పారిస్ నగరంలోని ఆఖరు పౌరునితో సహా ఈ యత్నాన్ని ప్రతిఘటించారు. వర్సెల్సెలో తిష్టవేసిన ఫ్రెంచి ప్రభుత్వానికి, పారిస్ నగరానికి మధ్య యుద్ధ ప్రకటన జరిగింది. మార్చి 26న పారిస్ కమ్యూన్ ఎన్నికైంది. మార్చి 28న అధికారపూర్వక ప్రకటన జరిగింది. జాతీయ రక్షక దళ కేంద్ర కమిటీ అంతవరకూ ప్రభుత్వం నిర్వహిస్తూ

వచ్చిన సంస్థ, తన రాజీనామాను కమ్యూన్‌కు సమర్పించింది. కాగా అప్రతిష్టాకరమైన 'నైతిక పోలీసు' బలగాన్ని పారిస్‌లో అంతకుముందే కమ్యూన్ రద్దుచేసింది. మార్చి 31న సైనిక సమీకరణ ఉత్తరవును, స్థిరసైన్యాన్ని కమ్యూన్ రద్దు చేసింది. జాతీయ రక్షక దళం ఒక్కటే ఏకైక సాయుధ సైన్యమని, ఆయుధాలు ధరించే సామర్థ్యం కలిగిన ప్రతి వ్యక్తి సైన్యంలో నమోదయ్యే అర్హత కలిగి ఉన్నాడని ప్రకటించింది. 1870 అక్టోబరు 1871 ఏప్రిల్ మధ్య కాలంలో నివాస గృహాల అద్దె చెల్లింపు లన్నింటికీ అది ముదరా ఇచ్చింది. ఆపాటికే వసూలైన డబ్బును, భవిష్యత్ అద్దె చెల్లింపులుగా పరిగణించింది. మునిసిపాలిటీ రుణ కార్యాలయంలోని వస్తువుల అమ్మకాన్ని నిషేధించింది. అదే రోజున, కమ్యూన్‌కు ఎన్నికైన విదేశీయులందరూ ఆ పదవులలో ధ్రువపరచబడ్డారు. ఏమంటే "కమ్యూన్ పతాకం, ప్రపంచ రిపబ్లిక్‌కు చెందిన పతాకం" కనుక, ఏప్రిల్ 1న, వేతన నిర్ణయం జరిగింది. కమ్యూన్‌లోని అత్యున్నతాధికారి, అదే విధంగా కమ్యూన్ సభ్యుల నెల జీతం 6 వేల ఫ్రాంకులు (4800 మార్కులు) మించరాదని నిర్ణయించబడ్డది. ఆ మర్నాడు. ప్రభుత్వాన్ని మత సంస్థను వేరుచేస్తూ కమ్యూన్ ఉత్తర్వు చేసింది. మత ప్రయోజనాల కొరకు ప్రభుత్వం ఎట్టి ఖర్చు పెట్టరాదని నిషేధిస్తూ, చర్చి ఆస్తిని యావత్తూ ప్రభుత్వ ఆస్తిగా మార్చివేసింది. ఫలితంగా ఏప్రిల్ 8 నుండి అన్ని మత పాఠశాలలలోని అన్ని మత చిహ్నాలు, చిత్రపటాలు, ప్రార్థనలు, పిడి సూత్రాలు–ఒక్క మాటలో వ్యక్తి అంతరాత్మకు సంబంధించిన అన్ని బాహ్య చిహ్నాలు– తొలగిస్తూ ఉత్తర్వు జారీ ఐంది. ఈ ఉత్తర్వు క్రమేపీ అమలు పరచబడ్డది. నిర్బంధించబడిన కమ్యూన్ ఖైదీలపై వర్సైల్స్ ప్రభుత్వం రోజూ కాల్పులు చేస్తూ ఉండేది. అందుకు ప్రతిగా, పరిహారంగా స్వాధీనపరచుకోబడిన వర్సైల్ పౌరులందరినీ కమ్యూన్ నిర్బంధంలో పెట్టాలని ఉత్తర్వు జారీ ఐంది. కాని ఈ ఉత్తర్వు అసలు అముల జరగనేలేదు. 6వ తేదీన జాతీయ రక్షక దళానికి చెందిన 137 వ విభాగం, వధ్యశిలకు సంబంధించిన గండ్రగొడ్డలిని స్వాధీనం చేసుకుని, బహిరంగంగా దగ్ధం చేసింది. పౌరులంతా ఈ చర్యకు ఎంతో హర్షం ప్రకటించారు. వెండోంలోని విజయస్తంభాన్ని ధ్వంసం చేయాలని 12వ తేదీన నిర్ణయించింది. ఏమంటే, ఈ స్తంభం 1809లో, నెపోలియన్‌చే, శత్రువుల నుండి స్వాధీనం చేసుకున్న తుపాకీ గొట్టాలను కరిగించడం ద్వారా నిర్మించబడ్డది కనుక అది జాతీయ దురహంకారానికి చిహ్నంగా ఉంది. ఈ నిర్ణయం మే 16న అమలు జరిగింది. యజమానులు మూసివేసిన ఫ్యాక్టరీల లెక్కలను తయారు చేయాలని, అందులో పని చేసిన కార్మికుల నిర్వహణలో అవి తిరిగి పని చేసేందుకు వీలుగా పథకాలు రూపొందించాలని ఏప్రిల్ 16న ఉత్తర్వు జారీ ఐంది. కార్మికులందరినీ సహకార సంఘాలలో ఏర్పరచి, ఈ సంఘాలన్నిటినీ గొప్ప సమాఖ్యగా ఏర్పరచాలని పథకాలు

వేశారు. రొట్టెల దుకాణాలలోను, ఉద్యోగ కల్పనా కేంద్రాలలోను రాత్రిపూట పనిని. 20వ తేదీన నిషేధించారు రెండవ సామ్రాజ్యం నాటి నుండి ఈ పరిశ్రమలు పోలీసులు నియమించిన కొందరు వ్యక్తుల గుత్త సంస్థలుగా ఉండిపోయాయి. కార్మికులను దోపిడీ చేయటంలో వీరు అగ్రగణ్యులు. ఈ పరిశ్రమలను పారిస్‌లోని 20 విభాగాల మేయర్లకు బదలాయించారు. కిల్లీ బడ్డీలన్నీ మూసివేయాలని, ఏప్రిల్ 30న ఉత్తర్వు చేశారు. ఇవి, కార్మికులను దోపిడీ చేసే ప్రైవేట్ సంస్థలనీ, తమ ఉత్పాదక పరికరాలను, రుణ సౌకర్యాలను తామే కలిగి ఉండాలనే కార్మికుల హక్కుకు ఇవి భంగరమని ఆ ఉత్తర్వులో పేర్కొన్నారు. పదహారవ లూయీని శిరచ్ఛేదం చేసినందుకు ప్రాయశ్చిత్తంగా నిర్మించబడిన పాప పరిహార దేవాలయాన్ని, ధ్వంసం చేయాలని మే 5న ఉత్తర్వు చేశారు.

ఈ విధంగా మార్చి 18 నుండే పారిస్ ఉద్యమం యొక్క వర్గ స్వభావం సూటిగా, స్పష్టంగా ముందుకు రాసాగింది. విదేశీ దురాక్రమణదారులకు వ్యతిరేకంగా జరిగే పోరాటంలో, అంతకు ముందు ఈ వర్గ స్వభావం మరుగున పడ్డది. కార్మికులు లేక కార్మికుల గుర్తింపు పొందిన ప్రతినిధులు మాత్రమే కమ్యూన్‌లో సభ్యత్వం కలిగివున్నారు. కనుక కమ్యూన్ నిర్ణయాల కార్మికవర్గ స్వభావం స్పష్టంగా వ్యక్తం కాసాగింది. రిపబ్లికన్ బూర్జువా వర్గం కేవలం, పిరికితనం వలన చేయలేక పోయిన నిర్ణయాలను కమ్యూన్ అమలు జరిపింద. కాగా ఈ నిర్ణయాల అమలు వలన, కార్మికవర్గ స్వేచ్ఛా కార్యకలాపాలు కొనసాగేందుకు అవకాశం లభించింది. ప్రభుత్వానికి సంబంధించినంత వరకు మతం కేవలం వ్యక్తిగత వ్యవహారం అనే సూత్రం అమలు జరిగింది. కమ్యూన్ మరికొన్ని ఉత్తర్వులు జారీ చేసింది. ఇవి సూటిగా కార్మిక వర్గానికి లాభకరమైనవి, లేక పాత సామాజిక వ్యవస్థను, పాక్షికంగానే కావచ్చు లోతుగా చీల్చి వేసేవి ముట్టడిలో ఉన్న నగరంలో, మహాఅయితే ఇలాంటివాటి అమలు ప్రారంభించవచ్చు, పూర్తి లక్ష్యసాధన సాధ్యం కాదు. మే నెల తర్వాత కాలం అంతటా అధికాధికంగా వర్సెల్స్ ప్రభుత్వం సమీకరించిన సైన్యాల నుండి ఆత్మరక్షణ చేసుకోవటమే కామ్యూన్ కర్తవ్యమైంది.

పారిస్ పశ్చిమ శివార్లను దాటి, నూలీ నదిని అధిగమించి, వర్సెల్స్ సేనలు, ఏప్రిల్ 7న, సేని స్థావరాన్ని పట్టుకున్నాయి. మరొకవైపున 11వ తేదీన, జనరల్ యూడిస్ ఆ సేనలకు తీవ్ర నష్టాలు కలిగించి వెనకకు నెట్టివేశాడు. పారిస్‌పై నిరంతరం తుపాకి గుండ్లు కురుస్తూనే ఉన్నాయి. ప్రష్యన్‌లు పారిస్‌పై నిరంతరం తుపాకి గుండ్లు వర్షించటం మహాపరాధం అని ఆనాడు విమర్శించిన వారే నేడీ ఘాతుకానికి పాల్పడ్డారు. సెడాన్, మెచ్ నగరాలలో ప్రష్యన్ సేనలచే ఖైదు చేయబడిన ఫ్రెంచి ఖైదీలను వెంటనే విడుదల చేయాలని, వీరు ఇప్పుడు ప్రష్యన్ ప్రభుత్వానికి

ప్రాధేయపడసాగారు. ఆ ఖైదీలు విడుదలైతే, తమ తరఫున వారు పారిస్ నగరాన్ని తిరిగి స్వాధీనం చేసుకోగలరని వీరి ఆశ. మే నెల మొదటి నుండి క్రమంగా ఈ సేనలు రంగంలోకి రాసాగాయి. దాంతో వర్సెల్స్ సేనలకు స్పష్టమైన ఆధిక్యత కలిగింది. ఏప్రిల్ 23నే, ఈ విషయం స్పష్టమైంది. ఏమంటే రెండు సార్లు కమ్యూన్ సభ్యునిగా ఎన్నికై, క్లార్ వాక్స్‌లో ఖైదీగా ఉన్న బ్లాంక్విని వదలి వేస్తే, అందుకు ప్రతిగా పారిస్ ఆర్చి బిషప్‌ను, ఇంకా అనేకమంది మత గురువులను విడుదల చేస్తామని కమ్యూన్ ప్రతిపాదించగా, ఆ విషయమై రాయబారాలే అక్కరలేదని, థయర్స్ చర్చలను తుంచివేశాడు. అంతవరకూ డొంక తిరుగుడుగా నంగి మాటలు మాట్లాడే థయర్స్. అకస్మాత్తుగా, బెదిరింపులతో దురహంకారంతో, మోటుతనంగా మాట్లాడటం ప్రారంభించాడు. మే 3వ తేదీన వర్సెల్స్ సేనలు, దక్షిణ రంగంలో, మౌవీన్ సెక్యెట్ స్థావరాన్ని కైవసం చేసుకున్నాయి. 9వ తేదీన ఇసేకోట పట్టుకున్నాయి. తుపాకి గుండ్లవర్షం ద్వారా అది ఆపాటికే పూర్తిగా ధ్వంసమైంది. 14వ తేదీన వన్వెకోట పడిపోయింది. పశ్చిమ రంగంలో వారు క్రమంగా ముందుకు చొచ్చుకు వచ్చారు. అనేకమైన గ్రామలను, భవనాలను పట్టుకుని నగర ప్రాకారాల దాకా వచ్చారు. చివరకు ప్రధాన రక్షణ శ్రేణులను చేరుకున్నారు. 21వ తేదీన, అక్కడ ఉన్న జాతీయ రక్షక దళాల అశ్రద్ధా విద్రోహాల ఫలితంగా నగరం మధ్యలోనే వారు ప్రవేశించ గలిగారు. ఉత్తర తూర్పు కోటలపై ఆధిపత్యం కలిగి వున్న ప్రష్యన్లు నగర ఉత్తర ప్రాంతంలోకి వర్సెల్స్ సేనలు రావటానికి అనుమతించారు. సంధి షరతుల ననుసరించి ఆ ప్రాంతంలోకి వారు ప్రవేశించ కూడదు. ఆ విధంగా విస్తృత రంగంలో దాడి చేసుకుంటూ ముందుకుసాగారు సంధి షరతులకు లోబడిన ప్రాంతం గదా అనే ధైర్యంతో ఆ ప్రాంతంలో పారిస్ సేనలు బలహీనంగా ఉన్నాయి. వీటన్నిటి ఫలితంగా పారిస్ పశ్చిమ అర్ధ భాగంలో ప్రతిఘటన చాలా బలహీనంగా ఉంది. ఇది విలాస భవనాల ప్రాంతం. దాడి సేనలు తూర్పుకు సాగి, కార్మిక వర్గం నివసించే ప్రధాన నగరంలోకి ప్రవేశించిన కొద్దీ ప్రతిఘటన తీవ్రతరం కాసాగింది. 8 రోజుల పోరాటం తర్వాతనే, బెలివిరీ, మెనిక్ మోంటాట్ గుట్టపైన ఉన్న కమ్యూన్ ఆఖరు సంరక్షకులు లొంగిపోయారు. వెంటనే నిరాయుధులైన, స్త్రీ పురుష బాలుర ఊచకోత ప్రారంభమైంది. గత వారం రోజులుగా రోజు రోజుకూ పెరుగుతున్న ఈ ఊచకోత తారస్థాయికి చేరుకున్నది. మామూలు తుపాకి కాల్పులతో తగినంత త్వరగా వీరిని చంపటం సాధ్యం కాలేదు. ఓడిపోయిన వారిని వందల సంఖ్యలో ఫిరంగి గుండ్లకు గురి చేశారు. ఈ చిత్రవధలో ఆఖరు ఘట్టం పెరీలాచే స్మశాన వాటికలోని "ఫెడరల్స్ గోడ" (ఇప్పుడు కమ్యూనార్డ్‌ల గోడ) వద్ద జరిగింది. ఇక్కడ మూకుమ్మడి హత్యాకాండ జరిగింది. ఈ గోడ ఇప్పటికీ నిలిచే ఉంది. కార్మిక వర్గం తన హక్కులకై నిలబడిన మరుక్షణం,

పాలకవర్గం ఎంతటి అమానుష హత్యాకాండకు తలపడుతుందో తెలియజేసే సజీవ సాక్ష్యం ఇది. ఇంతమందిని చంపినా ఫలితం కలగక పోయిన మీదట, మూకుమ్మడి అరెస్టులు జరిగాయి. ఖైదీల నుండి విచక్షణా రహితంగా కొందరిని ఏరి కాల్చివేశారు. మిగతా వారిని సైనిక శిబరాలకు చేర్చి, సైనిక కోర్టు విచారణకు ఉంచారు. పారిస్‌లో ఈశాన్య అర్ధభాగాన్ని చుట్టముట్టి ఉన్న ప్రష్యన్ సైనికులకు, ఖైదీలు ఎవరూ అటునుంచి పారిపోకుండా అటకాయించవలసిందిగా ఉత్తర్వులు జారీ అయ్యాయి. కాగా ఉన్నత సైనిక అధికారుల ఉత్తర్వులకంటె కూడా. మానవతా దృష్టి పైచేయి సంపాదించింది. ఖైదీలు కొందరు పారిపోతుండగా, ప్రష్యన్ సైనికులు చూచీ చూడకుండా ఊరుకున్నారు. వారిపై అధికారులు కూడా చూడనట్లు కళ్ళు మూసుకున్నారు. ముఖ్యంగా ఈ సందర్భంలో సాక్షన్ సైనిక పటాలం ప్రశంసార్హం వీరు ఎంతో మానవతా దృష్టి ప్రదర్శించారు. కమ్యూన్ యోధులు చాలామంది తప్పించుకు పారిపోతుంటే చూస్తూ ఊరుకున్నారు.

*   *   *

ఇదంతా జరిగి ఇరవై ఏండ్లు ఐపోయింది. 1871 పారిస్ కమ్యూన్ చరిత్రాత్మక ప్రాధాన్యతను కార్యకలాపాలను ఈనాడు వెనక్కుతిరిగి పరిశీలించినట్లయితే. 'ఫ్రాన్సులో అంతర్యుద్ధం'లోని వర్ణనలకు తోడు మరికొన్ని చేర్పులు చేయవలసిన అవసరం ఉందని మనం గుర్తిస్తాము.

కమ్యూన్ సభ్యులు రెండుగా చీలి ఉన్నారు. మెజారిటీ బ్లాంక్విస్టులు. జాతీయ రక్షకదళ కేంద్ర కమిటీలో కూడా వీరు అత్యధిక మెజారిటీలో ఉన్నారు. మైనారిటీ వారు, అంతర్జాతీయ కార్మిక సంస్థ సభ్యులు. ప్రధానంగా వీరు ప్రౌడన్‌కు చెందిన సోషలిస్టు పంథా అనుచరులు. బ్లాంక్విస్టులలో అత్యధికులు, కేవలం విప్లవకర కార్మికవర్గ సహజాతం వలన మాత్రమే సోషలిస్టులు. వారిలో కొద్దిమంది మాత్రమే సూత్రాలకు సంబంధించిన విస్పష్టతను, వైలాంట్ ద్వారా, పొంది ఉన్నారు. ఇతడు జర్మన్ శాస్త్రీయ సోషలిజంతో పరిచయం కలవాడు. కనుక ఆర్థిక రంగంలో అనేక విషయాలు అపరిష్కృతంగా ఉండిపోవడం సహజం. ఈనాటి మన దృష్టిలో కమ్యూన్ ఆ పనులను చేసి ఉండవలసింది. మనము ఏ మాత్రమూ అర్థం చేసుకోలేని విషయం ఏమంటే బ్యాంకు ఆఫ్ ఫ్రాన్సు గేట్లముందు పవిత్రమైన భయభక్తులతో అలాగే నిలచి వుండటం. రాజకీయంగా కూడా ఇది తీవ్రమైన తప్పిదం. కమ్యూన్ చేతుల్లో బ్యాంకు ఉన్నట్లయితే పదివేలమంది యుద్ధ ఖైదీల కంటె విలువైన సాధనంగా అది ఉండేది. యావత్తు ఫ్రెంచి బూర్జువా వర్గము. కమ్యూన్‌తో ఒప్పందానికి రావలసిందిగా వర్సేలిస్ ప్రభుత్వంపై వత్తిడి తెచ్చి ఉండేది. ఐనప్పటికి బ్లాంక్విస్టులు, ప్రౌడానిస్టులు కలిసివున్న కమ్యూన్ చాలా మంచి పనులు చేయనే చేసింది. సహజంగానే కమ్యూన్ జారీ చేసిన

ప్రధాన ఉత్తర్వులన్నిటికీ ప్రౌడానిస్టులు కారణం ప్రశంసార్హ ములైన వాటికి, తద్వ్యతిరేకమైన వాటికి కూడా వారే బాధ్యులు. రాజకీయమైన మంచి, చెడులు రెంటికి బ్లాంక్విస్టులు కారణం. జరిగినదేమంటే, ఉభయులూ తమ సిద్ధాంతాలు సూచించిన దానికి విరుద్ధంగా ప్రవర్తించారు. పిడివాదులు అధికార స్థానాలలోకివస్తే ఇంతే జరుగుతుంది. చరిత్ర వైపరీత్యాలలో ఇది ఒకటి.

చిన్న రైతు, చేతిపని వర్గానికి చెందిన సోషలిస్టు ప్రౌడాన్, సంఘ నిర్మాణమంటే అతనికి తగిన విద్వేషం, అందులో మంచి కంటె చెడు ఎక్కువ ఉన్నదని, సహజంగానే అది ఎట్టి ఫలితాన్ని ఇవ్వలేదని, కార్మికుల స్వేచ్ఛకు సంకెళ్ళు వేస్తుంది. కనుక. హానికరమని, నిరర్థకమైన. భారంతో కూడిన పనికిమాలిన పిడివాదమని, కార్మికుని స్వేచ్ఛకే కాక, శ్రమ ఆర్థిక విధానానికి కూడా వ్యతిరేకమని, దాని లాభాల కంటె, నష్టాలు అతి త్వరగా, గుణీకృతమౌతాయని ఆయన భావం. తద్వ్యతిరేకంగా పోటీ, పని విభజన, స్వంత ఆస్తి, ఆర్థికంగా ఉపయోగపడే శక్తులని అతని విశ్వాసం. రైల్వేల వంటి భారీ పరిశ్రమలు, భారీ సంస్థల విషయంలో మాత్రమే-ప్రౌడాన్ దృష్టిలో ఇవి మినహాయింపులు. కార్మికుల సంఘ నిర్మాణం లాభకరం. (చూ. విప్లవాన్ని గురించి సాధారణ దృక్పథం-మూడవ ముద్రణ).

1871 కల్లా, కళాత్మక చేతి పనులకు కేంద్రమైన పారిస్‌లో సైతం భారీ పరిశ్రమ ఒక మినహాయింపుగాక, సర్వసాధారణమైంది. కనుక కమ్యూన్ జారీ చేసిన ఉత్తర్వులన్నిటిలోకి ప్రధానమైనదేమంటె, ప్రతి ఫ్యాక్టరీలోని కార్మికులు సంఘంగా ఏర్పడటమేగాక, అన్ని సంఘాలు సమాఖ్యగా ఏర్పడాలని, భారీ పరిశ్రమలకు మాత్రమే గాక, చిన్న పరిశ్రమలకు కూడా ఆదేశాలు ఇవ్వబడ్డాయి. ఈ నిర్మాణం. 'ఫ్రాన్సులో అంతర్యుద్ధంలో' మార్క్స్ చాలా చక్కగా చెప్పినట్లు, చివరకు కమ్యూనిజానికే త్రోవతీస్తుంది. అనగా ప్రౌడాన్ సిద్ధాంతానికి పూర్తి వ్యతిరేకమైన పరిణామం సంభవిస్తుంది. కనుక, కమ్యూన్, ప్రౌడాన్ తరహా సోషలిస్టు సిద్ధాంతానికి సమాధి కట్టింది. ఈనాడు ఈ ధోరణి, ఫ్రెంచి కార్మికవర్గ గ్రూపుల నుండి పూర్తిగా అంతర్ధానమైపోయింది. ప్రస్తుతం, 'మార్క్సిస్టు'లలోనూ, పాసిబ్లిస్టులలోనూ[3], మార్క్స్ సిద్ధాంతమే ఎట్టి మినహాయింపు లేకుండా చలామణి అవుతున్నది. రాడికల్ బూర్జువా వర్గంలో మాత్రమే ప్రౌడానిస్టులు యింకా వున్నారు.

బ్లాంక్విస్టులు ఇంతకంటె మెరుగుగా లేరు. కుట్ర వాతావరణంలో వారు పెరిగారు. అందుకు సంబంధించిన కఠిన క్రమశిక్షణవలన వారు ఐక్యంగా నిలచివున్నారు. కొద్దిమంది, చక్కగా సంఘటితులైన, సాహసికులు, సరియైన కాలంలో అధికార స్థావరాలను కైవసం చేసుకోవటమేకాక అపారమైన, నిర్దాక్షిణ్యమైన శక్తియుక్తులను ప్రదర్శించి అధికారాన్ని కాపాడుకోగలరని, ప్రజలందరినీ విప్లవ

వెల్లువలోకి నెట్టగలరని, వారందరూ ఈ చిన్న నాయకశ్రేణి చుట్టూ సమీకృతులౌతారని వారి సిద్ధాంతం, ఈ సిద్ధాంతాన్ననుసరించి అధికారం అంతా అత్యంత కఠినమైన, నియంతృత్వపూరితమైన కేంద్రీకృత వ్యవస్థ ఐన నూతన విప్లవ ప్రభుత్వం చేతుల్లో వుండాలి. బ్లాంక్విస్టులు అత్యధికులుగా వున్న కమ్యూన్ ఆచరణలో ఏమి చేసింది? రాష్ట్రాలలో ఫ్రెంచి ప్రజలకు అది చేసిన విజ్ఞప్తులన్నిటిలోను, పారిస్‌లోని అన్ని ఫ్రెంచి కమ్యూన్‌లతో కలిసి స్వేచ్ఛాయుత సమాఖ్యగా రూపొందాలని, మొట్టమొదటిసారిగా జాతి అంతా కలిసి ఒక జాతీయ సంస్థను ఏర్పరచాలని విజ్ఞప్తి చేసింది. వెనుకటి కేంద్రీకృత ప్రభుత్వం యొక్క నిరంకుశ ధోరణిని ధ్వంసం చేయవలసి వుంది. 1798లో నెపోలియన్ సృష్టించిన సైనిక, రాజకీయ, పోలీసు, బురాక్రటిక్ యంత్రాంగానికి సంబంధించిన కేంద్రీకృత నిరంకుశత్వం. ఏ నిరంకుశ యంత్రాంగాన్ని అధికారంలోకి వచ్చిన ప్రతి ప్రభుత్వమూ, వెనకటి ప్రభుత్వం నుంచి స్వీకరించి, ప్రతిపక్షంపై ప్రయోగిస్తూ వచ్చిందో సరిగ్గా ఆ నిరంకుశ యంత్రాంగం పారిస్‌లో పతనమైనట్లే, దేశమంతటా పతనం కావలసి వుంది.

మొట్టమొదటినుండి, కమ్యూన్ ఒక అంశాన్ని గుర్తించక తప్పలేదు. కార్మికవర్గం ఒకసారి అధికారంలోకి వచ్చినమీదట, పాత రాజ్యాంగ యంత్రంతో అది ప్రభుత్వ నిర్వహణ చేయలేదు. తాను అప్పుడే సంపాదించుకున్న స్థావరాన్ని తిరిగి పోగొట్టుకోకుండా వుండాలంటే, కార్మికవర్గం ప్రభుత్వంలోని నిర్బంధ యంత్రాంగాన్ని అంతారద్దు చేయవలసి ఉంటుంది. ఈ యంత్రాంగమంతా అంతకు ముందు కార్మికవర్గం పైననే ప్రయోగించబడి వుంది. మరొకవైపున, తన శాసనసభ్యులు, ఉద్యోగుల నుండి కూడా తాను రక్షించుకోవాలి. వారినందరినీ ఎట్టి మినహాయింపు లేకుండా, తిరిగి వెనక్కు పిలిపించుకునే హక్కుకు లోబరచి ఉంచాలి. పాత రాజ్యాంగ యంత్రం యొక్క విశిష్ట లక్షణం ఏమిటి? మొదట్లో తేలికైన పని విభజన ద్వారా సమాజం తన ఉమ్మడి ప్రయోజనాల రక్షణ కవసరమైన సాధనాలను సృష్టించుకున్నది. వీటన్నిటికి శిఖరాయమానంగా రాజ్యాంగ యంత్రం వుండేది. కాలక్రమేణ, తమ ప్రత్యేక ప్రయోజనాల సాధనకుగాను, ఈ సాధనాలు ప్రజలకు సేవకులుగా వుండే స్థితి నుండి ప్రజలకు యజమానులుగా మారిపోయాయి. అనువంశిక రాచరిక వ్యవస్థలోనేగాక, ప్రజాతంత్ర రిపబ్లిక్‌లో కూడా ఇది మనం చూడవచ్చు. ఉత్తర అమెరికా అంతగా, మరే దేశంలో కూడా రాజకీయవాదులు జాతిలో ప్రత్యేకమైన, శక్తివంతమైన విభాగంగా లేరు. అక్కడ రెండే పార్టీలున్నాయి. దఫదఫాలుగా ఇవే అధికారంలోకి వస్తుంటాయి. వీటిపై యాజమాన్యం వహించే ప్రజలు, రాజకీయాలను ఒక వ్యాపారంగా మార్చివేశారు. కేంద్ర, రాష్ట్ర శాసనసభ సభ్యత్వాలలో వీరు దళారీ వ్యాపారం చేస్తూవుంటారు. తమ పార్టీ తరపున ఆందోళన చేసి, విజయం చేకూర్చి, దాంతో

వచ్చే ప్రతిఫలంతో వారు జీవిస్తూ వుంటారు. వీరి పెత్తనాన్ని తొలగించుకోటానికి గత ముప్పై యేండ్లుగా అమెరికన్లు ఎలా ప్రయత్నిస్తున్నారో మనకు తెలుసు. ఈ పెత్తనం వారికి దుర్భరమైంది. అయినా వారు మరింతగా ఈ అవినీతి బురదలోకి కూరుకుపోతున్నారు. మొదట్లో సమాజానికి ఒక ఉపాంగంగా మాత్రమే వుండవలెనని ఉద్దేశింపబడిన, ప్రభుత్వ యంత్రాంగం, సమాజంతో సంబంధంలేని స్వతంత్ర శక్తిగా రూపొందటం. అమెరికాలోనే మనం ఖచ్చితంగా చూడగలం. ఇక్కడ రాజవంశం. లేదు. ప్రభు కుటుంబాలు లేవు, ఇండియన్లపై నిఘా వేసే కొద్దిమంది సైనికులు తప్పస్థిర సైన్యం లేదు. స్థిరమైన ఉద్యోగాలు, పెన్షన్ సౌకర్యాలు కలిగిన బ్యూరాక్రటిక్ యంత్రాంగం లేదు. అయినప్పటికీ ఇక్కడ రెండు పెద్ద రాజకీయ గూండా ముఠాలను మనం చూస్తున్నాం. ఒకరి తర్వాత ఒకరుగా వీరు రాజ్యాధికారాన్ని స్వాధీనం చేసుకుంటూ వుంటారు. అత్యంత అవినీతికర పద్ధతులలో, అత్యంత అవినీతికర లక్ష్యాలకై ప్రభుత్వ యంత్రాంగాన్ని వినియోగించుకుంటూ వుంటారు. ఈ రెండు దారిదోపిడీ రాజకీయ ముఠాలను అదుపులో పెట్టేందుకు, జాతికి శక్తిలేదు. వీరు పేరుకు ప్రజా సేవకులు. నిజానికి వారిపై పెత్తనం చేస్తూ దోపిడీ చేస్తూ ఉంటారు.

రాజ్యాంగ యంత్రమూ, దాని సాధనాలు, ప్రభుత్వానికి సేవకులుగా వుండే స్థితి నుండి దాని యజమానులుగా మారటం, అన్ని వెనుకటి రాజ్యాంగ యంత్రాలలోను అనివార్యమైన పరిణామం. ఈ పరిణామాన్ని అడ్డుకోవటానికి, కమ్యూన్ రెండు, లోపరహితమైన చర్యలను తీసుకున్నది. మొదటి చర్య ఏమంటే, పరిపాలన,న్యాయ, విద్యా శాఖలకు చెందిన ఉద్యోగులందరినీ, సార్వజనీన ఓటింగ్ ప్రాతిపదికపై ఎన్నికచేసే పద్ధతిని ప్రవేశపెట్టింది. ఏ సమయంలోనైనా ఓటర్లు వీరిని వెనక్కు పిలిపించే హక్కును కలిగి వుంటారు. రెండవ చర్య. ఉద్యోగులందరికీ, ఉన్నత స్థాయి లేక తక్కువ స్థాయికి చెందినప్పటికీ కార్మికులకిచ్చే వేతనాన్నే నిర్ణయించారు. ఏ ఉద్యోగికైనా లభించే అత్యున్నత వేతనం 6 వేల ఫ్రాంకులు. ఈ విధంగా పదవులకు, అధికారానికి ఎగబ్రాకే ధోరణికి సమర్థవంతమైన అడ్డుగోడ నిర్మించారు. దీంతోపాటు ప్రాతినిధ్య సంస్థల సభ్యులు. విధిగా పాటించవలసిన కొన్ని ఆదేశాలను చేర్చారు.

పాత రాజ్యాంగ యంత్రాన్ని బద్దలుచేసి, దాని స్థానంలో నిజంగా ప్రజాతంత్ర స్వభావం కలిగిన నూతన రాజ్యాంగ యంత్రాన్ని ఏర్పరచిన క్రమం, ఈ గ్రంథం మూడవ భాగంలో వివరంగా వర్ణించబడింది. కాని అందులోని ముఖ్యలక్షణాలను గురించి ఇక్కడ క్లుప్తంగా వివరించటం అవసరం. ఏమంటే, రాజ్యాంగ యంత్రం పట్ల మూఢభక్తి, జర్మనీలో తత్వ శాస్త్రం నుండి బూర్జువా వర్గ సాధారణ చైతన్యానికి, చివరకు చాలామంది కార్మికుల చైతన్యంలోకి సైతం వ్యాపించి వుంది. తాత్విక అవగాహన ననుసరించి, రాజ్యాంగ యంత్రం, భావ సాక్షాత్కరణ. దేవుని రాజ్యం

భూమిపై అవతరించటం తాత్విక పరిభాషలోకి మారిస్తే, శాశ్వత సత్యం. న్యాయం, అమలు జరిపే లేక జరపవలసిన యంత్రాంగం. ప్రభుత్వం ఈ అవగాహన ఫలితంగా ప్రభుత్వం దానికి సంబంధించిన అంశాలు అంటే మూఢభక్తి ఒకటి ఏర్పడతున్నది. ఇందుకు మరో కారణం కూడా వున్నది. చిన్నప్పటినుండి ఒక విషయాన్ని ఇక్కడ నూరిపోస్తున్నారు. సమాజం అంతటికి వర్తించే ఉమ్మడి ప్రయోజనాలను, కర్తవ్యాలను నిర్వహించటానికి ప్రభుత్వ యంత్రాంగం, విస్తారంగా వున్న దాని ఉద్యోగ బృందం తప్ప మరొక మార్గం లేదని, అనాదిగా యిలాగే జరుగుతున్నదని, ఇకముందూ యిలాగే జరగక తప్పదనేదే ఆ మూఢవిశ్వాసం. ఆనువంశిక రాచరికాన్ని వదలించుకుని, ప్రజాతంత్ర రిపబ్లిక్ పై ప్రమాణం చేయటంతో తామొక గొప్ప మూఢనమ్మకం నుండి బైటపడినట్లుగా, అసాధారణమైన సాహసిక చర్య తీసుకున్నట్లుగా ప్రజలు భావిస్తున్నారు. నిజానికి రాజ్యాంగ యంత్రం, ఒక వర్గంపై మరొక వర్గం దోపిడీ చేసే సాధన తప్ప మరొకటి కాదు, రాచరిక వ్యవస్థలోనైనా, ప్రజాతంత్ర రిపబ్లిక్‌లోనైనా యింతే వర్గాధిపత్యం కొరకు విజయవంతంగా పోరాడిన కార్మిక వర్గానికి అనివార్యంగా సంక్రమించిన దుష్ట వారసత్వం యిది. ఈ యంత్రాంగం యొక్క అత్యంత లోపభూయిష్టమైన విభాగాలను, విజయవంతమైన కార్మికవర్గం వెన్వెంటనే, వీలైనంతమేరకు చెక్కిపోరేయక తప్పదు. స్వేచ్ఛాయుత నూతన సామాజిక పరిస్థితులలో పుట్టిపెరిగిన తరం ఆవిర్భవించి, మొత్తం రాజ్యాంగ యంత్రాన్నంతా చెత్తకుప్పలోకి తోసివేసేవరకు యీ పని చేస్తూవుండవలసిందే.

కార్మికవర్గ నియంత్రృత్వం అంటే, సోషల్ డెమొక్రటిక్ పిరికి మనుషులు తిరిగి భయకంపితులు కావటం మొదలైంది. మంచిదే, మర్యాదస్థులైన ఓ అయ్యలారా, యీ నియంతృత్వం అంటే ఏమిటో తెలుసుకోవాలని వుందా? పారిస్ కమ్యూన్ వైపు చూడండి. అదే కార్మికవర్గ నియంతృత్వమంటే.

లండన్.

పారిస్ కమ్యూన్ — యఫ్. ఎంగెల్సు

20 వ వార్షికోత్సవమైన 1891, మార్చి 18

1891లో బెర్లిన్‌లో ప్రత్యేక ప్రచురణగా వెలువడిన మార్క్సు గ్రంథం, 'ఫ్రాన్సులో అంతర్యుద్ధం', గ్రంథానికిగాను ప్రత్యేకంగా ఎంగెల్సు వ్రాసిన పీఠిక.



# ఫ్రాంకో ప్రష్యన్ యుద్ధంపై, అంతర్జాతీయ కార్మిక సంస్థ జనరల్ కౌన్సిల్‌లో మొదటి ప్రసంగం

## యూరప్‌కు, అమెరికాకు చెందిన, అంతర్జాతీయ కార్మిక సంస్థ సభ్యులకు

1864 నవంబరులో అంతర్జాతీయ కార్మిక సంస్థ ప్రారంభ సమావేశ ప్రసంగంలో, మేము యిలా అన్నము: "కార్మికవర్గం విమోచన చెందాలంటే, వారి మధ్య సౌభ్రాతృత్వం వుండాలి. దుష్ట లక్ష్యాల సాధన కుద్దేశింపబడిన విదేశాంగ విధానంతో, జాతీయ దురహంకారాలను రెచ్చగొడుతూ, దురాక్రమణ యుద్ధాలలో ప్రజలరక్తాన్ని, కోశాగారాన్ని కొల్లగొట్టుతూవుంటే, యీ మహోన్నత లక్ష్యాన్ని ఎలా సాధించగలము." అంతర్జాతీయ సంస్థ లక్ష్యంగా పెట్టుకున్న వైదేశిక విధానాన్ని గురించి, మేము ఇలా నిర్వచించాము: "ప్రైవేట్ వ్యక్తుల మధ్య సంబంధాలలో వర్తించే సాధారణ న్యాయ నైతిక సూత్రాలు. జాతుల మధ్య సంబంధాలలో కూడా అమలు జరపండి."

ఫ్రాన్సులో వర్గ పోరాటాన్ని ఆసరాగా చేసుకుని అధికారాన్ని ఆక్రమించుకుని, విదేశాలపై యుద్ధాల ద్వారా దానిని స్థిరపరుచుకున్న లూయీ బోనపార్టీ, మొదటినుండి, అంతర్జాతీయ సంస్థను తనకు ప్రమాదకరమైన శత్రువుగా భావించటంలో ఆశ్చర్యంలేదు. జనవాక్య సేకరణ[4] సమయంలో అతడు, అంతర్జాతీయ కార్మిక సంస్థ పరిపాలన కార్యాలయాలపై దాడులు జరిపించాడు. ఫ్రాన్సు అంతటా, పారిస్, లాయన్సు, రూవిన్, మార్సేలిస్, బ్రెస్ట్ మొదలైన నగరాలలో ఈ దాడులు జరిగాయి.

అంతర్జాతీయ సంస్థ, రహస్య సంస్థ అనీ, తన హత్యకై కుట్రలు పన్నుతున్నదని ఆరోపించాడు. ఈ ఆరోపణ శుద్ధ అబద్ధమని, అతడు నియమించిన న్యాయమూర్తుల తీర్పు ద్వారానే వెల్లడైంది. అంతర్జాతీయ సంస్థ, కార్మిక సంస్థ, ఫ్రెంచి శాఖలు చేసిన నేరం ఏమిటి? జనవాక్య సేకరణలో పాల్గొనడమంటే దేశంలోను, విదేశాలలోను నియంతృత్వానికి ఓటు చేయడమేనని ఫ్రెంచి ప్రజలకు వారు సూటిగా, కుండ బద్దలు కొట్టినట్లు చెప్పారు. నిజానికి ఈ విషయంలో వారు చేసిన కృషి వల్లనే ఫ్రాన్సులోని అన్ని పారిశ్రామిక నగరాల్లో, అన్ని పెద్ద పట్టణాలలో, కార్మికవర్గం ఒక్కుమ్మడిగా జనవాక్య సేకరణను బహిష్కరించింది. కాగా గ్రామీణ ప్రజల అపారమైన అజ్ఞానం ఫలితంగా పరిస్థితి తారుమారైంది. దళారీ మార్కెటు, మంత్రివర్గము, పరిపాలక గ్రూపులు, యూరప్‌లోని పత్రికలు అన్నీ, జనవాక్య సేకరణ ద్వారా, కార్మిక వర్గంపై ఫ్రెంచి చక్రవర్తి ఘన విజయం సాధించినట్లు, ఒక వ్యక్తినే కాక, యావత్తు జాతులనే నాశనం చేసేందుకు సంకేతం యివ్వబడినట్లు, ఉత్సవాలు జరుపుకున్నాయి.

1870 జులైలో జరిగిన యుద్ధ కుట్ర. 1851 డిసెంబరు కుట్రకు. ([5]) సవరణలతో కూడిన పునశ్చరణ మాత్రమే. అసలిలాంటి కుట్ర జరగగలదా అన్నంతగా వుంది, కనుక. మంత్రిమండలి చేసే యుద్ధ ప్రసంగాలన్నీ కేవలం ఒకరిమీద ఒకరు ప్రయోగించే విసుర్లు మాత్రమే అని వ్యాఖ్యానించిన శాసనసభ్యుని మాటనే మొదట్లో ప్రజలు నమ్మారు కనుకనే. జూలై 15న, యుద్ధం అధికార పూర్వకంగా శాసనసభలో ప్రకటించబడినప్పుడు, ప్రతిపక్షం యావత్తూ, ప్రాథమిక ద్రవ్య ఖర్చుల ఆమోదాన్ని సైతం త్రోసిపుచ్చింది. థియర్స్ సైతం. ఈ యుద్ధం చాలా దారుణమని ఖండించాడు. పారిస్‌లోని స్వతంత్ర పత్రికలన్నీ ఈ ప్రకటనను ఖండించాయి. ఆశ్చర్యమేమంటే, రాష్ట్రాలలోని పత్రికలు సైతం ఏకగ్రీవంగా యీ చర్యను ఖండించాయి.

ఈలోగా అంతర్జాతీయ కార్మిక సంస్థ పారిస్ శాఖ సభ్యులు తిరిగి తమ కార్యకలాపాలు ప్రారంభించారు. జులై 12వ తేదీన రెవిల్‌లో వారు తమ కార్యక్రమం ప్రకటించారు. "అన్ని దేశాలలోని కార్మికులకు" సంబోధించబడిన ఆ పత్రం నుండి కొన్ని భాగాలను క్రింద ఇస్తున్నాం.

"యూరపియన్ సమతూకం, జాతీయ గౌరవం. పేరుతో తిరిగి ప్రపంచ శాంతికి రాజకీయ దురాశాపరులవల్ల ప్రమాదం ఏర్పడుతున్నది. ఫ్రెంచి, జర్మన్ స్పానిష్ కార్మికులారా! మన గొంతులన్నీ యుద్ధానికి వ్యతిరేకంగా ఒకే విధంగా ధ్వనించాలి. ఆధిపత్యం కొరకో, ఒక రాజవంశం కొరకో జరిగే యుద్ధం, కార్మికుల దృష్టిలో, దారుణమైన అన్యాయంతప్ప మరొకటికాదు. యుద్ధ ప్రకటనలుచేస్తూ,

రక్తపాతానికి తమ బాధ్యతను తప్పించుకుంటూ, ప్రజల దురదృష్టంనుండి దళారీ వ్యాపారంచేసే వారికి వ్యతిరేకంగా, శాంతి, శ్రమ, స్వేచ్ఛలను కోరే మనమందరము అసమ్మతి వ్యక్తం చేద్దాం. జర్మన్ సోదరులారా! మనం చీలివుంటే రైన్‌నది రెండు తీరాలలోను నిరంకుశత్వం విజయవంతమౌతుంది. సకల దేశాల కార్మికులారా! మన ఉమ్మడి ప్రయత్నాల తక్షణ ఫలితాలు ఎలా ఉన్నప్పటికీ, అంతర్జాతీయ కార్మిక సంస్థల సభ్యులమైన మనకు సరిహద్దులంటూలేవు. అభేద్యమైన సౌభ్రాతృత్వానికి చిహ్నంగా మీకు ఫ్రాన్స్ కార్మికవర్గం యొక్క శుభాకాంక్షలను, అభినందనలను అందజేస్తున్నాము."

మన పారిస్ విభాగం యొక్క ఈ కరపత్రంతో, అలాంటివే అనేక సందేశాలు పంపబడ్డాయి. వానిలో, ఒక్క దానిని, మార్సిలెస్[7]లో, జూలై 22న ప్రకటించబడిన నూలీ - సుర్- సేని ప్రకటనను ఇక్కడ ఉదహరిస్తున్నాము : ఈ యుద్ధం న్యాయమైనదా? కాదు. ఈ యుద్ధం జాతీయ స్వభావం కలదా? కాదు. ఇది కేవలం రాజవంశాల రక్షణ కుద్దేశితమైనది. మానవత్వం, ప్రజాస్వామ్యం, ఫ్రాన్సు నిజమైన ప్రయోజనాల పేరుతో యుద్ధంపట్ల అంతర్జాతీయ సంస్థ ప్రదర్శిస్తున్న వ్యతిరేకతను మేము దృఢంగా, సంపూర్ణంగా బలపరుస్తున్నాము."

ఈ అసమ్మతులు, ఫ్రెంచి కార్మిక ప్రజల నిజమైన మనో భావాలను ప్రతి బింబిస్తున్నాయి. అందుకే క్రింది విచిత్రమైన ఉదంతం ఉదాహరణ. లూయీ బోనపార్టీ అధ్యక్షత క్రింద డిసెంబరు 10వ తేదీ దళం,[8] మొదట నిర్మాణమైంది. ఈ దళాన్ని శాఖలుగా విభజించి, పారిస్ వీధులలో వదిలారు. అక్కడ వారు యుద్ధోన్మాద ప్రదర్శనలు చేశారు. అందుకు ప్రతిగా, పాబోర్గు కార్మికులు, బహిరంగంగా శాంతి ప్రదర్శనలు చేశారు. ఇవి ఎంత ప్రభావం కలిగించాయంటే, పోలీసు శాఖాధిపతిఐన పిత్రీ, తెలివిగా ఒక ఉత్తర్వు చేశాడు. వీధులలో రాజకీయ ప్రదర్శనలన్నిటినీ నిషేధించాడు. పారిస్ ప్రజలు, తమ దేశభక్తిని యుద్ధంపట్ల అపారమైన ఔత్సుక్యాన్ని ఇంతకుముందే వ్యక్తం చేశారు. అది చాలు అని ఒక సాకు చూపించాడు.

ప్రష్యాపై లూయీ బోనపార్టీ సాగించిన యుద్ధ సంఘటనలు ఎలాంటి వైనప్పటికీ, రెండవ సామ్రాజ్యం యొక్క చరమగీతి పారిస్‌లో అప్పటికే అలాపన ఐంది. అది ఎలా ప్రారంభమైందో అలాగే ఒక హస్య గేయంలాగా ముగుస్తుంది. కాని మనం ఒక విషయం మరచిపోరాదు. 18 సంవత్సరాలపాటు. సామ్రాజ్య పునరుద్ధరణ అనే దారుణమైన నాటకాన్ని లూయీ బోనపార్టీ ఆడగలిగాడంటే, అందుకు యూరపులోని పరిపాలక వర్గాలే కారణం.

జర్మనీకి సంబంధించినంత వరకు ఇదొక ఆత్మరక్షణ యుద్ధం. కాని అసలు జర్మనీ తనను తాను రక్షించుకోవలసిన అవసరాన్ని ఎవరు కలిగించారు. జర్మనీపై యుద్ధం చేయటానికి లూయీ బోనపార్టీకి ఎవరు అవకాశం కల్పించారు. ప్రష్యా లూయీ బోనపార్టీతో కలిగి కుట్రచేసి, స్వదేశంలోని ప్రజావ్యతిరేకతను అణచి వేసేందుకు, జర్మనీని, హోహెన్ జోల్న వంశ సామ్రాజ్యంలో చేర్చుకోటానికి తోడ్పడటం బిస్మార్క్ పన్నాగం. సదోవా[9] యుద్ధంలో ఓడిపోయినారు కాబట్టిగాని, గెలిచి ఉన్నట్లయితే, ఫ్రెంచి దళాలు, ప్రష్యాకు మిత్రులుగా జర్మనీ అంతటినీ స్వాధీనపరచుకొని ఉండేవి. తన విజయం తర్వాత, బానిసత్వంలోకి నెట్టి వేయబడిన ఫ్రాన్సుకు పోటీగా స్వేచ్ఛా జర్మనీని రూపొందించటానికి ప్రష్యా సిద్ధపడేదా : ఒక్కక్షణానికీ కాదు. తనపాత వ్యవస్థ యొక్క సహజ సౌందర్యాలను కాపాడుకుంటూనే, రెండవ సామ్రాజ్యం యొక్క మోసపుటెత్తుగడలను, దాని నగ్నమైన నిరంకుశత్వం, బూటకపు ప్రజాస్వామ్యం, రాజకీయ కపట నాటకాలు, ఆర్థిక పదవులు, వాగాడంబరం, నీచమైన హస్తలాఘవాలను అన్నిటినీ చేర్చేది. రైన్‌నదికి ఒకవైపున మాత్రమే అంతవరకూ ఉన్న బోనపార్టీ పాలన. రెండవ తీరాన కూడ దానినమూనాను స్థాపించుకుని ఉండేది. అలాంటి పరిస్థితులేర్పడితే యుద్ధం ప్రారంభం కాకుండా ఎలా ఆగుతుంది?

ప్రస్తుత యుద్ధం తన ఆత్మరక్షణ స్వభావాన్ని వదలుకోటానికి ఫ్రెంచి ప్రజలకు వ్యతిరేకంగా దురాక్రమణ యుద్ధంగా మారటానికి జర్మన్ కార్మికవర్గం అనుమతించినట్లుయితే, ఆ యుద్ధంలో విజయం లేక అపజయం ఏది వచ్చినా, అది సమానంగానే ప్రమాదకరంగా మారి ఉండేది. తన స్వాతంత్రయుద్ధం[10] తర్వాత జర్మనీకి సంక్రమించిన అరిష్టాలన్నీ తిరిగి అతి తీవ్రరూపంలో పునశ్చరణ అయి ఉండేవి.

అయితే, కార్మికవర్గ అంతర్జాతీయతా సూత్రాలు చాలా విస్తారంగా వ్యాపించి ఉన్నాయి. జర్మన్ కార్మికవర్గంలో చాలా లోతుగా వేరూని ఉన్నాయి. కనుక అలాంటి ఫలితం సంభవించజాలదు. ఫ్రెంచి కార్మికులవాణి, జర్మనీనుండి ప్రతిధ్వనించింది. జూలై 16న, బ్రన్స్‌విక్‌లో జరిగిన కార్మిక ప్రజలసభ, పారిస్ ప్రకటనతో తన పూర్తి తాదాత్మ్యాన్ని వ్యక్తం చేసింది. ఫ్రాన్సుతో జాతీయ శత్రుత్వం అనే భావాన్ని త్రోసిపుచ్చింది. ఈ క్రింది మాటలతో తన తీర్మానాన్ని ముగించింది. "మేము అన్ని రకాల యుద్ధాలకు ప్రత్యేకించి రాజవంశాల యుద్ధాలకు వ్యతిరేకులము. ఎంతో బాధతో, దుఃఖంతో మేము ఆత్మరక్షణ యుద్ధంలో అనివార్యమైన అరిష్టంగా సరిపుచ్చుకోవలసి వచ్చింది. కాగా ఇలాంటి అపారమైన సాంఘిక దురదృష్టం

పునరావృత్తం కాకుండా చూడవలసిందిగా యావత్తు జర్మన్ కార్మిక వర్గానికి మేము విజ్ఞప్తి చేస్తున్నాము. యుద్ధం, శాంతి సమస్యపైన, తమ భవిష్యత్తుపైన తామే నిర్ణేతలుగా, యజమానులుగా ప్రజలు నిరూపించుకోవాలి."

చెమ్నిజ్‌లో, 50 వేలమంది శాక్సన్ కార్మికుల ప్రతినిధుల సమావేశం ఏకగ్రీవంగా ఈ క్రింది తీర్మానాన్ని ఆమోదించింది: "జర్మన్ ప్రజాస్వామ్యం పేరుతో, ముఖ్యంగా డెమొక్రటిక్ సోషలిస్టు పార్టీకి చెందిన కార్మికులు పేరుతో, ఈ యుద్ధం కేవలం రాజవంశ పునరుద్ధరణ కుద్దేశింపబడిందని మేము ప్రకటిస్తున్నాము. ఫ్రెంచి కార్మికవర్గం చాచిన సోదర స్నేహహస్తాన్ని స్వీకరించడానికి మేము సిద్ధంగా ఉన్నాము. అంతర్జాతీయ కార్మిక సంస్థ నినాదమైన "ప్రపంచ కార్మికులారా ఏకంకండు" అనే మాటను జ్ఞప్తి చేసుకుంటూ మేము అన్ని దేశాల కార్మికుల మా స్నేహితులనీ, అన్ని దేశాల నియంతలు మాకు శత్రువులనే విషయాన్ని, ఎన్నటికీ మరచిపోము." అంతర్జాతీయ సంస్థ బెర్లిన్ శాఖ కూడా, పారిస్ ప్రకటనకు సమాధానంగా ఇలా చెప్పింది: "మీ అసమ్మతి మేము హృదయపూర్వకంగానూ, క్రియాశీలంగానూ బలపరుస్తున్నాము. తప్పెటలమోతగాని, ఫిరంగుల గర్జనగాని. విజయము, లేక అపజయముగాని అన్ని దేశాల శ్రమజీవుల బాలబాలికలను ఐక్యంచేసే మా కర్తవ్యం నుండి మమ్ములను పక్కదారి పట్టించలేదని మేము ప్రమాణ పూర్వకంగా ప్రకటిస్తున్నాము."

**అది అలాగే జరుగుగాక!**

ఆత్మహత్యాకర సదృశ్యమైన ఈ ఘర్షణ వెనుక, రష్యా నల్లటి ఆకారం నిలచి ఉంది. మాస్కో ప్రభుత్వం, వ్యూహాత్మక ప్రాధాన్యంగల రైల్వేలైన్ల నిర్మాణాన్ని అప్పటికే పూర్తిజేసి, ప్రుత్‌దిశగా తన సేవలను కేంద్రీకరిస్తున్న సమయంలో, ఈ యుద్ధ ప్రారంభానికి సంకేతం ఇవ్వబడడం చాలా ప్రమాదకర సూచన. బోనపార్టిస్టు దురాక్రమణకు వ్యతిరేకంగా, ఆత్మరక్షణా యుద్ధం అనే పేరుతో, జర్మన్లు ఏ ప్రజా సానుభూతిని పొందగలుగుతున్నారో, ఆ కాస్తా కొసక్‌ల సహాయాన్ని వారు. అడిగినా, లేక స్వీకరించినా, హరించుకుపోతుంది. నెపోలియన్‌కు వ్యతిరేకంగా వారు స్వతంత్ర యుద్ధం జరిపిన తర్వాత, వారు శతాబ్దాల తరబడి, జార్ పాదాల ముందు పడిగాపులు పడి ఉన్న విషయం వారు మరచిపోకూడదు.

ఫ్రెంచి, జర్మన్ కార్మిక వర్గాలకు, ఇంగ్లీషు కార్మిక వర్గం స్నేహహస్తాన్ని చాచింది. ఈ దారుణ యుద్ధం ఎలాంటి తక్షణ మలుపు తీసుకున్నప్పటికీ, అన్ని దేశాల కార్మికవర్గాల ఐక్యత చిట్టచివరకు యుద్ధాన్నంతం చేస్తుందని వారికి తెలుసు.

అధికార పూర్వకంగా ఫ్రాన్సు, జర్మనీ ప్రభుత్వాలు ఒకరి గొంతుకలు ఒకరు నరుక్కుంటున్నప్పటికీ, ఫ్రాన్సు, జర్మనీల కార్మికవర్గాలు, పరస్పరం శాంతి, సద్భావ సందేశాలు పంపుకుంటున్నారనే విషయమే చాలా ముఖ్యమైనది. గత చరిత్రలో ఎన్నడూ ఇలాంటి ఘటన జరగలేదు. ఈ ఘటనే, ఆశావహమైన భవిష్యత్తుకు సూచన. పాత సమాజానికి విరుద్ధంగా, దాని ఆర్థిక దురవస్థలకు, రాజకీయ ప్రేలాపనలకు విరుద్ధంగా, ఒక నూతన సమాజం ఆవిర్భవిస్తున్నది. ఈ సమాజం యొక్క అంతర్జాతీయ పాలన, శాంతిపై ఆధారపడి ఉంటుంది. కాని దాని జాతీయ పాలకవర్గం ప్రతి దేశంలోనూ ఒకరే, కార్మికవర్గం, కనుక ఈ సమాజ ఆవిర్భావక శక్తి అంతర్జాతీయ కార్మిక సంస్థ.

లండన్, 1870. జూలై 23

ఇంగ్లీషు కరపత్రంలోని పాఠానికి అనుగుణంగా ముద్రించబడింది.

మార్క్స్ రాసిన ఈ పత్రాన్ని 1870, జూలై 23న జరిగిన అంతర్జాతీయ కార్మిక సంస్థ సమావేశం ఆమోదించింది. వెన్వెంటనే, ఇంగ్లీషు, జర్మన్, ఫ్రెంచి భాషలలో కరపత్రాల రూపంలో ఈ ప్రసంగం ప్రచురించబడ్డది.

◆

# అంతర్జాతీయ కార్మిక సంస్థ కౌన్సిల్‌లో ఫ్రాంకో ప్రష్యన్ యుద్ధంపై రెండవ ప్రసంగం

## యూరోప్, అమెరికాలకు చెందిన అంతర్జాతీయ కార్మిక సంస్థ సభ్యులు

**జూ**లై 23న విడుదలైన మా కరపత్రంలో మేమే ఇలా చెప్పాము: "రెండవ సామ్రాజ్యం యొక్క మృత్యునాదం పారిస్‌లో అప్పుడే వినిపిస్తున్నది. అది ఎలా ప్రారంభమైందో, అలాగే, హాస్యగేయంవలె ముగుస్తుంది. కాని మనం ఒక విషయం మరచిపోరాదు. 18 సంవత్సరాలపాటు, లూయీ నెపోలియన్ సామ్రాజ్య పునరుద్ధరణ పేరుతో ఆడిన దారుణ కపట నాటకానికి అవకాశం కల్పించింది. యూరప్‌లోని పాలక వర్గాలు."

ఈ విధంగా, యుద్ధచర్యలు ఇంకా ప్రారంభం కాకముందే, మేము బోనపార్టిస్టు బుడగను గతానికి చెందిన దానిగా అంచనా వేశాము.

రెండవ సామ్రాజ్య పటిష్టతను గురించి మేము పొరపాటు పడలేదు. అలాగే. జర్మన్ యుద్ధం "కేవలం ఆత్మరక్షణా దశనుండి, ఫ్రెంచి ప్రజలకు వ్యతిరేక యుద్ధంగా మారుతుందనే" అనుమానం వ్యక్తం చేయటంలోనూ మేము పొరబడలేదు. సెడాన్ ఓటమి, లూయీ బోనపార్టీ లొంగుబాటు, పారిస్‌లో రిపబ్లిక్[11] ప్రకటనతో, ఆత్మరక్షణా యుద్ధం ముగిసింది. కాని ఈ ఘటనలు జరగటానికి చాలా కాలం క్రితమే సామ్రాజ్యవాద సేనల పూర్తి దివాళాకోరుతనం వ్యక్తమైన వెంటనే, ప్రష్యన్ సైనిక కూటమి, దండయాత్రకై నిర్ణయించింది. ఇందుకు ఒకే ఒక అసహ్యకరమైన ఆటంకం ఉంది. యుద్ధ ప్రారంభంలో విలియం రాజు స్వయంగా చేసిన ప్రకటన, ఉత్తర జర్మన్ శాసనసభలో. సింహాసనం మీద నుండి చేసిన ప్రసంగంలో, విలియం రాజు

ఫ్రెంచి చక్రవర్తిపైన తాను యుద్ధం చేస్తున్నానని, ఫ్రెంచి ప్రజలపైన గాదని, గంభీరంగా ప్రకటించాడు. ఆగస్టు 11న అతడు ఫ్రెంచి జాతి నుద్దేశించి చేసిన ప్రకటనలో ఇలా అన్నాడు: ఫ్రెంచి ప్రజలతో స్నేహంగా జీవించాలనే జర్మన్ జాతి వాంఛించింది. నేటికీ వాంఛిస్తున్నది. అలాంటి జర్మన్ జాతిపై నెపోలియన్ చక్రవర్తి, సముద్ర మార్గాన భూమార్గాన, దాడి చేశాడు." కనుక నేను జర్మన్ సేనల ఆధిపత్యాన్ని స్వీకరించి, దురాక్రమణ సేనలను తిప్పి కొట్టవలసిందిగా ఉత్తర్వు చేశాను. సైనిక ఘటనల ఫలితంగా, ఫ్రాన్సు సరిహద్దులను అతిక్రమించ వలసి వచ్చింది." "దురాక్రమణను ప్రతిఘటించేందుకే" తాను జర్మన్ సేనలకు ఆధిపత్యాన్ని వహించానని ప్రకటించటం ద్వారా, యుద్ధం యొక్క ఆత్మరక్షణా స్వభావాన్ని నొక్కి చెప్పటమేగాక, "సైనిక ఘటనల" ఫలితంగా ఫ్రాన్సు సరిహద్దులను దాటవలసి వచ్చిందని ప్రకటించుకున్నాడు. ఆత్మరక్షణా యుద్ధమైనప్పటికి, "సైనిక ఘటనల" ఫలితంగా, ఎదురుదాడి చర్యలను చేపట్టక తప్పదుగదా.

ఆ విధంగా, ధర్మతత్పరుడైన ఆ రాజు యుద్ధంయొక్క కేవలం ఆత్మరక్షణా స్వభావాన్ని గురించి, ఫ్రాన్సు ఎదుట, ప్రపంచం ఎదుట మాట ఇచ్చి ఉన్నాడు. ఈ పవిత్ర వాగ్దానం నుండి అతన్ని ఎలా విడుదల చేయాలి. జర్మన్ జాతియొక్క అప్రతిహతమైన దీక్షకు, అయిష్టంగానే ఆయన తల ఒగ్గినట్లు, వ్యవహార నిర్వాహకులు ప్రపంచాన్ని కన్నుగప్పవలసి వచ్చింది. ఉదార జర్మన్ మధ్య తరగతికి, ప్రొఫెసర్లు, పెట్టుబడిదార్లు, మునిసిపల్ సభ్యులు, రచయితలు, వీరందరికి వారు పై సూచనను అందచేశారు. ఈ మధ్యతరగతి 1846-70ల మధ్య పౌరహక్కులకై జరిగిన పోరాటంలో, అసాధారణమైన, పిరికితనాన్ని, సామర్థ్య రాహిత్యాన్ని, అనిశ్చితత్వాన్ని ప్రదర్శించింది. అట్టి తరగతి, ఇప్పుడు యూరప్ అంతటి జర్మన్ దేశభక్తికి ప్రతినిధిగా, సింహగర్జనలు చేస్తూ సంచారం చేయటానికి ఎంతో ఉబలాటపడ్డది ప్రష్యన్ ప్రభుత్వం అంతకుముందే రహస్యంగా పన్నిన పన్నాగాన్ని, తాను బలవంతంగా ప్రభుత్వంపై రుద్దినట్లుగా నటిస్తూ తన పౌరస్వాతంత్ర్యాన్ని అది తిరిగి స్థాపించుకున్నది. లూయీ బోనపార్టీ ఆమోఘత్వానికి తాను అతి దీర్ఘకాలం, దాదాపు మతవిశ్వాసంతో ఆరాధించినందుకు ప్రాయశ్చిత్తంగా, ఫ్రెంచి రిపబ్లిక్ విచ్ఛిన్నం కావాలి అని కేకలు వేయసాగింది. ఇంత గుండె నిబ్బరంగల ఈ దేశభక్తుల ప్రత్యేక వాదనలను. ఒక్క క్షణకాలం మనం విందాము.

అల్సేక్, లారేన్ ప్రజలు, జర్మన్ కౌగిలికై అలమటించి పోతున్నారని చెప్పగల ధైర్యం వారికిలేదు. పరిస్థితి అందుకు పూర్తి విరుద్ధంగా ఉంది. ఆ ప్రజల ఫ్రెంచి

దేశభక్తిని శిక్షించేందుకుగాను, స్వతంత్రమైన రక్షణ స్థావరం గలిగిన, స్ట్రాస్‌బర్గ్ నగరాన్ని, జర్మన్లు, ఆరు రోజులపాటు ఉద్దేశపూర్వకంగా దారుణంగా తమ ప్రేలుడు బాంబుల దాడికి గురి చేశారు. ఆ పట్టణానికి నిప్పుపెట్టి, రక్షణలేని ఆ నగర ప్రజలను వేల సంఖ్యలో చంపివేశారు. నిజానికి ఈ రాష్ట్రాల భూభాగం ఒకప్పుడు, వీలోం జర్మన్ సామ్రాజ్యంలో అంతర్భాగంగా ఉండేది. కనుక, ఆ భూభాగం మీద పెరిగిన ప్రజలతోపాటు, ఆ భూభాగాన్ని కూడా. తమకు ఆ జన్మహక్కు ఉన్న ఆస్తివలె జర్మన్లు స్వాధీనం చేసుకున్నారు. ఇలాంటి పాతకాలపు పద్ధతిలో యూరప్ పటాన్ని పునర్నించాలనుకుంటే. బ్రాండెన్‌బర్గ్ పాలకుడు. అసలు పోలిష్ రిపబ్లిక్ సామంతుడుగా, ప్రష్యన్ భూభాగాన్ని పరిపాలించిన సంగతి మరచిపోరాదు.

అంతకంటె విజ్ఞులైన దేశభక్తులు మాత్రం, అల్సేక్, లారేన్‌లోని జర్మన్ భాష మాట్లాడే ప్రాంతం, తమ చేతిలో ఉంచుకోవాలని, భవిష్యత్తులో ఫ్రెంచి దురాక్రమణ జరగకుండా అది భౌతికమైన గ్యారంటీ అని అనుకుంటున్నారు. అవమానకరమై ఈ వాదన బలహీనులైన వారిని చాలా మందిని దిగ్భ్రాంతులను చేసినందున, ఆ సమస్యను మనం మరింత లోతుగా చర్చించటం మంచిది.

రైన్ నది అవలి తీరంతో పోలిస్తే, ఆల్సేక్ ప్రాంతం. అందులో బాస్లే జర్మర్‌షీమ్ నగరాలకు మధ్య చెరిసగం దూరంలో సైనిక దుర్గమైన పెద్ద స్ట్రాస్‌బర్గ్ నగరం–ఇదంతా దక్షిణ జర్మనీపై ఫ్రాన్సు దండయాత్ర చేయటానికి చాలా అనుకూలమైన ప్రాంతం అనటంలో ఎట్టి అనుమానంలేదు. కాగా, దక్షిణ జర్మనీ నుండి ఫ్రాన్సుపై దాడి చేయటానికి ఇవి ప్రత్యేకమైన కొన్ని ఆటంకాలను కల్పిస్తాయి. అంతేకాదు, ఆల్సేక్, జర్మన్ భాష మాట్లాడే లారేన్ ప్రాంతాన్ని చేర్చుకుంటే, దక్షిణ జర్మనీ సరిహద్దు మరింత బలవత్తర మౌతుంది. ఏమంటే, అప్పుడు దక్షిణ జర్మనీకి, వోస్గె సర్వత శ్రేణి పొడుగునా, అందులోని కోటలు, ఉత్తర దిశ కనుమలతో సహా స్వాధీనమౌతాయి. మెట్జ్ కూడా గనక స్వాధీనమైతే, జర్మనీపై దాడి చేయటానికుపయోగపడే రెండు ప్రధాన స్థావరాలు ఫ్రాన్సుకు లేకుండా పోతాయి. అంతమాత్రాన నాన్సీలో గాని, వెర్డున్‌లోగాని కొత్తగా రక్షణ శ్రేణులు నిర్మించుకునే అవకాశం ఫ్రాన్సుకు ఉండనే ఉంటుంది. ఫ్రాన్సుపై దాడి చేయటానికి జర్మనీకి, కోబ్లెంజ్, మైంజ్, జర్మర్‌షీమ్, రాస్టాడ్ ఉల్మ్‌లాంటి స్థావరాలుంటాయి. ఈ యుద్ధంలో వీటిని జర్మనీ సంపూర్ణంగా వాడుకున్నదికూడా. కనుక ఫ్రాన్సుకు స్ట్రాస్‌బర్గు, మెట్జ్‌లు ఉండరాదని జర్మనీ వాదించడం ఎలా సబబుగా ఉంటుంది? ఫ్రాన్సుకు తన వైపున ఉన్నవి ఈ రెండు దుర్గాలే. అంతేకాదు ఉత్తర జర్మనీతో సంబంధం లేని ప్రత్యేక రాజ్యం దక్షిణ జర్మనీ ఉన్నప్పుడే, స్ట్రాస్‌బర్గు,

దక్షిణ జర్మనీ రక్షణకు ప్రమాదకరం. 1792-95. సంవత్సరాల నుండి, ఈ వైపు నుండి దక్షిణ జర్మనీపై ఎన్నడూ దండయాత్ర జరగలేదు. ఏమంటే, ఫ్రెంచి విప్లవానికి వ్యతిరేకంగా జరిగిన యుద్ధంలో ప్రష్యా కూడా భాగస్వామిగా ఉండేది. కాగా 1795లో ప్రష్యా తనకుతానై సంధి చేసుకున్న తర్వాత, దక్షిణ భాగాన్ని దాని దోవన దానిని వదలివేసిన మీదట స్ట్రాస్‌బర్గు పునాదిగా చేసుకుని దక్షిణ జర్మనీపై దండయాత్రలు ప్రాంభమైనాయి. 1809 వరకు కొనసాగాయి కూడా. విషయమేమంటే జర్మనీ ఐక్యంగా ఉంటే, స్ట్రాస్‌బర్గును గాని, ఆల్సేక్‌లోని ఫ్రెంచి సైన్యాలను గాని తన సేనలన్నిటినీ కేంద్రీకరించటం ద్వారా, నిష్ప్రయోజనం చేయగలదు. ప్రస్తుత యుద్ధంలో అలాగే జరిగింది. సార్‌లూయీ, లాండూల మధ్య తన సేనలను కేంద్రీకరించి మైంజ్ మెట్జ్‌ల మధ్య రోడ్డు వెంబడిగా ముందుకు సాగి, లేక శత్రు సేనల దాడిని ప్రతిఘటించి, జర్మనీ విజయవంతమైంది. జర్మన్ సేనలలో అధిక భాగం అక్కడ కేంద్రీకృతమై ఉన్నట్లయితే, స్ట్రాస్‌బర్గు నుండి దక్షిణ జర్మనీలోకి ముందుకుసాగే ఏ ఫ్రెంచి సేననైనా, చుట్టముట్టి దాని సప్లయి మార్గాలను ఛేదించవచ్చు. ప్రస్తుత సైనిక చర్యలు ఒక విషయాన్ని నిరూపించాయి. అదేమంటే, జర్మనీ నుండి ఫ్రాన్స్‌పైకి దాడి చేయటం చాలా తేలిక.

కాగా చిత్తశుద్ధితో ఆలోచిస్తే ఒక విషయం తేలుతుంది. జాతుల మధ్య సరిహద్దులను నిర్ణయించేటప్పుడు, సైనిక ఆలోచనలను ప్రధానాంశంగా చేయటం అన్యాయం కాదా. ఇదే సూత్రాన్ని ఆమోదిస్తే, వెనీషియా, మిన్సియో శ్రేణి తమకు చెందాలని ఆస్ట్రియా వాదించవచ్చు. రైన్ శ్రేణి తనది అని ఫ్రాన్సు అనవచ్చు. పారిస్ రక్షణకది అవసరమని వాదించవచ్చు. బెర్లిన్‌పై నైరుతి దిశ నుండి దాడి చేయటం కంటె, పారిస్‌పై ఈశాన్య దిశ నుండి దాడి చేయటం తేలిక. సైనిక ప్రయోజనాల దృష్ట్యా సరిహద్దులను నిర్ణయించటం ప్రారంభమైతే, ఇక దానికి అంతులేదు. ఏమంటే ప్రతి సైనిక రక్షణ శ్రేణి కూడా లోపభూయిష్టమైనదే. పక్కనే ఉన్న ఇతరుల భూభాగాన్ని స్వాధీనం చేసుకుని దాన్ని మరింత పటిష్టం చేసుకోవచ్చు. అంతేకాదు. ఈ సరిహద్దులను ఎన్నడూ స్థిరంగానూ, న్యాయంగానూ ఉంచలేము. విజేత పరాజితునిపై తన కనుకూలమైన సరిహద్దు రేఖను విధిస్తాడు. కనుక అందులో కొత్త యుద్ధానికి అవసరమైన బీజాలు ఉండనే ఉంటాయి.

యావత్తు చరిత్ర నేర్పే గుణపాఠం ఇదే. జాతుల విషయంలో వలె, వ్యక్తుల విషయంలోనూ ఇదే వర్తిస్తుంది. ఎదురు దాడి చేసే వ్యక్తుల శక్తిని అపహరించాలంటే, ముందు వారికి ఆత్మరక్షణ సాధనాలు లేకండా చేయాలి. కొయ్యదిమ్మల మధ్యపెట్టి

పీక కత్తిరించటమే కాదు, మనిషిని హత్య చేయాలిసిందే. ఒక జాతి జీవశక్తిని ధ్వంసం చేయటానికి ఏ విజేత ఐనా, భౌతిక గ్యారంటీలు అమలు జరిపాడు అంటే మొదటి నెపోలియన్, టిల్సిట్ సంధి[12] ద్వారా ఆ పనిచేశాడు. ఆ సంధిని ప్రష్యాకు, మిగతా జర్మనీకి వ్యతిరేకంగా అతడు అమలు జరిపాడు. కాగా కొద్ది సంవత్సరాలకే, అతని బ్రహ్మాండమైన శక్తి చివికిపోయిన బద్ధలాగా, జర్మన్ ప్రజలపై ముక్కచెక్కలైంది. మొదటి నెపోలియన్, ప్రష్యా నుండి ఏ భౌతిక గ్యారంటీలను సాధించగలిగాడో, వాటితో పోలిస్తే ఫ్రాన్సుపై విధించాలని, ప్రష్యా కలలుగంటున్న భౌతిక గ్యారంటీలు ఏవి? ఫలితం అంతకంటె తక్కువ హానికరమేమీ కాదు. ఫ్రాన్సు ఎన్ని చదరపు మైళ్ళ భూభాగాన్ని స్వాధీనం చేసుకుంది అనే దాన్నిబట్టి గాక, 19వ శతాబ్దం రెండవ అర్థ భాగంలో దురాక్రమణ విధానాన్ని పునరుద్ధరించటమనే నేర తీవ్రతను బట్టి, చరిత్ర తన శిక్షను విధిస్తుంది.

కాగా ట్యుటానిక్ దేశభక్తి ప్రతినిధులు ఇలా అంటారు. మీరు ఫ్రెంచి వారిని, జర్మన్‌లతో పోల్చకూడదు అని. మాకు కావలసింది గౌరవం కాదు, రక్షణ. జర్మన్లు ప్రధానంగా శాంతికాముక ప్రజలు. వారి నిగ్రహంతో కూడిన ధర్మకర్తృత్వంలో, ఆక్రమణ సైతం భవిష్యత్ యుద్ధ బీజాలను సృష్టించకపోగా శాశ్వత శాంతికి పెట్టని కోట అవుతుంది. 18వ శతాబ్దపు విప్లవాన్ని తుపాకి పోట్ల ద్వారా ధ్వంసం చేయటానికి 1792లో ఫ్రాన్సుపై దాడి చేసింది. జర్మన్లు కాదు; ఇటలీని స్వాధీనపరచుకోవటం ద్వారా తమ చేతులను మలినం చేసుకున్నది జర్మన్లు కాదు; పోలెండును రెండు ముక్కలుగా చీల్చింది జర్మన్లు కాదు. జర్మన్ సైనిక వ్యవస్థ, శరీర దార్ఢ్యం గల ప్రజల నందరినీ రెండుగా చీల్చింది. ఒకటి ఉద్యోగంలో ఉన్న స్థిర సైన్యం, రెండోది సెలవుల్లో వున్న సైన్యం. రెండు విభాగాలు కూడా, దైవ శాసనం ద్వారా, పరిపాలకుల పట్ల విశ్వాసపాత్రంగా ఉండవలసిందే. శాంతిని కాపాడటానికి ఇలాంటి సైనిక వ్యవస్థే "భౌతిక గ్యారంటీ"లను సృష్టిస్తుంది. నాగరికతా ధోరణులను అంతిమంగా పెంపు చేస్తుంది. అన్నిచోట్ల వలెనే, జర్మనీలో కూడా అధికారంలో ఉన్న స్తోత్ర పాఠకులు, మోసపూరితమైన ఆత్మప్రశంసల ద్వారా ప్రజల మనస్సులను విషపూరితం చేస్తున్నారు.

మెట్జ్, స్ట్రాస్‌బర్గ్‌లలో ఫ్రెంచి దుర్గాలను చూడగానే తమ కెంతో ఆగ్రహం కలిగినట్లు వీరు నాటకమాడుతున్నారు. కాగా, వార్సా, మోడ్లిన్ ఇవాన్ గొరోద్‌లలో మాస్కో పాలకులు నిర్మించిన బ్రహ్మాండమైన రక్షణ శ్రేణులలో వారికెట్టి ప్రమాదమూ కనపడలేదు. సామ్రాజ్యవాద దురాక్రమణ యుద్ధ బీభత్సాల పట్ల ప్రగల్భాలు పలికే వీరు, నిరంకుశ బానిసత్వానికి తల ఒగ్గే విషయంలో కించిత్తు కూడా సిగ్గుపడరు.

1865లో, లూయీ బోనపార్టీ, బిస్మార్కులు వాగ్దానాలు మార్చుకున్నట్లే 1870లో, గోర్చకోవ్, బిస్మార్కులు వాగ్దానాలు మార్చుకున్నారు. 1866 యుద్ధంలో ఆస్ట్రియా, ప్రష్యాలు రెండూ అలసట చెందగలవనీ అందువల్ల, జర్మనీ అంతటికీ తానే అధినేతను కాగలనని లూయీ బోనపార్టీ గప్పాలూ కొట్టాడు. అలాగే 1870లో జర్మనీ, ఫ్రాన్సులు రెండూ అలసట చెందుతాయని, పశ్చిమ ఖండానికంతా, తాను ఏకైక అధిపతిని కాగలనని, అలెగ్జాండర్ విశ్వసించాడు. ఉత్తర జర్మన్ సమాఖ్య ఉనికి, తన అస్తిత్వానికి హానికరమని. రెండవ సామ్రాజ్యం భావించినట్లే, ప్రష్యన్ నాయకత్వంలో జర్మన్ సామ్రాజ్యం ఏర్పడితే. తనకు ప్రమాదకరమని నిరంకుశ రష్యా భావించింది. పాత రాజకీయ వ్యవస్థ సూత్రమే అంత. దాని పరిధిలో ఒక రాజ్యం లాభపడితే, మరొక రాజ్యం నష్టపడాలి. జర్మనీలో తనకుసాంప్రదాయ సిద్ధంగా ఉన్న పట్టుపై యూరప్‌పై జార్ సార్వభౌమాధికారం ఆధారపడి ఉంది. రష్యాలోనే తన నియంతృత్వ ప్రతిష్టకు, సాంఘిక భూకంపాలను సృష్టించే శక్తుల ద్వారా ప్రమాదం ఏర్పడుతున్న సమయంలో, విదేశాలలో తన ప్రతిష్ట నశించిపోతుంటే జార్ సహించగలడా? 1866 యుద్ధం తర్వాత బోనపార్టిస్టు పత్రికలు ఏ పరిభాషను వాడాయో, మాస్కో పత్రికలు ఆ పరిభాషను అప్పుడే వాడటం మొదలుపెట్టాయి. ఫ్రాన్సును రష్యా చేతుల్లోకి నెట్టడం ద్వారా, స్వేచ్ఛా, శాంతులకు గ్యారంటీ ఏర్పడుతుందని, టూటన్ దేశభక్తులు నిజంగా విశ్వసిసున్నారా? ఆయుధాలకు అదృష్టం కలిసివచ్చి, విజయగర్వంతో రాజవంశాల కుట్రల ఫలితంగా, ఫ్రాన్సును విభజించటంలో జర్మనీ గనక విజయం పొందితే, అప్పుడు రష్యా దురాక్రమణ సాధనగా మారక తప్పదు. లేక కొంత విశ్రాంతి తర్వాత మరొక ఆత్మరక్షణా యుద్ధానికి సిద్ధంగాక తప్పదు. ఆ యుద్ధం ఏదో "స్థానిక యుద్ధం"గా మాత్రం ఉండబోదు. జాతుల యుద్ధంగా స్లవేనియన్, రోమన్ జాతులకు వ్యతిరేక యుద్ధంగా మారితీరుతుంది.

ఈ యుద్ధాన్ని జర్మన్ కార్మికవర్గం దృఢంగా బలపరచింది. ఈ యుద్ధాన్ని నివారించగల శక్తి దానికి లేదు. ఫ్రాన్సుకు, యూరపుకు అంటురోగంగా, గుండె బరువుగా తయారైన రెండవ సామ్రాజ్యం నుండి కాపాడటానికి జర్మన్ స్వాతంత్ర్యం కొరకు, కార్మికవర్గం ఈ యుద్ధాన్ని బలపరచింది. గ్రామీణ పేద ప్రజలతోపాటు, జర్మన్ కార్మికులు ఈ యుద్ధానికి అవసరమైన వీరులను, కండపుష్టిని, నరాలపట్టును సమకూర్చారు. వారి కుటుంబాలేమో అర్ధాకలితో ఇండ్లలో మాడిపోతున్నాయి. విదేశాలలో జరిగిన యుద్ధాలతో క్షీణించి చివికిపోయినవారు, తిరిగి స్వదేశం కరువు కాటకాలతో చివికిపోతారు. ఇప్పుడు వారు కొన్ని గ్యారంటీలు కావాలని

అడుగుతున్నారు. తాము చేసిన అపారమైన త్యాగాలు వృథా కారాదని తాము స్వాతంత్ర్యాన్ని సాధించుకున్నామని. సామ్రాజ్యవాద సేనలపై తాము సాధించిన విజయం 1815లో వలె తిరిగి జర్మన్ ప్రజల ఓటమిగా మారరాదని కోరుతున్నారు. ఇందుకు తొలి చర్యగా, వారు ఫ్రాన్సుకు గౌరవ ప్రదమైన శాంతినిచ్చి ఫ్రెంచి రిపబ్లికన్‌ను గుర్తించాలని వాంఛిస్తున్నారు.

సెప్టెంబర్ 5న. జర్మన్ సోషలిస్టు డెమొక్రటిక్ పార్టీ, వర్క్‌మెన్స్ పార్టీ కేంద్ర కమిటీ ఒక కరపత్రాన్ని ప్రకటించింది. పై గ్యారంటీలు ఖచ్చితంగా అమలు జరగాలని ఆ పార్టీ అందులో కోరింది. అందులో వారిలా అన్నారు: “ఆల్సేక్, లారేన్‌ను ఆక్రమించుకోటానికి అసమ్మతి తెలియజేస్తున్నాము. మేము జర్మన్ కార్మికవర్గం తరఫున మాట్లాడుతున్న విషయం మాకు తెలుసు. ఫ్రాన్సు, జర్మనీల ఉమ్మడి ప్రయోజనాలు, శాంతి స్వేచ్ఛల ప్రయోజనాలు దృష్ట్యా, ప్రాచ్య నిరంకుశత్వానికి ప్రతిగా పాశ్చాత్య నాగరికత దృష్ట్యా, జర్మన్ కార్మికులు, ఆల్సేక్, లారేన్ ఆక్రమణ జరుగుతూఉంటే, చూస్తూ సహించి ఊరుకోరు. కార్మికవర్గ అంతర్జాతీయ లక్ష్యసాధనకై మేము అన్ని దేశాలలోని మా తోటి కార్మికుల తరఫున విశ్వాసపాత్రంగా నిలబడతాము.”

దురదృష్టవశాత్తు వారు తక్షణ విజయాన్ని సాధించారని సంతోషించే అవకాశం లేదు. శాంతి కాలంలో, ఫ్రెంచి కార్మికులు దురాక్రమణదారుని నిరోధించ లేకపోయినప్పుడు, యుద్ధోన్మాదంలో ఉండగా విజేతను జర్మన్ కార్మికవర్గం నిరోధించగల అవకాశం మాత్రం ఎలా వస్తుంది. ఫ్రెంచి రిపబ్లిక్ దారుణ నేరస్తుడైన లూయీ బోనపార్టీని స్వాధీనం చేసుకోవాలని. జర్మన్ కార్మికుల కరపత్రం కోరుతున్నది. కాగా వారి నాయకులు అప్పటికప్పుడే అతనిని తిరిగి టులీర్స్‌లో పునఃప్రతిష్ఠించాలని ఆలోచిస్తున్నారు. ఫ్రాన్సును నాశనం చేయటానికి అతడే అత్యుత్తముడని వారి అభిప్రాయం. ఏదిఏమైనా, జర్మన్ కార్మికవర్గం, జర్మన్ మధ్యతరగతి అంతగా వెన్నెముక లేని జనం కాదని చరిత్ర నిరూపిస్తుంది. వారు తమ విధిని నెరవేర్చి తీరుతారు.

వారివలెనే, మేముకూడా, ఫ్రెంచి రిపబ్లిక్‌కు శుభాకాంక్షలు పలుకుతున్నాము. అయితే మాకు కొన్ని అనుమానాలున్నాయి. అవి నిరాధారాలని నిరూపణ ఐతే సంతోషిస్తాము. రిపబ్లిక్, సింహాసనాన్ని ధ్వంసం చేయలేదు. పీఠాధిపతిని పదవీచ్యుతుని చేసి, సింహాసనాన్ని ఖాళీగా ఉంచింది. అదొక సామాజిక విజయంగా ప్రకటితం కాలేదు. కేవలం ఒక జాతీయ రక్షణ చర్యగా మాత్రమే గెలిచింది. అది ఒక తాత్కాలిక ప్రభుత్వం చేతుల్లో ఉంది. ఇందులో అప్రతిష్టాపరులైన ఆర్లియనిస్టులు, మధ్యతరగతి రిపబ్లికన్ పార్టీకి చెందినవారు ఉన్నారు. వీరిలో కొందరు జూన్ 1848 విప్లవంలో

తుడిచివేయ వీలులేని దోషాలకు పాల్పడ్డారు. ప్రభుత్వ సభ్యుల మధ్య పని విభజన చాలా అసందర్భంగా ఉంది. సైన్యం పోలీసులలోని బలమైన స్థావరాలను ఆర్లియనిస్టులు చేజిక్కించుకున్నారు. రిపబ్లికన్‌లుగా పేరుపొందినవారికి, ఉపన్యాసాలు చేసే శాఖలు మాత్రమే లభించాయి. వీరు తీసుకున్న మొట్టమొదటి చర్యలు కొన్ని చూస్తే, వీరు వెనుకటి సామ్రాజ్యం నుండి దాని శిధిలాలను మాత్రమేగాక,కార్మికవర్గం అంటే దానికుండే భయాన్ని కూడా వారసత్వంగా స్వీకరించారని తెలుస్తుంది. రిపబ్లిక్ ఏవో అసాధ్యమైన పనులు చేయాలని గొడవపెట్టటమంటే, తిరిగి ఆచరణసాధ్యమైన ప్రభుత్వం కావాలనే కోర్కెకు ఊపిరి పోయటం కాదా? మధ్య తరగతి యజమానులచే నిర్వహింపబడుతున్న ఈ రిపబ్లిక్ కేవలం అర్థంతర దశగా ఉండి, తిరిగి ఆర్లియనిస్టు పునరుద్ధరణకు మార్గం సుకరం చేయదా?

కనుక అత్యంత కష్టమైన పరిస్థితులలో ఫ్రెంచి కార్మికవర్గం వ్యవహరిస్తున్నది. పారిస్ ముంగిట్లో శత్రువు పొంచి ఉండగా, అట్టి సంక్షోభంలో గద్దెమీద ఉన్న ప్రభుత్వాన్ని పడగొట్టటం ప్రమాదకరమైన పొరపాటు అవుతుంది. పౌరులుగా తమ బాధ్యతలను ఫ్రెంచి కార్మికవర్గం నిర్వర్తించాలి. అదే సమయంలో 1972 నాటి జాతీయ సాంప్రదాయాలతో అది మోసపోరాదు. మొదటి సామ్రాజ్యం నాడు జాతీయ సాంప్రదాయాల పేరుతో ఫ్రెంచి రైతాంగం మోసోయింది. గతాన్ని పునశ్చరణ చేసుకుని లాభంలేదు. భవిష్యత్తును నిర్మించాలి. రిపబ్లిక్ కలిగించిన స్వాతంత్ర్యాన్ని వారు ప్రశాంతంగా, దృఢంగా తమ వర్గ సంస్థల నిర్మాణానికి వినియోగించుకోవాలి. అలాచేస్తే, మన ఉమ్మడి ప్రయోజనమైన కార్మికవర్గ విమోచనకు, ఫ్రాన్సు పునరుజ్జీవనానికి అవసరమైన భీమబలం వారికి లభిస్తుంది. వారి శక్తి యుక్తులపై రిపబ్లిక్ భవిష్యత్తు ఆధారపడి ఉంది.

ఫ్రెంచి రిపబ్లిక్[13]ను గుర్తించటంలో బ్రిటిష్ ప్రభుత్వం ప్రదర్శిస్తున్న తటపటాయంపులను, బ్రిటిష్ కార్మికవర్గం, బైటినుండి ప్రయోగించిన వత్తిడిద్వారా అధిగమించగలిగారు. బ్రిటిష్ ప్రభుత్వం ప్రస్తుతం ప్రదర్శిస్తున్న జాప్యానికి కారణం బహుశా లోగడ ఫ్రెంచి కుట్రను జాకొబిన్ వ్యతిరేక యుద్ధానికి అతిత్వరగా, ఆమోదముద్ర వేశామనే పశ్చాత్తాపం కావచ్చు. ఫ్రాన్సును విభజించాలని సిగ్గువిడిచి కొన్ని ఇంగ్లీషు కార్మికవర్గం ఈ యత్నాన్ని ప్రతిఘటించాలి. ఇవే పత్రికలు 20 ఏండ్లపాటు, లూయీ బోనపార్టీని, దైవశక్తుల ప్రత్యక్ష అవతారమైనట్లుగా ఆకాశాని కెత్తాయి. బానిస యజమానుల తిరుగుబాటును అత్యావేశంతో బలపరచాయి.[14] ఆనాటివలె. నేడుకూడా ఈ పత్రికలు బానిస యజమానుల కొరకే సేవ చేస్తుంటాయి.

అంతర్జాతీయ కార్మిక సంస్థకు చెందిన వివిధ దేశాల శాఖలు, కార్మిక వర్గాన్ని కార్యాచరణకు ప్రేరేపించాలి. వారు తమ విధిని విస్మరించి, చేతులు ముడుచుకు కూచుంటే, ప్రస్తుత యుద్ధఫలితంగా, మరింత భయానకమైన అంతర్జాతీయ ఫలితాలు తలఎత్తుతాయి. ప్రతి దేశంలోను, కార్మికులపైన భూస్వాములు సేనానులు, పెట్టుబడిదారులు తిరిగి విజయం సాధిస్తారు.

రిపబ్లిక్ విజయవంతం ఔగాక !

మార్క్స్ రాసిన ఈ ప్రసంగాన్ని, 1870
సెప్టెంబరు 9న జరిగిన అంతర్జాతీయ కార్మిక
సంస్థ జనరల్ కౌన్సిల్ ఆమోదించింది.
ఇంగ్లీషు, జర్మన్, ఫ్రెంచి భాషలలో ఒకేసారి
అచ్చు వేయబడ్డది

ఇంగ్లీషు కరపత్రాన్ననుసరించి
అచ్చు వేయబడ్డది






# 1871 ఫ్రాన్సు అంతర్యుద్ధంపై అంతర్జాతీయ కార్మిక సంస్థ జనరల్ కౌన్సిల్ ప్రసంగం

## యూరోప్, అమెరికాలలోని కార్మిక సంస్థ సభ్యులందరికి

1870 సెప్టెంబరు 4న, పారిస్‌లోని కార్మిక ప్రజలు, రిపబ్లిక్‌ను ప్రకటించారు. యూరప్‌లోని యావన్మంది వెన్వెంటనే ఒక్క మినహాయింపు లేకుండా ఇందుకు హర్షం వెలిబుచ్చారు. కాగా అదే సమయంలో, అధికారం కొరకు ఆరాటపడే కొందరు న్యాయవాదుల ముఠా, హోటల్ డీ విల్లీని స్వాధీనం చేసుకున్నారు. వారి రాజకీయ నాయకుడు థయర్స్, వారి సేనాని ట్రోచు. అన్ని చారిత్రక సంక్షోభ సమయాలలోను ఫ్రాన్సు తరపున ప్రాతినిధ్యం వహించే అర్హత పారిస్ నగరానికి మాత్రే ఉన్నదని వారు దృఢంగా విశ్వసించారు. ఫ్రాన్సు గవర్నర్లుగా తాము స్వయంగా పెట్టుకున్న బిరుదులకు సమర్ధనగా, పారిస్ ప్రతినిధులుగా తాము ఒకప్పుదున్నామనే సనదులు చూపిస్తే చాలుననుకున్నారు. గత యుద్ధాన్ని గురించిన మా రెండవ ప్రసంగంలో, ఈ వ్యక్తులు అధికారం ప్రకటించుకున్న అయిదు రోజులలోనే, వీరి స్వభావం ఏమిటో మీకు వివరించాను. అయినప్పటికి ఆకస్మిక ఘటనల హడావిడిలో, కార్మికవర్గంయొక్క నిజమైన నాయకులు ఇంకా బోనపార్టిస్టు జైళ్ళలోనే మగ్గుతూండగా, వీరి అధికారం కేవలం జాతీయ రక్షణకు మాత్రమే ఉపయోగపడాలనే నిర్ధిష్ట షరతుకు లోబడి, వారి చర్యను సహించింది. కాని, కార్మికులను, సాయుధం చేయకుండా, వారిని సమర్ధవంతమైన శక్తిగా రూపొందించకుండా, యుద్ధం ద్వారానే వారికి తరిఫీదు ఇవ్వకుండా, పారిస్‌ను శత్రుదాడినుండి రక్షించుకోవటం సాధ్యం కాదు. కాని పారిస్‌ను సాయుధం చేయడమంటే, విప్లవాన్ని సాయుధం చేయడమే. ప్రష్యన్ దురాక్రమణదారునికి వ్యతిరేకంగా ఫ్రెంచి కార్మికులు విజయం సాధించడమంటే, ఫ్రెంచి పెట్టుబడి దారునిపైన, ప్రభుత్వంలోని అతని పరాన్నభుక్కులైన ప్రతినిధులపైన

ఘ్రించి కార్మికవర్గం విజయం సాధించడమే జాతీయ బాధ్యత, వర్గప్రయోజనాల మధ్య ఏర్పడిన ఈ ఘర్షణ సమయంలో, జాతీయ రక్షణకై ఏర్పడిన ప్రభుత్వం, ఒక్క క్షణకాలం కూడా పస్తాయించకుండా జాతీయ విద్రోహ ప్రభుత్వంగా మారిపోయింది.

వారు తీసుకున్న మొదటి చర్య యూరపులోని అన్ని దేశాలకు థయర్స్‌ను సంచార రాయబారిగా పంపటం. రిపబ్లిక్ స్థానంలో రాజును సింహాసనస్థుని చేసే ప్రాతిపదికపై రాజీకి ముట్టడిదారులను ఒప్పించ వలసిందిగా ఆ దేశాధినేతలను ప్రాధేయపడటం ఈ యాత్ర ఉద్దేశం. ముట్టడి ప్రారంభమైన నాలుగు నెలలకు వారు మొదటిసారిగా లొంగుబాటు సంకేతం పంపటానికి సమయం వచ్చిందని పారిస్, నగర మేయర్ల నుద్దేశించి ఇలా అన్నారు. "సెప్టెంబరు 4వ తేదీ సాయంత్రం నా సహచరులు నన్ను వేసిన మొదటి ప్రశ్న ఏమంటే, ప్రష్యన్ సైన్యం ముట్టడిని పారిస్ జయప్రదంగా తట్టుకోగలదా అని. లేదు అని నేను నిర్మొహమాటంగా సమాధానం చెప్పాను. ఇక్కడ సమావేశమైన సహచరులలో కొందరు నా మాట నిజాయితీని విశ్వసిస్తారని. నా అభిప్రాయ తీవ్రతను మన్నిస్తారని ఆశిస్తున్నాను. నేను వారికీ క్రింది విధంగా చెప్పాను. ప్రస్తుత పరిస్థితులలో ప్రష్యన్ సైన్యం ముట్టడిని ప్రతిఘటించ ప్రయత్నించడం కేవలం తెలివితక్కువ అవుతుంది. నేనింకా ఇలా అన్నాను : నిస్సందేహంగా ఆ పని సాహసంతో కూడిన తెలివి తక్కువ ఔతుంది. దాంతో ఆఖరైపోతుంది... తరువాత జరిగిన ఘటనలు(ఇవన్నీ వారు సృష్టించినవే), నా మాటలు అసత్యమని నిరూపించలేదు."

ట్రోచు చేసిన చక్కని ఈ చిన్న ప్రసంగం. ఆ తర్వాత ఆ సమావేశానికి హాజరైన ఒక మేయర్, యం.కార్బన్‌చే ప్రచురితమైంది.

ఆ విధంగా రిపబ్లిక్ ప్రకటించబడిన మొదటి సాయంత్రమే, ట్రోచు పారిస్ లొంగుబాటుకు "పథకం" వేస్తున్నాడని అతని సహచరులకు తెలిసిపోయింది. జాతీయ రక్షణ, థయర్స్ స్వంత ప్రభుత్వానికి నామమాత్రమైన ఒక ఆచ్ఛాదన కంటె ఎక్కువేమీ కాదు. అలా కాని పక్షంలో ఈ ఆగంతకులు 5వ తేదీననే లొంగిపోయేవారు. పారిస్ ప్రజలను, ట్రోచు పథకంలోకి ఇమిడ్చేవారు. వెన్వెంటనే లొంగిపోవలసిందిగా వారికి ఆజ్ఞాపించేవారు. లేక తమ భవిష్యత్తును తమ చేతుల్లోకి తీసుకోవలసిందిగా విజ్ఞప్తి చేసేవారు. కాని వారు ఇవేమీ చేయలేదు. ప్రసిద్ధి చెందిన ఈ వంచకులు, పారిస్ యొక్క సాహసోపేతమైన తప్పిదానికి విరుగుడుగా కరువు కాటకాల పరిపాలనను, తలకాయలు బద్దలు చేసే పరిపాలనను విధించారు."పారిస్ గవర్నరైన ట్రోచు ఏదిఏమైనా లొంగిపోడు:" విదేశాంగ మంత్రి జూల్స్ ఫేవ్రే "ఒక్క అంగుళం భూభాగాన్ని కూడా వదలడు. కోటలలోని ఒక్క రాతి ముక్కను కూడా వదలుకోడు" అని బూటకపు

ప్రకటనలు చేయసాగారు. గాంబెట్టాకు రాసిన లేఖలో, ఈ జూల్స్ ఫెవ్రే తన నిజ స్వభావాన్ని బట్టబయలు చేశాడు. ప్రష్యన్ సైనికులకు వ్యతిరేకంగా కాక. పారిస్ కార్మికులకు వ్యతిరేకంగా తాము రక్షణ చర్యలు సాగిస్తున్నామని అతడు ప్రకటించాడు. ముట్టడి కొనసాగినంతకాలం ఈ బోనపార్టిస్టు హంతకులు, ఎవరి మీద పారిస్ సైన్యానికి అధిపత్యం వహించే బాధ్యత ఉందో వారు, తమ రహస్య లేఖలలో, రక్షణ పట్ల తమకు గల ఏహ్యాభావాన్ని, జుగుప్సాకరమైన హాస్య ప్రసంగాల ద్వారా వ్యక్తం చేస్తూనే వచ్చారు.(ఉదాహరణకు, పారిస్ రక్షణ సైన్యంలోని ఫిరంగిదళ సర్వసేనాని గ్రాండ్ క్రాస్ ఆఫ్ రీజియన్ ఆఫ్ ఆనర్ బిరుదాంకితుడైన ఆల్ఫాన్స్ సైమన్ గుయడ్ ఫిరంగి దళంలోని ఒక సేనాని ఐన సుసానేకు వ్రాసిన లేఖలు చూడండి. ఇవి కమ్యూన్ అధికార పత్రికలో[15] ప్రచురితమైనాయి). చివరకు మోసపూరితమైన ఈ ముసుగు, 1871 జనవరి 28న, వదలివేయబడ్డది. అత్యంత అవమానకరమైన ధోరణిలో, జాతీయ రక్షణ ప్రభుత్వం లొంగుబాటు ప్రభుత్వంగా మారింది. బిస్మార్క్ ఖైదీలు నిర్వహించే ప్రభుత్వంగా మారింది. ఈ పరిస్థితి ఎంత అవమానకరమైనదంటే, లూయీ బోనపార్టీయే, సెడాన్‌లో ఈ పదవిని స్వీకరించటం అవమానకరంగా భావించి నిరాకరించాడు. మార్చి 18 ఘటనల తర్వాత, వర్సెల్స్ నగరానికి పారిపోయే సందర్భంలో, ఈ లొంగుబాటు దారులు తమ విద్రోహానికి సంబంధించిన పత్రాలను వదలి వెళ్ళారు. వీరి విద్రోహాన్ని గురించి కమ్యూన్ తన కరపత్రంలో ఇలా తెలియజేసింది. "పారిస్ నగరాన్ని ముక్కచెక్కలు చేసి, రక్త సముద్రంలో ముంచుటానికి సైతం ఈ విద్రోహులు వెనకాడరు."

ఇట్టి విద్రోహానికి పాల్పడటంలో, రక్షణ ప్రభుత్వ సభ్యులకు తమ ప్రత్యేక కారణాలు కూడా ఉన్నాయి. ఇవి చాలా విచిత్రంగా ఉంటాయి.

సంధి ఒప్పందం కుదిరిన వెన్వెంటనే జాతీయ శాసన సభలో, పారిస్ తరఫున ఒక ప్రతినిధిగా ఎన్నికైన యం.మిల్లీరి కొన్ని అధికార పూర్వక న్యాయ సంబంధమైన పత్రాలను ప్రకటించాడు. మిల్లీరి ఆ తర్వాత, జూల్స్ ఫేవ్రే ఆదేశం మేరకు కాల్చివేయబడ్డాడు. ఆ పత్రాలలో ఉన్నదేమంటే జూల్స్ ఫేవ్రే, ఆల్జీర్స్‌లోని ఒక త్రాగుబోతువాని భార్యతో అక్రమ సంబంధం కలిగి ఉన్నాడు. తద్వారా కొందరు పిల్లలు కలిగారు. వారి పేరుతో ఫోర్జరీ పత్రాలను సృష్టించి పెద్ద ఆస్తికి తాను వారసుడైనాడు. ఆ ఆస్తికి అసలు వారసులు ఇతనిపై దావా వేశారు. బోనపార్టిస్టు న్యాయమూర్తుల కమిటీ సాయంతో మాత్రమే. ఈ వ్యవహార మంతా బైట పడకుండా అతను తప్పించుకో గలిగాడు. ఎంత వాగాడంబరపు ఉపన్యాసాలు చేసినా, ఖచ్చితమైన

ఈ పత్రాలను వదలించుకోవటం సాధ్యం కాదు కనుక మొట్టమొదటిసారిగా, జూల్స్ ఫేవ్రే తన నోరు మూసుకుని, అంతర్యుద్ధం ప్రారంభ మయ్యేవరకు పడి ఉన్నాడు. అప్పుడు ఒక్కసారిగా పారిస్ ప్రజలపై దూషణ వర్షం కురపించ సాగాడు. వీరందరూ తప్పించుకు పారిపోయిన ఖైదీలని, కుటుంబం, మతము, ఆస్తి శాంతి భద్రతలకు వ్యతిరేకులని వాదించ సాగాడు. ఈ మోసకాడు సెప్టెంబరు 4వ తేదీన అధికారంలోకి వచ్చాడో లేదో వెంటనే పిక్ ట్రైలిఫిర్ అనే ఖైదీలను సానుభూతితో వదలి, సమాజంపై ప్రయోగించాడు. వీరు అవమానకరమైన ఎటెండార్డ్[16] వ్యవహారంలో, సామ్రాజ్య పాలనలోనే, తప్పుడు పత్రాలు సృష్టికై నిర్బంధించబడినవారు. వీరిలో ఒకరైన ట్రైలిఫర్, కమ్యూన్ కాలంలో పారిస్‌లో ప్రవేశించటానికి సాహసించాడు. వెంటనే కమ్యూన్ అధికారులు అతనిని జైలులో పెట్టారు. సరిగ్గా అప్పుడు జూల్స్ ఫేవ్రే జాతీయ శాసన సభ వేదిక పైనుండి. జైలులోని నేరస్తులందరినీ ప్రభుత్వం విడుదల చేస్తున్నదంటూ గగ్గోలు పెట్టాడు.

జాతీయ రక్షణ ప్రభుత్వంలో తనకు తానే విదేశాంగ మంత్రిగా ప్రకటించుకున్న ఎర్నెస్ట్ పికార్డ్ మరొకరు. 18వ శతాబ్దపు ఆంగ్లేయ నటకుడు జోమిల్లర్[17] లాంటి వాడు. సామ్రాజ్యానికి హోంశాఖా మంత్రి కావాలని ఇతడు. ఎంతగానో ప్రయత్నించాడు. ఇతడు ఆర్థరీ పికార్డ్ అనే వ్యక్తికి సోదరుడు. ఈ వ్యక్తి పారిస్ బోర్స్ నుండి దొంగకూలీగా బహిష్కరించబడ్డాడు. (1867 జూలై 13వ తేదీ పోలీసు సర్వాధికారి నివేదిక చూడుదు). అంతేగాక జనరల్ సొసైటీ శాఖలలో ఒకటైన రూ పాలెస్ట్రో, 5వ నెంబరు శాఖలో మేనేజరుగా ఉంటూ 3 లక్షల ఫ్రాంకులు అపహరించాడు. ఈ నేరాన్ని అతడే అంగీకరించాడు. అందుకుగాను శిక్షితుడయ్యాడు. (1868 డిసెంబరు 11, పోలీసు సర్వాధికారి నివేదిక చూడుము) ఈ ఆర్థర్ పికార్డ్‌ను, సోదరుడైన ఎర్నెస్ట్ పికార్డ్ తన పత్రిక, ఎలెక్టోర్ లెబ్రీకి సంపాదకుడ్ని చేశాడు. ఫైనాన్స్ శాఖ అధికార ప్రకటన చెప్పిన అబద్ధాలలో మామూలు వాటాదార్లంతా అటూ, ఇటూ పరుగులెత్తుతుండగా, అర్థర్ పికార్డ్ ఫైనాన్స్ శాఖకు, బోర్సుకు మధ్య అటూఇటూ పరుగెత్తుఊ ఫ్రెంచి సైనిక పరాజయాలను కప్పిపుచ్చటానికి యత్నించాడు. గౌరవనీయులైన ఈ ఇద్దరు సోదరుల, ఆర్థిక ఉత్తర ప్రత్యుత్తరాలన్నీ కమ్యూన్ అధికారుల చేతుల్లో పడ్డాయి.

సెప్టెంబరు 4వ తేదీకి పూర్వం పైసా కూడా లేని జూల్స్ ఫెర్రీ అనే బారిస్టరు ముట్టడి సమయంలో, పారిస్‌కు మేయర్‌గా ఉండి కరువులో నుండి కనక రాసులు పోగు చేసుకున్నాడు. అతడి దుష్పరిపాలన కంతా సమాధానం చెప్పవలసిన రోజే వస్తే, అతడికి జైలుశిక్ష ఖాయం.

పారిస్ నాశనమౌతుంటే ఇలాంటి మనుషులందరూ పారిపోవటానికి సన్నాహాలు చేసుకుంటున్నారు. బిస్మార్కుకు కావలసిన మనుషులు వీరే. ఇంతవరకూ, ప్రభుత్వానికి రహస్య తోడ్పాటు నిన్నున్న థయర్స్ ఇప్పుడు దానికి అధిపతి. ఈ పలాయనవాదులందరూ* అతనికి మంత్రులైనారు.

భయంకరమైన పిశాచతుల్యుడైన థయర్స్, ఫ్రెంచి బూర్జువావర్గాన్ని అర్థ శతాబ్దంపాటు సమ్మోహితుడ్ని చేశాడు. ఏమంటే బూర్జువా వర్గ అవినీతికి అత్యంత సమర్థవంతమైన, మేధోపరమైన వ్యక్తీకరణకు అతడే చిహ్నం. రాజకీయవేత్త కాక ముందే చరిత్రకారుడుగా అసత్య ప్రలాపనలలో తన సామర్థ్యాన్ని అతడు నిరూపించుకున్నాడు. అతని పౌర జీవితంలోని ఘటనాక్రమం అంతా, ఫ్రాన్సుకు పట్టిన దురదృష్ట జాతక చక్రం. 1830కి పూర్వం అతడు రిపబ్లికన్లతో ఉండేవాడు. తన రక్షకుడైన లాఫిటీకి ద్రోహంచేసి. లూయి ఫిలిప్పి క్రింద మంత్రిగా చేరాడు. మత గురువులకు వ్యతిరేకంగా, ప్రజలను రెచ్చగొట్టి, రాజు మన్నన పొందాడు. ఈ మత కలహ సమయంలో, సెయింట్ జర్మాయిన్ ఆక్సిరోయిస్ చర్చి. ఆర్చి బిషప్ భవనం దోపిడీకి గురయ్యాయి. డచెస్ డి బెర్రీ జైలులో ఉండగా ఆమెపై గూఢచారి మంత్రిగా పనిచేశాడు. ట్రాన్స్‌నోనియన్ రాష్ట్రంలో జరిగిన మారణ హోమానికి, పత్రికా స్వేచ్ఛకు, సమావేశ స్వేచ్ఛకు వ్యతిరేకంగా జారీఐన చట్టాలకు ఇతనే బాధ్యుడు. 1840 మార్చిలో, తిరిగి మంత్రివర్గ ముఖ్యుడుగా దర్శనమిచ్చాడు. పారిస్ చుట్టూ కోటగోడ కట్టాలనే పథకంతో ఫ్రాన్సును ఆశ్చర్యపరిచాడు. ఈ పథకం, పారిస్ స్వేచ్ఛకు గొడ్డలిపెట్టు అని రిపబ్లికన్లు ఖండించగా అందుకు సమాధానంగా, డిప్యూటీల ఛేంబరు వేదికపై నుండి ఇలా సమాధానం ఇచ్చాడు: "ఏమిటి? కోట గోడలు కడితే స్వాతంత్ర్యానికి భంగకరమా! అసలు పారిస్‌పై దాడి చేసి ఏ ప్రభుత్వమైనా బతికి బైటపడగలదు. అనుకోవటమే ఒక పెద్ద నిందారోపణ. ఒక వేళ నిజంగానే అది జయిస్తే ఆ తర్వాత అది నిలబడటం నూటికి కోటికి అసాధ్యం". నిజానికి ఈ కోట గోడలను ప్రష్యన్లకు ధారాదత్తం చేసిన ప్రభుత్వం తప్ప మరే ప్రభుత్వం పారిస్‌పై దాడి చేయటానికి సాహసించజాలదు.

---

* ఇంగ్లాండులో, సాధారణ నేరస్తులు తమ శిక్షలో చాలా భాగం అనుభవించిన మీదట తరచు పెరోల్‌పై విడుదల అయ్యేవారు. వారిపై పోలీసు నిఘా ఉండేది. అలా విడుదలైన సమయంలో సెలవు టిక్కెట్టు అని వారికొక పత్రం ఇచ్చేవారు. ఇలాంటి వారి నందరిని సెలవు టిక్కెట్టుదారులు అనేవారు(1871 జర్మన్ ప్రతికి ఎంగెల్సు నోట్సు)

1848 జనవరిలో బొంబారాజు, పలేర్మోలో జోక్యం కలిగించుకో యత్నించాడు. అప్పటికే థయర్స్, పదవీ విరమణ చేసి చాలాకాలం ఐంది. ఛేంబర్ ఆఫ్ డిప్యూటీస్‌లో అతడు నిలబడి ఇలా అన్నాడు.: “పెద్దలారా, పలేర్మోలో[18] ఏమి జరుగుతున్నదో మీకు తెలుసు గదా! ఒక పెద్ద నగరం 48 గంటలపాటు దాడికి గురైందని వినటంతో మీరు చాలా దిగ్భ్రాంతి చెంది ఉంటారు. దాడి చేసింది ఎవరు? ఏదైనా విదేశీ సైన్యం మనపై యుద్ధం చేస్తున్నదా! కాదు, పెద్దలారా ఆ నగరంలోని ప్రభుత్వమే దాడి చేస్తున్నది. ఎందుకంటె, దురదృష్టవశాత్తు, ఆ నగరం తనకు హక్కులు కావాలి అన్నది. హక్కులు కావాలని అడిగినందుకు, ఆ నగరం 48 గంటల దాడికి గురైంది. యూరపు ప్రజాభిప్రాయానికి నేను విజ్ఞప్తి చేయదలిచాను. ఇట్టి దుశ్చర్యలకు వ్యతిరేకంగా కొన్ని మాటలు(నిజమే మాటలు) చెప్పటం ద్వారా, వారు, యూరపులోని అత్యున్నత ప్రజాభిప్రాయ కేంద్రమైనవారు, మానవాళికి గొప్పసేవ జేస్తున్నారు. ఆగ్రహంతో కూడిన వారి వాణి ప్రతిధ్వనిస్తున్నది. తన దేశానికి సేవచేసిన ఎస్పార్‌టెరో యువరాజు (థయర్స్ ఆ మాత్రం సేవనుకూడా చేయలేదు) బార్సిలోనా పై దాడిలోనా పై దాడికి పూనుకున్నప్పుడు, తిరుగుబాటును అణచివేయ ప్రయత్నించినపుడు, ప్రపంచ వ్యాపితంగా అందుకు నిరసన వ్యక్తమైంది.”

పద్దెనిమిది నెలల తర్వాత, ఫ్రెంచి సైన్యం రోమ్ నగరంపై దాడి చేసి నప్పుడు[19] ఆ దాడిని పట్టుదలతో సమర్థించిన వారిలో థయర్స్ ఒకడు నిజానికి బొంబా రాజు చేసిన తప్పు ఏమిటంటే, కేవలం 48 గంటలు మాత్రమే దాడి చేయటం అనిపిస్తుంది.

ఫిబ్రవరి విప్లవానికి కొద్ది రోజులు ముందుగా, దీర్ఘకాలం, గిజో తనను పల్లెకు, పట్నానికి ప్రవాసానికి పంపినందుకు నిరసనగా, పెరుగుతున్న ప్రజా అసంతృప్తిని వాసనబట్టి. థయర్ కృత్రిమమైన వీరత్వాన్ని ప్రదర్శిస్తూ ఈ వీరత్వాన్ని ప్రదర్శించినందుకే అతన్ని మిరాబూ తూనీగ అని పిలిచారు. ఛేంబర్ ఆప్ డిప్యూటీస్‌లో ఇలా అన్నాడు: “ఫ్రాన్సులోనే కాదు. యూరప్‌లో సైతం నేను విప్లవపార్టీని, విప్లవ ప్రభుత్వం మితవాదుల చేతులలో ఉండాలని నేను కోరుకుంటున్నాను. ఈ ప్రభుత్వమే గనుక తీవ్రవాదుల చేతులలోకి పోతే, చిత్తశుద్ధిగల వారి చేతులలోకి పోతే, అప్పుడు సైతం నేను నా లక్ష్యాన్ని వదలి పెట్టను. నేను ఎల్లప్పుడూ విప్లవపార్టీగానే ఉంటాను.” ఫిబ్రవరి విప్లవం వచ్చింది. అల్పబుద్ధి ఐన థయర్స్ ఊహించిన విధంగా గిజో మంత్రివర్గ స్థానే థయర్స్ మంత్రివర్గం రావటానికి బదులు, మొత్తం లూయీ ఫిలిప్పా పతనమై. రిపబ్లిక్ ఏర్పడ్డది. ప్రజా విజయం సంభవించిన మొదటి రోజున, అతడు జాగ్రత్తగా, ఒక చోట దాక్కున్నాడు. శ్రామిక ప్రజలకు అతనిపట్ల గల ద్వేషాన్నుండి, వారి అసహ్యమే అతన్ని కాపాడింది. ఐనప్పటికి మహా సాహసవంతుడైన అతడు,

బహిరంగంగా ప్రజలకు కనపడటానికి వెనకాడుతూనే ఉన్నాడు. జూన్ తిరుగుబాటు అతనికి మార్గం సుకరం చేసింది.* అప్పుడతడు "పార్టీ ఆఫ్ ఆర్డర్"[20]కు దాని పార్లమెంటరీ రిపబ్లిక్‌కు ముఖ్యనాయకుడైనాడు. అప్రతిష్ఠాకరమైన ఈ మధ్యంతర సంస్థలో పాలకవర్గానికి చెందిన అన్ని పోటీ ముఠాలు ప్రజలను అణచి వేయటానికి కుట్ర చేశాయి. వారిలో ప్రతి ఒక్క ముఠా తమ రాచరిక ప్రభుత్వాన్ని స్థాపించుకునేందుకు ఇతర ముఠాలకు వ్యతిరేకంగా కుట్ర చేస్తూ వచ్చాయి. ఇప్పటిలాగే అప్పుడు కూడా రిపబ్లిక్ దృఢతరం కాకుండా ఆటంకపరుస్తున్నది రిపబ్లికన్లేనని థయర్స్ అనేవాడు. ఇప్పటిలాగే అప్పుడు కూడా ఉరితీసేవాడు. డాన్ కార్లోస్‌తో మాట్లాడినట్లుగా ఇలా అనేవాడు : "నీ క్షేమంకోసమే నిన్ను ఉరితీస్తున్నాను." ఇప్పటిలాగే ఆనాడు కూడా అతడు. తన విజయానంతరం మరుసటి రోజున "సామ్రాజ్యం సుస్థిరమైంది." లూయీ బోనపార్టీ పట్ల అతనికి వ్యక్తిగతమైన స్పర్థ ఉన్నప్పటికీ, స్వేచ్ఛా స్వాతంత్ర్యాల ఆవశ్యకతపై అతడు గంభీర ప్రసంగాలు చేసినప్పటికీ, ఇతడికి, రెండవ సామ్రాజ్యంలో జరిగిన అన్ని కుట్రలలోనూ భాగముంది. లూయీ బోనపార్టీ ఇతన్ని పార్లమెంటరీ వ్యవస్థలో నుండి బైటికితన్ని తేలికగా మోసపుచ్చాడు. కృత్రిమమైన పార్లమెంటుకు వెలుపల గల వాతావరణంలో, ఈ అల్పాయుష్కుడు, తాను ఎందుకూ కొరగానివాడైపోతున్నానని గుర్తించసాగాడు. అలాంటి ఇతనికి, రోమ్‌ను ఆక్రమించుకున్న ఫ్రెంచి సేనలతో, ప్రష్యాపై జరిగిన యుద్ధంతో ప్రమేయముంది. జర్మన్ ఐక్యతపై భయంకరమైన దాడిచేసి ఈ యుద్ధాన్ని ప్రేరేపించింది ఇతడే. ప్రష్యన్ నియంతృత్వానికి ఒక ముసుగుగాకాక, జర్మనీని విడదీసి ఉంచుటలో ఫ్రాన్సుకు గల స్వార్థ ప్రయోజనాలపై చొరబాటుగా, ఈ ప్రేరేపణ జరిగింది. తన మరుగుజ్జు చేతులతో, మొదటి నెపోలియన్ కత్తిని యూరప్‌కు వ్యతిరేకంగా ఝుళిపించటం అంటే ఇతడికి సరదా. ఆనెపోలియన్ బూట్లకు వేసిన నల్లరంగుగా చారిత్రకంగా ఇతడు మారిపోయాడు. ఇతని విదేశాంగ విధానం, 1840 లండన్ సదస్సు మొదలుకొని, 1871లో పారిస్ లొంగుబాటువరకు, ఎల్లప్పుడూ సంపూర్ణమైన అప్రతిష్ఠతోనే ముగింపు ఔతూ వచ్చింది. నేటి అంతర్యుద్ధంలో కూడా. అతడు బిస్మార్క్ ప్రత్యేక అనుమతితో సెడాన్, మెట్జ్‌లోని యుద్ధ ఖైదీలను పారిస్‌కు వ్యతిరేకంగా వేట కుక్కలను వలె ఉసిగొల్పుతున్నాడు. అతనికి గొప్ప సామర్థ్యం ఉంది. తన లక్ష్యాలను నిరంతరం మార్చుకుంటూ ఉంటాడు. ఐనప్పటికి ఇతడు యావజ్జీవమూ, అత్యంత నిర్జీవమైన రోజువారీ కార్యక్రమంతోనే మునిగిపోతూ వచ్చాడు. ఆధునిక సమాజంలో

* 1848 జూన్‌లో పారిస్ కార్మికవర్గం తిరుగుబాటు చేయగా ఆ తిరుగుబాటును దారుణంగా అణచివేశారు.

అంతర్గర్భితమైనలోతైన అంతః ప్రవాహాలను గురించి ఇతనికి ఏ మాత్రమూ అవగాహనలేదని స్పష్టం ఔతూనే ఉంది. కాగా ఉపరితలంపై అతి స్పష్టంగా కనపడే మార్పులు సైతం. ఇతని బుర్రకు దుస్సహంగా ఉన్నాయి. ఇతని తలకాయలోని శక్తి అంతా నాలుకకు మాత్రమే సంక్రమించింది. కనుకనే, పాతకాలపు ఫ్రెంచి రక్షణ వ్యవస్థనుండి ఏమాత్రం వైదొలగినా, అది మహా పాపమైనట్లు విసుగులేకుండా అతడు నిందిస్తూనే ఉంటాడు. లూయీ ఫిలిప్పీ క్రింద మంత్రిగా ఉండగా, రైల్వేల నిర్మాణం, ఆటవికమైన భ్రమ అని దూషించాడు. లూయీ బోనపార్టీ క్రింద ప్రతిపక్షంలో ఉండగా, కుళ్ళిపోయిన ఫ్రెంచి సైనిక వ్యవస్థను సంస్కరించే ప్రతి ప్రయత్నమూ మహా పాపమని దుమ్మెత్తిపోశాడు. సుదీర్ఘమైన అతని రాజకీయ జీవితంలో, అతడు ఏనాడు. ఆచరణలో ఉపయోగపడే ఒక చిన్నపనిని కూడా చేసిన పాపాన పోలేదు. సంపదపట్ల దురాశ, సంపదను సృష్టించేవారి పట్ల ద్వేషము–ఈ రెండూ మాత్రం ఎట్టి ఒడుదుడుకులు లేకుండా అతనిని అంటి పెట్టుకున్నాయి. లూయీ ఫిలిప్పీ క్రింద మొదటిసారి మంత్రి ఐనప్పుడు అతడు చాలా పేదవాడు, మంత్రి పదవి వదలే సమయానికి కోటీశ్వరుడైనాడు. అదే చక్రవర్తి క్రింద అతడు అఖరుసారిగా మంత్రి పదవిని (1849 మార్చి 1న) స్వీకరించాడు. అప్పుడతడు డిప్యూటీల సభలు, ధనాపహరణ ఆరోపణపై బహిరంగ విమర్శలకు గురి అయినాడు. అందుకతడిచ్చిన సమాధానం కడివెడు కన్నీళ్ళు కురిపించటం. ఈ సరు కొక్కటే. అతడు జూల్స్ ఫేవ్రేలాగానో, మరే మొసలి లాగానో, పుష్కలంగా సరఫరా చేయగలడు. ఫ్రాన్సుకు ఆర్థిక సంక్షోభం ముంచుకు రానున్న సమయంలో అతడు బోర్డోలో ఉన్నాడు. అప్పుడతడు చేసిన మొదటి పని ఏమంటే తనకు ఏటా మూడు మిలియన్లు కేటాయించుకోవటం. 1869లో పారిస్ తన నియోజకవర్గ వోటర్ల ఎదుట అతడు వివరించిన 'ఆర్థిక రిపబ్లిక్' భావన సాధించిన, మొదటి పని, ఆఖరు పని కూడా ఇదే. 1830లో ఇతడితోపాటు డిప్యూటీల సభలో సభ్యుడు యం.బిస్లే, ఇతడు స్వతహాగా పెట్టుబడిదారు. ఐనా, పారిస్ కమ్యూన్‌లో విశ్వాసపాత్రుడైన సభ్యుడు. ఇతడు ఇటీవల థియర్స్‌ను, ఒక బహిరంగ సభలో ఇలా ప్రశ్నించాడు. "పెట్టుబడి కార్మికులను దోచుకోవటం, మొదటి నుండి నీ విధానంలో పునాది రాయిగా ఉన్నది. హోటల్ డీ వీల్లిలో, లేబర్ రిపబ్లిక్, ప్రతిష్టాపితమైన రోజునుండి, నీవు 'వీరంతా నేరస్తులు' అని యావత్తు ఫ్రాన్సుకు వినపడేటట్లు గగ్గోలు పెడుతూనే ఉన్నావు." చిన్న చిన్న ప్రభుత్వాలను కూల్చటంలో థియర్స్ ఘటికుడు. దొంగ పత్రాలు సృష్టించడంలోనూ, మోసం చేయటంలోనూ నిపుణుడు పార్లమెంటరీ పార్టీల కుమ్ములాటల్లో వ్యక్తమయ్యే, దారుణమైన ద్రోహాలు చేయటంలోను, కుట్రతో కూడిన ఎత్తుగడలలోనూ, అల్పబుద్ధితో

కూడిన నీచమైన పన్నాగాలలోనూ ఆరితేరినవాడు. పదవిలో లేనప్పుడు, విప్లవాన్ని రెచ్చగొట్టడానికి, పదవిలో ఉన్నప్పుడు అదే విప్లవాన్ని రక్తపుటేరులలో ముంచటానికి వెనుదీయని వాడు, అతనికున్నవి భావాలు కావు. వర్గ దురభిప్రాయాలు. హృదయం ఉండవలసిన స్థానంలో, అహంకారమున్నది. అతని పౌర జీవితం ఎంత అవమానకరమో, వ్యక్తిగత జీవితం అంతగా అప్రతిష్టాకరం. ఇప్పుడు సైతం సాధు పాత్ర నటిస్తున్నప్పటికీ, అతడి ఆడంబరం, అట్టహాసం, చర్చలు, ప్రజలలో అసహ్యతను కలిగిస్తూనే ఉన్నాయి.

పారిస్‌ను మాత్రమే గాక, ఫ్రాన్సును యావత్తూ ప్రష్యాకు అప్పగించడం ద్వారా శత్రువుతో దీర్ఘకాలంగా వీరు సాగిస్తున్న కుట్రలు ముగింపు కొచ్చాయి. ఈ కుట్రదారులు, సెప్టెంబరు 4వ తేదీనే ఈ కుట్రలు ప్రారంభించారు. టోచూ ఈ విషయాన్ని ఆ రోజుననే అంగీకరించాడు. పైపెచ్చు ఈ లొంగుబాటు ఫలితంగా అంతర్యుద్ధం ప్రారంభమైంది. ప్రష్యా సహాయంతో, పారిస్‌కు, రిపబ్లిక్‌కు వ్యతిరేకంగా, వీరు ఈ అంతర్యుద్ధాన్ని కొనసాగిస్తున్నారు. లొంగుబాటుకు సంబంధించిన షరతులోనే, అంతర్యుద్ధానికి అవసరమైన వల పన్నారు. ఆ సమయానికి మూడోవంతు భూభాగానికి పైగా, శత్రువు అధీనంలో ఉంది. రాష్ట్రాలకు, రాజధానికి సంబంధాలు తెగిపోయాయి. రవాణా మార్గాలన్నీ చిన్నాభిన్నమైనాయి. అట్టి పరిస్థితులలో, సన్నాహాలకు తగు వ్యవధిని ఇస్తే తప్ప, ఫ్రాన్సుకు నిజంగా ప్రాతినిధ్యం వహించే వారిని ఎన్నుకోవటం అసాధ్యం. ఇది దృష్టిలో పెట్టుకునే, ఎనిమిది రోజులలో జాతీయ శాసనసభ ఎన్నిక కావాలని, లొంగుబాటు పత్రంలో షరతు విధించ బడ్డది. ఫలితంగా, ఫ్రాన్సులో చాలా ప్రాంతాల్లో ఎన్నికలు జరుగుతాయనే వార్త, పోలింగ్ సమయానికి మాత్రమే చేరుకుంది. అంతేకాదు. లొంగుబాటు పత్రంలోని ఒక షరతు ననుసరించి, ఈ శాసన సభ ఒకే విషయంపై, శాంతి లేక యుద్ధంపై నిర్ణయం చేయాలి. చిట్టచివరకు శాంతి ఒప్పందాన్ని ఆమోదించాలి. యుద్ధ విరమణ షరతులను చూసినట్లయితే, యుద్ధం కొనసాగించటం ఇక అసాధ్యం అని ప్రజలు భావించితీరుతారు. అలాంటి, శాంతిని, బిస్మార్కు విధించిన శాంతిని, అమలు జరపటానికి ఫ్రాన్సులోని అత్యంత దుర్మార్గులే అత్యంత సమర్థులు. ఈ ఏర్పాట్లతో సంతృప్తిపడక యుద్ధ విరమణ విషయం పారిస్‌లో పొక్కక ముందే, రాష్ట్రాలలో ఎన్నికల ప్రచారానికి బయలుదేరాడు. బోనపార్టిస్టు పార్టీ ఎలాగో బతకలేదు కనుక ఆ స్థానంలో ఆర్లియునిస్టుల[21]తో పాటు నశించిన లెజిటిమిస్టు పార్టీకి తిరిగి ప్రాణం పోసేందుకే ఈ ప్రచారం ప్రారంభించాడు. బోనపార్టిస్టులంటే థియర్సుకు భయం లేదు. ఆధునిక ఫ్రాన్సును పరిపాలించగల సత్తా వారికి లేదు. కనుక వారు పోటీదారులుగా భావించటమే అవమానకరం.

ప్రతీఘాత విప్లవానికి సాధనగా ఉపయోగపడేందుకు ఈ పార్టీకంటె మరి దేనికీ అర్హతలేదు. ఏమంటే (1833, జనవరి 5న, డిప్యూటీల సభలో) థయర్స్ చెప్పినట్లు "ఈ పార్టీ కార్యాచరణ అంతా కేవలం విదేశీ దురాక్రమణ, అంతర్యుద్ధం అరాచకం అను మూడు అంశాలపైన ఆధారపడి ఉంది. దీర్ఘకాలంగా ఎదురు చూస్తున్న గత కాలపు ఊహాజనిత స్వర్గలోకం తిరిగి వస్తుందనే నమ్మకంపై వీరి విధానమంతా ఆధారపడి ఉంది. ఫ్రాన్సును తమ పాదాల క్రింద నలిపివేసే విదేశీ దురాక్రమణ దారులకు వీరు పనిముట్లు, సామ్రాజ్యం కూలిపోయింది. బోనపార్టీ నిర్బంధంలో ఉన్నాడు. వీరు మాత్రం ఇంకా ఉన్నారు. చరిత్ర రథచక్రాలు బహుశా 1816(పూర్తి అభివృద్ధి నిరోధకులతో కూడిన శాసనసభ) ఇంట్రోవబుల్ ఛేంబర్[22] వైపు నడిచినట్లున్నాయి. 1848-1857. రిపబ్లిక్‌లకు చెందిన శాసనసభలలో విద్యాధికులు, అనుభవజ్ఞులు అయిన వారు వారి పార్లమెంటరీ ప్రతినిధులుగా ఉన్నారు. ఇప్పుడు పార్టీలోని సాధారణ సభ్యులు, ఫ్రాన్సులోని మూర్ఖులు, అల్పబుద్ధులూ ఐన భూస్వాములూ, ముందుకు తోసుకొచ్చారు.

బోర్డోలో "రూరల్స్"[24] శాసనసభ సమావేశమైన వెంటనే, థయర్స్ ఒక విషయం స్పష్టం చేశాడు. పార్లమెంటరీ చర్చ అనే లాంఛనం లేకుండానే శాంతికి సంబంధించిన ప్రాథమిక చర్యలకు ఒప్పుదల తెలియచేయాలి. అలా అయితేనే రిపబ్లిక్‌కు దాని ముఖ్య స్థావరమైన పారిస్‌కు వ్యతిరేకంగా యుద్ధం ప్రారంభించడానికి ప్రష్యా తమకు అనుమతిస్తుంది. నిజానికి ప్రతీఘాత విప్లవం, ఇక ఏమాత్రం అలస్యం లేకుండా రంగంలోకి దిగాలి. రెండవ సామ్రాజ్య కాలంలో, జాతీయ రుణం రెండింతలకు పైగా పెరిగింది. ముఖ్యమైన నగరాలన్నీ బరువైన మునిసిపల్ రుణాలతో మునిగి ఉన్నాయి. యుద్ధ ఫలితంగా ఖర్చులు భయంకరంగా పెరిగిపోయాయి. జాతీయ ఆదాయాలు దారుణంగా కుంచించుకు పోయాయి. ఈ వినాశనాన్ని పూర్తి చేయటానికా అన్నట్లు, ప్రష్యన్ వడ్డీ వ్యాపారస్తుడు ఉండనే ఉన్నాడు. ఫ్రెంచి భూభాగంపై అర మిలియన్ సైనికులను ఉంచుతానని, ఐదు మిలియన్లు నష్ట పరిహారం చెల్లించాలని, బాకీపడిన వాయిదాలపై 5 శాతం వడ్డీ చెల్లించాలని, షరతులు విధిస్తున్నాడు. ఈ ఖర్చులన్నీ ఎవరు భరిస్తారు? రిపబ్లిక్‌ను దౌర్జన్యంగా కూలదోయటం ద్వారా మాత్రమే, సంపదను ఉత్పత్తి చేసే వారి భుజస్కంధాలపై సంపదను స్వాహా చేసే ఈ వర్గాలవారు, యుద్ధ బరువును త్రోసివేయ గలుగుతారు. నిజానికి ఈ దోపిడీదారులే యుద్ధం ప్రారంభం కావటానికి అసలు కారకులు. ఈ విధంగా ఫ్రాన్సు అపారమైన వినాశక పరిస్థితులలో ఉండగా, భూమికి, పెట్టుబడికి అధిపతులైన ఈ దేశభక్తి యుత

ప్రతినిధులు, విదేశీ దురాక్రమణదారు ప్రత్యక్ష పర్యవేక్షణలో విదేశీయుల దాడి యుద్ధానికి, తోడుగా అంతర్యుద్ధాన్ని–బానిస యజమానుదారుల తిరుగుబాటును –జోడించారు.

ఈ కుట్ర విజయంతం కావడానికి ఒకే పెద్ద ఆటంకం ఉంది. అది పారిస్ పారిస్‌ను నిరాయుధీకరణ చేస్తే తప్ప, విజయానికి మొదటి షరతు నెరవేరినట్లు కాదు. కనుక ఆయుధాలను విసర్జించవలసిందిగా థయర్స్ పారిస్‌ను ఆజ్ఞాపించాడు. గ్రామీణ శాసనసభ, ఆవేశపూరితంగా చేసిన రిపబ్లికన్ వ్యతిరేక ప్రదర్శనలతో పారిస్ విసిగిపోయింది. రిపబ్లిక్‌కు గల చట్టబద్ధమైన ప్రతిపత్తిపై థయర్స్ పరస్పర విరుద్ధంగా చేసే ప్రసంగాలతో విసిగిపోయింది. పారిస్‌ను రాజధానిగా రద్దుచేసి ముక్కలు ముక్కలు చేస్తానని థయర్స్ బెదిరించాడు. ఆర్లియనిస్టు పార్టీకి చెందిన రాయబారులను నియమించాడు. చెల్లించని వ్యాపార బకాయిల పైన, ఇండ్ల అద్దెలపైన దుఫారే శాసనాలు చేశాడు. ఈ శాసనాలు పారిస్‌లోని పరిశ్రమలను, వాణిజ్యాన్ని నాశనం చేశాడు. ప్రతి ప్రచురణపైన, అది ఊరూ పేరూ లేనిదైనా సరే ప్రతి కాపీకి 2 సెంటింల పన్నును పోయర్ క్వేర్టియర్ విధించాడు. బ్లాంక్వి, ఫ్లోరెన్సులపై మరణశిక్ష విధించబడ్డది. రిపబ్లికన్ పత్రికలు నిషేధాలకు గురైనాయి. జాతీయ శాసనసభ సమావేశాలు వర్సెల్స్‌కు మార్చబడ్డాయి. సెప్టెంబరు 4తో పారిస్ ముట్టడి ఆంక్షలు. పలికావ్‌చే పొడిగించబడ్డాయి. డిసెంబ్రిస్టు అయిన వినోయ్ పారిస్ గవర్నర్‌గా నియమితుడైనాడు. సామ్రాజ్య పోలీసు శాఖకు చెందిన వాలెంటిన్ పారిస్ పోలీసు అధికారిగా నియమితుడైనాడు. జెసూట్ సేనాని ఆరెల్లె డి పలాడిన్స్, జాతీయ రక్షక దళం సేనానిగా నియమితుడైనాడు.

ఇప్పుడు మనం థయర్స్‌ను, జాతీయ రక్షణ దళానికి చెందిన అతని ఉద్యోగులను ఒక ప్రశ్న వేయాలి. తన ఆర్థిక మంత్రి పోయెర్ క్వేర్టియర్ ద్వారా రెండు మిలియన్ల రుణం థయర్స్ తీసుకున్నాడని అందరికీ తెలుసు ఇది నిజమా? కాకపోతే–

1) థయర్స్, జూల్స్ ఫేవ్రే, ఎర్నెస్ట్ పికార్డ్, పోమెర్ క్వార్టియర్, జూల్స్ సైమన్‌లు, వందలాది మిలియన్ల ధనం స్వాహా చేయటానికి వీలుగా వ్యాపార నిర్వహణ జరిగిందా?

2) పారిస్ పూర్తిగా 'లొంగిపోయే వరకు, రుణం ఏ మాత్రం చెల్లించ నక్కరలేదు అని హామీ ఇచ్చారా?

ఏది ఏమైనా ఈ మొత్తం వ్యవహారంలో ఏదో పెద్ద లాలూచీ కుట్ర జరిగింది. ఏమంటే, థయర్స్, జూల్స్ ఫేవ్రేలు, బోర్డు శాసనసభలో మెజారిటీ ఉన్నదనే పేరుతో ఎట్టి సిగ్గు లేకుండా పారిస్‌ను వెంటనే ఆక్రమించు కోవలసిందిగా ప్రష్యన్ సేనలను

అర్థించారు. అయితే బిస్మార్కు ఇందుకు అంగీకరించలేదు. జర్మనీకి తిరిగి వెళ్ళిన తర్వాత తనను అభినందించిన ఫ్రాంక్‌ఫర్టు నగర వ్యాపారులతో మాట్లాడుతూ ఈ విషయంలో చాలా హేళనగా మాట్లాడాడు.

## II

విప్లవ ప్రతీఘాత కుట్ర విజయవంతం కాకుండా నిలిచిన పెద్ద ఆటంకం సాయుధమైన పారిస్, కనుక పారిస్ ముందు నిరాయుధం చేయాలి. ఈ విషయంలో బోర్డు శాసనసభ పూర్తి 'చిత్తశుద్ధిని' కలిగి ఉంది. రూరల్స్ శాసనసభ్యుల అట్టహాసాలే ఇందుకు నిదర్శనం. అది చాలకపోతే, డిసెంబ్రిస్టు వినోయ్, బోనపార్టిస్టు పోలీసు అధికారి వాలెంటిన్, జెసూట్ సేనాని ఆరెల్లెడి పలాడిన్స్‌లకు చెందిన త్రిమూర్తుల కూటమి దయా ధర్మాలకు థయర్స్ పారిస్‌ను స్వాధీనం చేసినప్పుడైనా, ఈ కపట నాటకం పూర్తిగా వెల్లడయ్యేది. పారిస్ నిరాయుధం కావాలి అనటంలో వారి అసలు ఉద్దేశమేమో వారు అవమానకరమైన రీతిలో బహిరంగంగా ప్రకటిస్తూనే ఉన్నారు. మరొకవైపున అతినగ్నమైన, అబద్ధపు సాకులతో నిరాయుధం కావలసింది అని పారిస్ నగరాన్ని ఆదేశిస్తున్నారు. పారిస్ జాతీయ రక్షక దళం ప్రభుత్వానికి చెందినదని, కనుక ప్రభుత్వానికే అది తిరిగి చెందాలని థయర్స్ అంటున్నాడు. కాని అసలు విషయం ఏమంటే, లొంగుబాటు జరిగిన రోజునుండి, బిస్మార్కు ఖైదీలు ఫ్రాన్సు లొంగుబాటు పత్రంపై సంతకం చేసి, పారిస్‌ను భయపెట్టే నిర్దిష్ట లక్ష్యంతో అసంఖ్యాకమైన స్వంత రక్షక దళాలను ఏర్పరచుకున్న నాటినుండి, పారిస్ తన జాగ్రత్తలో తాను ఉంటూనే ఉన్నది. జాతీయ రక్షక దళం తనను తాను పునర్నిర్మాణం చేసుకుంది. సర్వాధికారాన్ని, యావత్తు దళం ఎన్నుకున్న ఒక కేంద్ర కమిటీకి దఖలు పరిచింది. పాత బోనపార్టిస్టు దళాలలో కొన్ని శాఖలు మాత్రం ఈ ఎన్నికలలో పాల్గొనలేదు. పారిస్‌లోకి ప్రష్యన్లు ప్రవేశించే సమయానికి, కేంద్ర కమిటీ, ఫిరంగి దళాన్ని, మాంట్ మర్త్రి, బెల్లివిల్లి లావిల్లి ప్రాంతాలకు తరిలించింది. ఏ భవనాలను ప్రష్యన్లు ఆక్రమించదలచుకున్నరో వాటిని విద్రోహ బుద్ధితో లొంగుబాటుదార్లు ముందుగానే ఖాళీ చేశారు. ఈ ఫిరంగి దళం, జాతీయ రక్షక దళం విరాళాలతో సమకూర్చుబడ్డది. జనవరి 28 లొంగుబాటు పత్రంలో, గుర్తించబడి, ఫిరంగి దళం, జాతీయ రక్షక దళం స్వంత ఆస్తిగా, లొంగుబాటునుండి మినహాయించ బడ్డది. ప్రభుత్వానికి చెందిన ఆయుధాలు మాత్రమే శత్రువుకు స్వాధీన పరచబడ్డాయి. పారిస్‌కు వ్యతిరేకంగా యుద్ధం ప్రారంభించటానికి ఏ రకమైన స్వల్ప కారణం కూడా థయర్స్‌కు కనబడలేదు. కనుకనే ఫిరంగి దళం జాతీయ రక్షక దళానిది కాదని, ప్రభుత్వ ఆస్తి అని పచ్చి అబద్ధానికి ఒడిగట్టాడు.

పారిస్‌ను మొత్తం నిరాయుధంచేసి తద్వారా సెప్టెంబరు 4 విప్లవాన్ని ధ్వంసం చేయటానికి పారిస్ ఫిరంగి దళాన్ని స్వాధీనం చేసుకోవటం ప్రథమచర్య తప్ప మరొకటి కాదు. అయితే ఈ విప్లవం, ఫ్రాన్సు యొక్క చట్టబద్ధ హక్కులలో ఒకటైంది. రిపబ్లిక్, దాని కృషి, విజేతచే గుర్తించబడి, లొంగుబాటు పత్రంలో నమోదు చేయబడ్డది. లొంగుబాటు తర్వాత విదేశీ రాజ్యాలన్నీ ఈ విషయాన్ని గుర్తించాయి. రిపబ్లిక్ పేరుతోనే, జాతీయ శాసనసభ సమావేశం ఏర్పాటుచేయబడ్డది. బోర్డోలో స్థావరం ఏర్పరచుకున్న జాతీయ శాసనసభకు దాని కార్యవర్గానికి, సెప్టెంబరు 4 పారిస్ శ్రమజీవుల విప్లవమే చట్టబద్ధమైన అర్హత. ఈ అర్హత లేకపోతే జాతీయ శాసనసభ రద్దయి, 1869లో ప్రష్యన్ పాలనలో గాక ఫ్రెంచి పాలనలో సార్వజనీన వోటింగ్ హక్కు ద్వారా ఎన్నికైన శాసనసభకు అధికారం బదిలీ కావాలి. ఈ శాసన సభను విప్లవం బలప్రయోగంతో తోసివేసింది. అప్పుడు థయర్స్ సెలవు టిక్కెట్లు కలిగిన అతని సహచరులు, లూయి బోనపార్టీ సంతకం చేసిన సత్ప్రవర్తన పూచీ కత్తులు పొంది లొంగిపోవాలి. లేదా కేనీకి[25] ప్రవాసం వెళ్లాలి. ప్రష్యాతో సంధి షరతులను ఖరారు చేసే అధికారం కలిగిన జాతీయ శాసనసభ, విప్లవం యొక్క ఒక శాఖ మాత్రమే. ఈ విప్లవం యొక్క సజీవ చిహ్నం పారిస్ నగరమే. ఈ విప్లవాన్ని అదే మొదలు పెట్టింది. అందుకుగాను అయిదు నెలల ముట్టడికి గురిఐంది. దుర్భర క్షామాన్ని అనుభవించింది. ట్రోచూ పన్నాగానికి వ్యతిరేకంగా, దీర్ఘకాల ప్రతిఘటనను కొనసాగించింది. రాష్ట్రాలలో మొండిగా జరిగిన ఆత్మరక్షణ యుద్ధానికి ఇదే ప్రాతిపదిక అయింది. ఇప్పుడు, బోర్డో బానిస యజమానుల అవమానకర ఆదేశాలకు తలఒగ్గి పారిస్ ఆయుధాలను క్రింద పెట్టాలి. సెప్టెంబరు 4న తాను చేసిన విప్లవం, లూయి బోనపార్టీ చేతులలో నుండి అతని రాచరిక ప్రత్యర్థుల చేతులలోకి అధికారం మారటం మాత్రమేనని అంగీకరించాలి. లేదా ఫ్రాన్సు రక్షణకై స్వార్థ త్యాగంతో ధైర్యంగా నిలబడాలి. రాజకీయ, సాంఘిక వ్యవస్థను విప్లవకరంగా కూలదోస్తే తప్ప. ఫ్రాన్సు పునరుజ్జీవనం సాధ్యం కాదు. సర్వ వినాశనాన్నుండి ఫ్రాన్సు రక్షించబడదు. ఈ రాజకీయ సాంఘిక పరిస్థితులే, రెండవ సామ్రాజ్యాన్ని సృష్టించాయి. ఈ సామ్రాజ్యం ఛత్రచ్ఛాయలలోనే పూర్తిగా కుళ్ళి కృశించి పోయాయి. పారిస్ నగరం, అయిదు నెలల కరువు కారణంగా శల్యావశిష్టమైనా, ఒక్క క్షణం కూడా వెనకడుగు వేయలేదు. ఫ్రెంచి కుట్రదారులను ప్రతిఘటించడంలో ఏర్పడే అన్ని ఇబ్బందులను సహసోపేతంగా ఎదుర్కొంటానికే నిశ్చయించింది. పారిస్ కోట బురుజులనుండి, ప్రష్యన్ ఫిరంగులు పారిస్ నగరంపైననే గుండ్ల వర్షం కురిపించాయి. అయినప్పటికీ, కేంద్ర కమిటీకి పారిస్‌ను అంతర్యుద్ధంలోకి నెట్టడం అంటే తీవ్ర విముఖత ఉన్నందున, కేవలం ఆత్మరక్షణ వైఖరినే కొనసాగించింది.

శాసనసభ ఎంతగానో రెచ్చగొట్టే వైఖరిని ప్రదర్శించింది. కార్యవర్గంగా అధికారాన్ని చేజిక్కించుకుంది. పారిస్ లోపల చుట్టూర సైన్యాలు ప్రమాదకరంగా కేంద్రీకరించి ఉండేవి. ఇంత జరిగినా వారు తమ వైఖరిని విడనాడలేదు.

మౌంట్ మార్ట్రి నగరంపైకి, కొన్ని సైనిక దళాలను, లక్షలాది కిరాయి యోధులను వినోయ్ నాయకత్వాన అర్ధరాత్రివేళ పంపటంతో థయర్స్ అంతర్యుద్ధాన్ని ప్రారంభించాడు. 'జాతీయ రక్షకదళం, ఫిరంగి దళాన్ని అకస్మాత్తుగా స్వాధీనపరచుకోవలసిందిగా అజ్ఞాపించాడు'. జాతీయ రక్షక దళం ప్రతిఘటన ప్రజలు వారితో ప్రదర్శించిన సౌహార్థత ఫలితంగా ఈ ప్రయత్నం విఫలమైన సంగతి అందరికీ తెలిసినదే. తన విజయ ప్రకటనను, అరెల్లె డి పలాడిన్స్, ముందుగానే తయారుచేసుకు కూచున్నాడు. కుట్రకు సంబంధించి తానుచేపట్టదలచిన చర్యలను తెలియజేసే అట్టలను థయర్స్ కూడా ముందుగానే సిద్ధంగా ఉంచుకున్నాడు. తీరా ఫలితం అనుకున్న దానికి విరుద్ధమయ్యేసరికి, థయర్స్ విజ్ఞప్తులు చేయసాగాడు. జాతీయ రక్షక దళాలు ఆయుధాలను తన చేతులలో ఉంచుకోవచ్చునని అంగీకరించాడు. ఎంతో ఔదార్యంతో ఈ ప్రకటన చేసినట్లు ప్రవర్తించాడు. జాతీయ రక్షక దళం, ఆయుధాలను తన చేతులలో పెట్టుకుని ప్రభుత్వం తరఫున తిరుగుబాటు దార్లకు వ్యతిరేకంగా పని చేస్తుందనే ఆశాభావం వెలిబుచ్చాడు. 3 లక్షల జాతీయ రక్షక దళాలలో, 300 మంది మాత్రమే ఈ విజ్ఞప్తిని పాటించారు. అల్పుడైన థయర్స్ తరఫున, తమకుతామె వ్యతిరేకంగా నిలబడటానికి సిద్ధమయ్యారు. మార్చి 18న జరిగిన ప్రతిభావంతమైన శ్రమజీవుల విప్లవం పారిస్‌పై ఏకచ్ఛత్రాధిపత్యం స్థాపించింది. కేంద్రకమిటీ దానికి తాత్కాలిక ప్రభుత్వంగా మారింది. ఇటీవల కాలంలో యూరపులో జరిగిన యుద్ధాలు, ప్రభుత్వ వ్యవహారాలు, ఏమైనా వాస్తవాన్ని కలిగి ఉన్నాయా లేక ఏనాడో నశించిన గత కాలానికి చెందిన కలలు మాత్రమేనా అని యూరప్ సంశయించ సాగింది.

మార్చి 18వ తేదీ వర్సెల్స్ దళాలు పారిస్‌లో ప్రవేశించే వరకు, పై వర్గాలు జరిపే విప్లవాలు లేక ప్రతీఘాత విప్లవాలలో సాధారణంగా కోకొల్లలుగా జరిగే హింసాయుత చర్యలేవీ ఈ విప్లవంలో జరగలేదు. లెకొమ్టి, క్లెమెంట్ థామస్ అను సేనానులను వధించటం ప్లేస్‌వెండోంలో జరిగిన ఘటనలు మినహా, విప్లవ వ్యతిరేకులు వేలుపెట్టి చూపగలిగిన ఘటన ఒక్కటీ లేదు.

మాంటిమార్త్రిపై అర్ధరాత్రి వేళ దాడి జరిపిన సేనానులలో ఒకడు లెకొమ్టి సేనాని. ఇతడు పిగల్లిప్లేస్‌లో నిరాయుధులైన ప్రజలపై తుపాకులు కాల్చవలసిందిగా, 81వ దళానికి నాలుగు సార్లు ఉత్తర్వు చేశాడు. సైనికులు ఇందుకు నిరాకరించగా వారిని దారుణంగా అవమానించాడు. స్త్రీలను, పిల్లలను కాల్చటానికి బదులు, అతని

సైనికులు అతన్నే కాల్చివేశారు. కార్మికవర్గ శత్రువుల క్రింద తయారైన సైనికుల అలవాట్లు, వారికి నరనరాన జీర్ణించుకుపోతాయి. పక్షాలు మారిన మరుక్షణాన అలవాట్లు మారవు. కనుకనే ఆ మనుషులే క్లెమెంట్ థామస్‌నుకూడా వధించారు.

"జనరల్" క్లెమెంట్ థామస్ అసంతృప్తితో బాధపడే మాజీ క్వార్టర్ మాస్టర్ జనరల్ లూయీ ఫిలిప్పా పరిపాలన ఆఖరు రోజులలో ఇతడు రిపబ్లికన్ వార్తా పత్రికలే నేషనల్[26] ఆఫీసులో పనిచేయసాగాడు. అక్కడ రెండు బాధ్యతలను, బాధ్యతగల సామాన్య పౌరుడి హోదాను, దూషణ ప్రధానమైన ఆ పత్రిక చేసే బెదిరింపులలో ముందుండే జగడాల మాదిరిగానూ వ్యవహరించ సాగాడు. ఫిబ్రవరి విప్లవం తర్వాత, నేషనల్ పత్రికకు చెందిన వ్యక్తులు అధికారంలోకి వచ్చారు. ఈ పాత క్వార్టర్ మాస్టర్ జనరల్‌ను వారు, జూన్ హత్యాకాండనాటికి జరల్‌గా మార్చివేశారు. ఈ దారుణ హత్యాకాండకు జూల్స్‌ఫెవ్రే లాగానే, ఇతడు కూడా ఒక దుష్టుడైన కుట్రదారు. అతి దారుణమైన హంతకులలో ఒకడైనాడు. పిమ్మట అతడు అతని సేనా నాయకత్వం చాలా కాలం క్రితమే అంతర్థానమై పోయాడు. తిరిగి 1870, నవంబరు 1కి అతడు రంగంమీదికి వచ్చాడు. ఆ మర్నాడే హోటల్ డీ విల్లీలో నిర్బంధించబడిన రక్షక ప్రభుత్వం, బ్లాంక్వి, ఫ్లోరెన్సు, తదితర కార్మిక వర్గ ప్రతినిధులకు పెరోల్ ఇవ్వటానికి. తాము చట్టవిరుద్ధంగా చేజిక్కించుకున్న ప్రభుత్వాన్ని, పారిస్ ప్రజలచే స్వేచ్ఛగా ఎన్నుకోబడిన కమ్యూన్ చేతులలోకి దఖలు పరచడానికి, ప్రమాణ పూర్వకంగా ఆమోదించింది. కాని తమ మాటను నిలబెట్టుకోకపోగా, ఆ ప్రభుత్వ బాధ్యులు ట్రోచూకు చెందిన సైనికులను బోనపార్టీకి చెందిన కార్సికన్ సైనికుల స్థానే, పారిస్ నగరంపైకి వదిలారు. ఇట్టి విశ్వాస ఘాతుకత్వానికి మనసొప్పని, జనరల్ టమిసియర్ మాత్రం, జాతీయ రక్షకదళ నాయకత్వ పదవికి రాజీనామా చేశాడు. అతని స్థానంలో చివరకు క్లెమెంట్ థామస్ సేనా నాయకుడైనాడు. అతని పదవీ కాలమంతటిలోనూ, అతడు ప్రష్యాపైనగాక పారిస్ జాతీయ రక్షక దళంపై యుద్ధం చేస్తూ వచ్చాడు. వారికి ఆయుధా లివ్వడానికి అతడు నిరాకరించాడు. కార్మికవర్గ రక్షక దళాలపై బూర్జువావర్గ రక్షక దళాలను ప్రయోగించాడు. ట్రోచూ "పథకానికి" వ్యతిరేకులైన అధికారులందరినీ తొలగించాడు. తమ బద్ధ శత్రువులకు కూడా ఆశ్చర్యం కలిగించే ధైర్యసాహసాలను ప్రదర్శించిన కార్మికవర్గ రక్షక దళాలను 'పిరికితనం' సాకుతో బర్తరఫ్ చేశాడు. పారిస్ కార్మిక వర్గానికి వ్యక్తిగతమైన శత్రువుగా, తన పూర్వపు స్థానాన్ని సంపాదించుకున్నందుకు క్లెమెంట్ థామస్ చాలా గర్వపడ్డాడు. మార్చి 18కి కొద్ది రోజులకు ముందుగా, యుద్ధమంత్రిఐన లేఫ్లోకు, పారిస్ కార్మిక వాదులలో మెరికలలాంటి వారిని నిర్మూలించటానికి తాను తయారు చేసిన పథకాన్ని, అతడు

సమర్పించాడు. వినోయ్ పలాయనం తర్వాత, ఇతడు అనధికార గూఢచారిగా రంగంమీదికి రాక తప్పలేదు. వేల్స్ యువరాణి లండన్‌లో ప్రవేశించినప్పుడు జనసమర్థంలో జరిగిన ప్రాణ నష్టానికి ఆ యువరాణి ఎలా బాధ్యురాలో అలాగే క్లెమెంట్ థామస్‌లే కామ్టేల మృతికి, పారిస్ కార్మిక ప్రజలు ఒక విధంగా బాధ్యులేనని చెప్పవచ్చు.

ప్లేస్ వెండోంలో నిరాయుధులైన పౌరులపై జరిగిన హత్యాకాండను ఒకే పుకారుగా థయర్స్ రూరల్స్ ఎసెంబ్లీలు పదే పదే తోసి పుచ్చారు. యూరోపియన్ పత్రికా రచయితల గుమాస్తాల భవనం ప్రచారం చేసిన పుకారుగా దానిని నిరసించేవారు. పారిస్ అభివృద్ధి నిరోధకులు సుస్థిరపాలన కోరే పెద్దలు, మార్చి 18 విజయంతో తబ్బిబ్బై పోయినారు. చిట్టచివరకు ప్రజాతీర్పు రానే వస్తుందని వారు భయపడసాగారు. 1848 జూన్, 1871 జనవరి 22వ తేదీల మధ్య వారు హత్యచేసిన పౌరుల ప్రేతాలు, వారి కండ్ల ఎదుట ప్రత్యక్షం కాసాగాయి. వారి గాభరాయే వారికి శిక్ష పోలీసు సార్జెంట్లను నిరాయుధం చేసి, అరెస్టుచేసి ఉండవలసింది. అలాంటిది పారిస్ నగర ద్వారాలను బాహాటంగా తెరచి, వర్సెల్స్ పారిపోవటానికి వారికి అనుమతివ్వబడ్డది. సుస్థిర పాలనా ధోరణికి చెందిన వ్యక్తులకు ఎట్టి అపాయం జరగలేదు. పై పెచ్చు సమావేశాలు జరుపుకొని, పారిస్‌లోని బలమైన కేంద్రాలను ఒకదాని తర్వాత మరొక కేంద్రాన్ని పట్టుకోటానికి వారికి అవకాశం కల్పించబడ్డది. సాయుధ కార్మికవర్గం ప్రదర్శించిన ఈ ఔదార్యం, కేంద్ర కమిటీ ప్రదర్శించిన ఈ నిర్లక్ష్య భావం, వారి అసమర్థతకు చిహ్నంగా తర్వాత వ్యాఖ్యానించబడ్డది. సుస్థిర పాలనావాదుల పద్ధతులకిది పూర్తి వ్యతిరేకం. కనుకనే వారు నిరాయుధుల ప్రదర్శన పేరుతో ఫిరంగి గుండ్లతో వినోయ్ సాధించలేక పోయిన దానిని సాధించదలచి, తమ తెలివితక్కువతనాన్ని ప్రదర్శించుకున్నారు. మార్చి 22న, అట్టహాసాలతో అల్లర చిల్లరి పనులతో ఒక గుంపు, ఉన్నత వర్గాల నివాస భవనాల ప్రాంతం నుండి బయలుదేరింది ఆ గుంపులో అన్ని రకాల సంఘ వ్యతిరేకశక్తులూ ఉన్నాయి. ఊరేగింపు అగ్రభాగాన సామ్రాజ్యంలో అప్రతిష్టపాలైన హీకెరీన్, కోట్లగన్ హెన్రీ డీ పెనె మొదలైన వారున్నారు. శాంతియుత ప్రదర్శన అనే రికితనపు ముసుగు క్రింద, ఈ నానా గోత్రీకులైన గుంపు రహస్యంగా హంతకుల ఆయుధాలను చేజిక్కించుకున్నారు. కవాతుతో నడిచారు. చెల్లాచెదురుగా ఉన్న రక్షక భటులను అవమానపరచి, నిరాయుధం చేశారు. తమ తోవలో కనిపించిన జాతీయ రక్షకదళ సభ్యుల పట్ల అలాగే ప్రవర్తించారు. రూడి లాపైక్స్ నుండి పక్కదోవపట్టి "కేంద్ర కమిటీ నశించాలి : హంతకులు నశించాలి: జాతీయ శాసన సభ శాశ్వతంగా వర్థిల్లాలి" అనే

నినాదాలిచ్చుకుంటూ, పోలీసు లైన్లను ఛేదించుకు పోవటానికి ప్రయత్నించారు. ఆ విధంగా ప్లేస్ వెండోమ్‌లోని జాతీయ పిస్తోలు కాల్చగా, అందుకు సమాధానంగా అవతలి వారు మొదటి హెచ్చరిక తూటాలు కాల్చారు. అవి నిరుపయోగంకాగా జాతీయ రక్షకదళ అధిపతి తుపాకులు కాల్చటానికి ఉత్తర్వు చేశారు. ఒక్క గుండ్ల వర్షంతో ఈ అల్లరి గుంపు చెల్లాచెదరైపోయింది. జోషువా తప్పెటలు మోగించగానే, జెరికో కోట గోడలు కూలిపోయినట్లు, తాము బల ప్రదర్శన చేసిన వెంటనే పారిస్ విప్లవం పతనమౌతుందని వీరు ఆశించారు. జాతీయ రక్షక దళానికి చెందిన ఇద్దరు సైనికులు మరణించారు. తొమ్మిదిమంది తీవ్రంగా గాయపడ్డారు. (వారిలో ఒకరు కేంద్రకమిటీ సభ్యులు). ఆ ప్రాంతమంతా రివాల్వర్లు, కత్తులు, సన్నీలతో నిండిపోయింది. నిరాయుధులైన శాంతియుత ప్రదర్శకులకిది తార్కాణం కాబోలు. దాంతో ఆ గుంపు అంతా చెల్లాచెదురైంది. 1849 జూన్ 13న జాతీయ రక్షకదళం నిజంగానే శాంతియుత ప్రదర్శన జరిపింది. రోమ్ నగరంపై ఫ్రెంచి సైనికుల విద్రోహపూరిత దాడికి నిరసనగా ఇది జరిగింది. అప్పుడు పార్టీ ఆఫ్ అర్డర్ సేనాని చంగార్నియర్ అన్ని వైపుల నుంచి ఈ ప్రదర్శకులపై తన సైనికులను ప్రయోగించాడు. ఈ చర్యను జాతీయ శాసన సభ ముఖ్యంగా థియర్స్ ఎంతో హర్షించి, సమాజ రక్షకుడు అని చంగార్నియర్‌ను ప్రశంసించాడు. ఇలా ప్రయోగింపబడిన సైనికులు నిరాయుధులైన వారిని కత్తులతో నరికి, తుపాకులతో కాల్చివేశారు. గుర్రాల డెక్కల క్రింద తొక్కించారు. పారిస్‌ను ముట్టడికి గురైన నగరంగా ప్రకటించారు. నూతనమైన నిర్బంధ శాసనాలను, హడావిడిగా డూఫారే, శాసనసభచే ఆమోదింపజేశాడు. కొత్తగా అరెస్టుల నిషేధాజ్ఞలతో కొత్త నిరంకుశ పాలన మొదలైంది. కాని ఈ వ్యవహారాలన్నిటినీ క్రిందిస్థాయికి చెందినవారు మరొక విధంగా పరిష్కరించారు. 1871 కేంద్ర కమిటీ, ఈ "ప్రశాంత ప్రదర్శన" వీరులను పూర్తిగా ఉపేక్షచేశారు. ఫలితంగా రెండు రోజుల తర్వాత వీరు తిరిగి సైసట్ సేనాని ఆధ్వర్యాన సమాయత్తమైన ఆయుధాలు ధరించి, సాయుధ ప్రదర్శన జరిపారు. వర్సైల్స్ మీదికి గుంపుగా విరుచుకు పడ్డారు. మాంట్ మార్టిమీద థియర్స్ దొంగచాటుగా దెబ్బతీసి అంతర్యుద్ధాన్ని ప్రారంభించాడు. కాని కేంద్ర కమిటి ఈ అంతర్యుద్ధంలో పాల్గొనటానికి విముఖత ప్రదర్శించింది. ఎట్టి ఆత్మరక్షణ సన్నాహాలు లేక, నిస్సహాయ స్థితిలోఉన్న వర్సైల్స్‌పైకి సైన్యాలను నడిపి, థియర్స్ యొక్క అతని రూరల్స్ యొక్క కుట్రలను మొగ్గలోనే తుంచివేయవలసింది. అలా చేయకపోవటం మహాపరాధం. పై పని చేయపోగా, మార్చి 26న కమ్యూన్‌కు ఎన్నికలు జరిగే తేదీన, పార్టీ ఆఫ్ ఆర్డర్‌ను కూడా ఎన్నికలలో పాల్గొనే అవకాశం కలిగించింది. ఈ విధంగా వీరు, దయాపరులైన' విజేతలను మంచిమాటలతో పారిస్

శివార్లలో ఎదిరించారు. తమ హృదయాలో మాత్రం, సరియైన కాలంలో వీరిపని పడతాం అని సణుగుడు మాత్రం చేసుకున్నారు.

ఈ నాణెం రెండోవైపు ఇప్పుడు చూద్దాం. ఏప్రిల్ మొదట్లో థయర్స్ పారిస్‌కు వ్యతిరేకంగా తనరెండో దాడిని ప్రారంభించాడు. పారిస్ ఖైదీలలో మొదటి దళాన్ని వర్సేల్స్‌కు తెచ్చి, దారుణమైన చిత్రహింసలకు గురిచేశారు. ఆ ఖైదీలను హేళన చేస్తూ తన పాంటుజేబులో చేతులు పెట్టుకుని ఎర్నెస్టు పికార్డ్ ఆ పక్కనే నడిచి పోయాడు. శ్రీమతి థయర్స్, ఫేవ్రేలు, మేడమీద గౌరవనీయులైన స్త్రీల మధ్య నిలబడి వర్సేల్స్ గుంపు చేస్తున్న అల్లరిపట్ల హర్షం వెలిబుచ్చారు. ఖైదీలుగా చిక్కిన సైనికులను దారుణంగా నిలువునా హత్యచేశారు. ధైర్యశాలిఐన మన స్నేహితుడు జనరల్ డువాల్ ఇనపమనిషి ఎట్టి విచారణ లేకుండానే కాల్చివేయబడ్డాడు. గలిఫేట్ అతని భార్య చేతిలో కీలుబొమ్మ ఆమె, రెండవ సామ్రాజ్యంలో జరిగిన తాగుబోతుల తందనాలలో ఎంతో అప్రతిష్టత సంపాదించున్న స్త్రీ అలాంటి గలిఫేట్,జాతీయ రక్షకదళానికి చెందిన చిన్న విభాగాన్ని హత్య చేసినట్లు గంభీరంగా సగర్వంగా ప్రకటించుకున్నాడు. ఈ దళంయొక్క నాయకుడు, ఉపనాయకులు అంతకు ముందే ఛాసుర్స్‌చే మోసగించబడి నిరాయుధం చేయబడినారు. ఫెడరల్స్ శ్రేణికి చెందిన ప్రతి సైనికుడ్ని కాల్చివేయవసిందిగా మూకుమ్మడి ఉత్తరవు చేసినందుకుగాను పారుబోతు వినోయ్‌ని, లీజియన్ ఆఫ్‌ది ఆనర్ గౌరవాధ్యక్షుడుగా, థయర్స్ నియమించాడు. 1870 అక్టోబరు 31న ఏర్పడిన ఆత్మరక్షణ ప్రభుత్వం అధిపతులను శిరచ్ఛేదం జరగకుండా రక్షించినవాడు ఫ్లోరెన్సు ఎంతో ఉదారస్వభావుడూ, ఉన్నతాశయాలూ కలిగిన, ఫ్లారెన్సును ముక్కలు ముక్కలుగా నరికివేసినవాడు పోలీసు అధికారి డిస్మారెట్. ఈతని కిరాతకత్వానికి అతనికి గౌరవం దక్కింది. ఈ చిత్ర వధకు సంబంధించిన "ఆసక్తికరమైన విశేషాలను" జాతీయ శాసనసభలో థయర్స్ ఎంతో విజయోత్సాహంతో వర్ణించాడు. పార్లమెంటులో సామాన్యవ్యక్తిగా ఉన్నవాడు. తామర్లేను పాత్రను నిర్వహించవలసి వచ్చినందున కలిగిన స్వాతిశయంతో థయర్స్ తన అల్పత్వంలో, నాగరిక యుగంలో చూపవలసిన యుద్ధ మర్యాదలను కూడ తిరుగుబాటుదారులపట్ల చూపలేదు. క్షతగాత్రులను చేరవేసే వాహనాలను సైతం యుద్ధ వ్యవహారాలలో తటస్థమైనవిగా గుర్తించలేదు. తనలోని పెద్దపులి లక్షణాలను పూర్తిగా వ్యక్తీకరించుకోడానికి అవకాశం కల్పించబడిన కోతివలె అతడు ప్రవర్తించాడు.వాల్టేరు[27] ఈ విషయాన్ని ముందుగానే ఊహించాడు.(అనుబంధం చూడుము)

ప్రతీకార చర్యలు తీసుకోవలసిందిగా కమ్యూన్ ఏప్రిల్ 7న ఉత్తర్వు చేసింది. "వర్సెల్స్ నరభక్షకుల దాడినుండి పారిస్‌ను రక్షించటం, కంటికి కన్ను పంటికి పన్ను"

విధానం అనుసరించటం ప్రతి ఒక్కరి విధి అని ప్రకటించింది. అప్పటికే, థియర్స్ ఖైదీలపట్ల అమానుషంగా ప్రవర్తించటం మానుకోలేదు. పైపెచ్చు తన ప్రకటనలలో ఖైదీలను ఈ క్రింది విధంగా దూషించాడు:

"పతనమైన ప్రజాస్వామ్యానికి చెందిన ఇంతగా అప్రతిష్టాకర వ్యక్తులు ఇంతవరకు ఎవరూ నిజాయితీగల వ్యక్తుల దృష్టి పథంలోకి రాలేదు." థియర్స్ వలెనూ, అతని మంత్రులైన సెలవు చీటీల మనుషుల వలెనూ, నిజాయితీ కలవారు అని అర్థం ఐనప్పటికి కొంతకాలంపాటు, ఖైదీలను కాల్చివేయటం నిలుపుచేయబడ్డది. ఐతే, ప్రతీకార చర్యలు తీసుకోండి అని కమ్యూన్ జారీచేసిన ఉత్తర్వు ఒట్టి బూకరింపు మాత్రమేనని త్వరలోనే థియర్స్, అతని డిసెంబ్రిస్టు సేనానులు గ్రహించారు. పారిస్‌లో, జాతీయ రక్షకదళం ముసుగులో ఉన్నవారి పోలీసు గూఢచారులను సైతం కమ్యూన్ నాయకులు ఏమీ చేయటం లేదని తెలిసిపోయింది. తుపాకి మందుగుండుతోసహా పట్టుబడిన కిరాయి సైనికులు సైతం వదలివేయబడ్డారు. దాంతో ఖైదీలను మూకుమ్మడిగా కాల్చివేయటం తిరిగి ప్రారంభమైంది. చివరిదాకా నిరంతరాయంగా కొనసాగింది. జాతీయ రక్షక దళాలు ఆశ్రయంగా చేసుకున్న ఇండ్లను పోలీసులు చుట్టముట్టారు. ఆ యిండ్లపై పెట్రోలియం కుమ్మరించి, అగ్గిపుల్ల అంటించారు. (యుద్ధాలలో మొట్టమొదటిసారిగా పెట్రోలియం ప్రసక్తి ఇక్కడే వినవస్తుంది) కాలిపోయిన శవాలను పత్రికలకు చెందిన అంబులెన్సు వాహనాలు ఆ తర్వాత టెర్నిస్‌కు తీసుకు వచ్చాయి. ఏప్రిల్ 25న జాతీయ రక్షక దళానికి చెందిన నలుగురు సైనికులు, బెల్ ఎపైన్‌లో సాయుధ ఆశ్వికభటులకు లొంగిపోయారు. ఆ నలుగురిని ఒకరి తర్వాత ఒకరిని, గలిఫెట్‌కి అనుచరుడైన ఒక 'గౌరవనీయ' సేనాధిపతి కాల్చివేశాడు. ఆ నలుగురిలో ఒకడైన షెఫర్ చనిపోయాడనుకుని వదలివేసినాడు, ప్రాణం పోసుకుని మెల్లిగా పాకి పారిస్ శివార్లకు చేరుకున్నాడు. కమ్యూన్‌కు చెందిన కమీషన్ ముందు జరిగిన విషయమంతా వివరించాడు. ఈ కమిషన్ నివేదిక ఆధారంగా, టోలెన్ యుద్ధమంత్రిని సమాచారం అడగ్గా, రూరల్స్‌కు చెందిన శాసన సభ్యులు ఒక్కుమ్మడి అల్లరి చేసి, సమాధానం యివ్వకుండా లే ఫ్లోను ఆటంకపరిచారు. తమ సైన్యం చేసిన 'సాహసోపేత' చర్యలను ప్రశ్నించటం, వారిని అవమానించటమే అన్నారు. మౌలిన్ సాక్వెట్‌లో నిద్రా ముద్రితులైన ఫెడరల్స్‌ను, తుపాకీ సన్నీలతో పొడిచి చంపటం, క్లామర్టులు తుపాకీ గుండ్ల వర్షాన్ని ఒక్కుమ్మడి కురిపించటం ఏదో సాధారణ విషయమైనట్లు థియర్స్ తన పత్రికా ప్రకటనలలో వెల్లడించాడు. ఈ ప్రకటనలు, సాధారణంగా ఎలాంటి ఘటనలకు చలించని లండన్ టైమ్సు పత్రికను కూడా కదలించాయి. ఏమైనా, పారిస్‌పై దాడి చేసిన వారు, విదేశీ దురాక్రమణదారుల

సాయంతో బానిస యజమానుల తిరుగుబాటును చెరేచ్చగొట్టినవారు ప్రాథమికంగా జరిపిన దౌర్జన్యాలను గురించి ఇప్పుడు పునశ్చరణ చేయ యత్నించటం హాస్యాస్పదంగా ఉంటుంది. ఈ ఘాతుకాలిలా జరిగిపోతూ ఉంటే, తన మరుగుజ్జు భుజస్కంధాలపై విరుచుకుబడిన అపార బాధ్యతలను గురించి పార్లమెంటులో చేసిన ప్రలాపాలన్నిటినీ, మరిచిపోయి, శాసనసభ శాంతియుత వాతావరణంలో సమావేశ మౌతున్నదంటూ ప్రకటనలు చేస్తూనే ఉన్నాడు. డిసెంబ్రిస్టు సేనానులతోను, జర్మన్ రాజకుమారులతోను నిరంతరం విందులు కుడుస్తూనే ఉన్నాడు లేమ్బికా. క్లెమెంట్ థామస్‌ల ప్రేతాత్మల సైతం అతని జీర్ణశక్తిపై ఎట్టి చెడ్డ ప్రభావాన్ని కలిగించలేదని నిరూపించుకుంటూ ఉన్నాడు.

## III

మార్చి 18వ తేదీ తెల్లవారే సరికి పారిస్ నగరం అంతటా "కమ్యూన్ వర్ధిల్లాలి" అనే నినాదాలతో దద్దరిల్లిపోయింది. బూర్జువా వర్గానికంతా రాక్షసిలాగా కనపడే కమ్యూన్ అంటే ఏమిటి?

మార్చి 18న విడుదల చేసిన ప్రణాళికలో కేంద్రకమిటీ ఇలా చెప్పింది: "పాలక వర్గం వైఫల్యాలు, విద్రోహాలు దృష్ట్యా, పౌర వ్యవహారం నిర్వహణ బాధ్యతను ఇంక తమ చేతులలోకి తీసుకోవలసిన తరుణం వచ్చిందని పారిస్ కార్మిక వర్గం గ్రహించింది. ప్రభుత్వాధికారాన్ని చేజిక్కించుకుని, తమ భవిష్యత్తుకు తామే అధినాధులు కావటం. తమ నిర్ద్వంద్వమైన హక్కు అని, పవిత్ర బాధ్యత అనీ గ్రహించింది." కాగా కార్మికవర్గం, అప్పటికి ఏర్పడి ఉన్న రాజ్యాంగ యంత్రాంగాన్ని యధాతథంగా వాడుకోజాలదు, తన ప్రయోజనాలకు వినియోగించుకోజాలదు.

కేంద్రీకృత రాజ్యాంగాధికారానికి, స్థిరసైన్యం, పోలీసు, బ్యురాక్రటిక్ యంత్రాంగం, మత గురువులు, న్యాయస్థానాలు, ఇవన్నీ, సర్వవ్యాపిత సాధనాలు క్రమబద్ధమైన, అనువంశికమైన పని విభజన పథకంపై ఆధారపడి ఉన్నది. నిరంకుశ రాచరికత్వ కాలం నుండి ఇవి వస్తున్నాయి. భూస్వామ్య వ్యవస్థపై అప్పుడే తల ఎత్తుతున్న మధ్య తరగతికి పోరాట సాధనాలుగా ఉపయోగపడ్డాయి. ఐనప్పటికీ, వాటి అభివృద్ధిలో అన్ని రకాల మధ్యయుగాల చెత్తతోను, పన్ను వసూళ్ళ వాటా హక్కులతోను, స్థానిక సౌకర్యాలతోను, మునిసిపల్ గిల్డు గుత్తాధికారంతోను, రాష్ట్రీయ చట్టాలతోను, బందీకృతమై ఉన్నవి. గతకాలపు ఈ అవశేషాలన్నిటినీ, 18వ శతాబ్దపు ఫ్రెంచి మహా విప్లవమనే, బ్రహ్మాండమైన చీపురు కట్ట, చెత్తకుండీలోకి తోసి వేసింది. ఆ విధంగా మొదటి సామ్రాజ్యంలో ఆవిర్భవించిన ఆధునిక రాజ్యాంగం అనే ఉపరితలం అభివృద్ధి కావడానికి ఆటంకంగా ఉన్న అన్నిటినీ సామాజిక భూతలం

ఒకేసారి తొలగించింది. ఈ ఆధునిక రాజ్యాంగం సైతం, ఆధునిక ఫ్రాన్సుపైన అర్థ ఫ్యూడల్ యూరపు సాగించిన ఉమ్మడి యుద్ధాల ఫలితంగా ఆవిర్భవించినదే. ఆ తర్వాత పాలనాకాలాల్లో పార్లమెంటరీ పెత్తనంలో ఉన్న ప్రభుత్వం అనగా ఆస్తిపర వర్గాల ప్రత్యక్ష పాలన అపారమైన జాతీయ రుణాలకు, ప్రజలను అణచివేసే పన్నుల భారానికి నిలయమైంది. పదవులకు, అన్యాయార్జిత ధనానికి, ఆశ్రిత పక్షపాతానికి నిరోధించ వీలులేని ఆకర్షణా కేంద్రమైంది. పాలక వర్గాలలోని దురాశాపరుల ముఠాలకు ఘర్షణా కేంద్రం కావటమే కాక సమాజంలో వచ్చిన ఆర్థిక పరిణామాల ఫలితంగా, దాని రాజకీయ స్వభావం కూడా మారిపోయింది. ఆధునిక పరిశ్రమల పురోగతి క్రమం పెట్టుబడిదారులకు, కార్మికులకు మధ్యగల వర్గ శత్రుత్వాన్ని పెంచి, విస్తృతం చేసి, తీవ్రతరం చేస్తున్నది. సరిగ్గా అదే మేరకు. రాజ్యాంగ అధికారం, అధికాధికంగా కార్మికులపై, పెట్టుబడిదారుల జాతీయ అధికార కేంద్రంగా రూపొందింది. సామాజిక బానిసత్వానికై సంఘటితమైన ప్రభుత్వ శక్తిగా, వర్గ నియంతృత్వ సాధనగా రూపొందింది.* వర్గ పోరాటంలో అభ్యుదయకర దశను సూచించే ప్రతి విప్లవం తర్వాత రాజ్యాంగ యంత్రం యొక్క కల్తీలేని నిర్బంధ స్వభావం, అధికాధికంగా స్పష్టమైన రూపంలో వ్యక్తమౌతూ ఉంటుంది. 1830 విప్లవం, తర్వాత ప్రభుత్వాధికారం, భూస్వాముల చేతులలో నుండి పెట్టుబడిదారుల చేతులలోకి మారింది. అంత వరకూ శ్రామిక జనులకు దూర శత్రువుగా ఉన్న రాజ్యాంగ యంత్రం దీంతో సన్నిహిత శత్రువైంది. ఫిబ్రవరి విప్లవం పేరుతో రాజ్యాంగ, అధికారాన్ని చేజిక్కించుకున్న బూర్జువా రిపబ్లికన్లు, తమ రాజ్యాధికారాన్ని, జూన్ హత్యాకాండకు వినియోగించుకున్నారు. 'సామాజిక' రిపబ్లిక్ అంటే కార్మికుల సామాజిక బానిసత్వాన్ని దృఢతరం చేసే రిపబ్లిక్ అని కార్మికులకు స్పష్టంచేసేందుకు, ప్రభుత్వ బాధ్యతలు, ఆదాయాలు, క్షేమంగా బూర్జువా రిపబ్లికన్‌లకు దఖలు పరచవచ్చునని, బూర్జువా వర్గంలోని అధిక సంఖ్యాకులైన రాయలిస్టులకు, భూస్వామ్య వర్గానికి నచ్చచెప్పేందుకు వినియోగించుకున్నారు. ఐనప్పటికి జూన్‌లో జరిగిన వీరోచిత దాడి తర్వాత, బూర్జువా రిపబ్లికన్లు అగ్రశ్రేణి నుండి, "పార్టీ ఆఫ్ ఆర్డరు" యొక్క వెనుకవైపుకు నెట్టివేయ బడ్డారు. ఉత్పత్తి చేసే వర్గాల పట్ల బాహాటంగా శత్రుత్వాన్ని వ్యక్తంచేసే నూతన పోకడకు చిహ్నంగా దోపిడీ వర్గాలకు చెందిన అన్ని పార్టీలు, ముఠాలు కలిసి

* 1871లో ఎంగెల్సుస చేసిన జర్మన్ తర్జుమాలో ఈ వాక్యంలోని చివరి భాగం కొద్దిగా క్లుప్తీకృతమై ఇలా ఉంది: "కార్మికుల దోపిడీకి ఉపయోగపడే ప్రభుత్వ శక్తిగా, వర్గ నియంతృత్వాని కుపయోగపడే యంత్ర స్వభావాన్ని" (అధికాధికంగా రూపొందించుకున్నది.)

ఏర్పరచినది. "పార్టీ ఆఫ్ ఆర్డర్" ఈ జాయింట్ స్టార్ గవర్నమెంటుకు సరియైన రూపం లూయీ బోనపార్టీ అధ్యక్షుడిగా ఉండే పార్లమెంటరీ రిపబ్లిక్. థయర్స్ ప్రభుత్వం, 'నీచమైన గుంపు' పట్ల బాహాటంగానూ, ఉద్దేశపూర్వకంగాను అవమానాలు గుప్పించే వర్గ నియంతృత్వానికి చిహ్నం. థయర్స్ చెప్పినట్లు, పార్లమెంటరీ రిపబ్లికు పాలక వర్గంలోని వివిధ ముఠాలను అతితక్కువగా చీల్చిన మాట నిజమే. కాగా వర్గానికి, వారి శ్రేణులకు వెలుపల ఉన్న మొత్తం సమాజానికి మధ్య తీవ్ర అఖాతాన్ని సృష్టించింది. వెనుకటి ప్రభుత్వాలలో తమ వివిధ ముఠాల మధ్య గల వైరుధ్యాలు, రాజ్యాంగ యంత్రంపై విధించిన కొద్దిపాటి అదుపు, ఈ కొత్త ఐక్యతతో తొలగిపోయింది. కార్మిక వర్గ తిరుగుబాటు ప్రమాదకరంగా పరిణమించటంతో, వారు ఇప్పుడు రాజ్యాంగాధికారాన్ని, కార్మికులపై పెట్టుబడిదారుల జాతీయ యుద్ధ సాధనగా ఎట్టి దాక్షిణ్యం లేకండా, అట్టహాసంతో ప్రయోగించ సాగారు. ఐతే, ఉత్పత్తి చేసే వర్గాలపై వారు నిరంతరాయంగా జరిపే దాడిలో, వారు తప్పనిసరిగా, కార్యనిర్వాహక విభాగానికి అపారమైన అధికారాలు కట్టబెట్టారు. ఆ మేరకు, తమ స్వంత పార్లమెంటరీ అధికారానికి కేంద్రమైన జాతీయ శాసనసభ అధికారాలను ఒక్కొక్కటే వదలించి వేశారు. కార్యనిర్వాహక వర్గ పెత్తనానికి రక్షణగా ఉన్న అధికారాలన్నిటినీ వదులుకున్నారు. లూయీ బోనపార్టీ వ్యక్తి రూపంలో కార్యనిర్వాహక వర్గం వారిని బైటికి గెంటివేసింది. "పార్టీ ఆఫ్ ఆర్డర్" రిపబ్లిక్ యొక్క సహజ సిద్ధమైన శిశువు రెండవ సామ్రాజ్యం.

అంతఃపుర కుట్ర, జనన నిదర్శన పత్రికగా ఉద్భవించిన రెండవ సామ్రాజ్యానికి, సార్వజనీన వోటింగు హక్కు ఆమోద ముద్ర, ఆయుధమే, మంత్రదండం. ఈ సామ్రాజ్యం పెట్టుబడిదారులకు, కార్మికులకు జరిగే పోరాటంలో ప్రత్యక్షంగా భాగస్వాములు గాని అసంఖ్యాక ఉత్పత్తిదారులైన రైతాంగంపై ఆధారపడినట్లు ప్రకటించుకున్నది. పార్లమెంటరీ వ్యవస్థను, తద్వారా, ఆస్తిపర వర్గాలకు ఎట్టి ఆచ్ఛాదన లేకుండా లొంగి ఉండే ప్రభుత్వాన్ని, బద్దలు చేయటం ద్వారా కార్మిక వర్గాన్ని రక్షించ నున్నట్లు ప్రకటించుకున్నది. కార్మిక వర్గంపై, ఆస్తిపర వర్గాల ఆర్థిక ఆధిపత్యాన్ని. రక్షించటం ద్వారా ధనిక వర్గాలను రక్షించనున్నట్లు ప్రకటించుకున్నది. ఆఖరుకు జాతీయ ప్రతిష్ట అనే భ్రమలో సర్వ ప్రజలను ముంచెత్తటం ద్వారా అన్ని వర్గాలను ఐక్యం చేయనున్నట్లు ప్రకటించుకున్నది. నిజానికి, జాతిని పరిపాలించే శక్తిని బూర్జువావర్గం అప్పటికే పోగొట్టుకొని, కార్మిక వర్గం ఇంకా ఆ శక్తిని పొందని ఆ దశలో, సాధ్యమైన ప్రభుత్వ రూపం అదొక్కటే. సమాజాన్ని రక్షించిన శక్తిగా యావత్తు ప్రపంచం దానిని కీర్తించింది. దాని పరిపాలనలో బూర్జువా సమాజం అన్ని రకాల రాజకీయ ఆందోళనలను వదిలివేసి, తాను సైతం ఊహించని అభివృద్ధిని సాధించింది.

దాని పరిశ్రమ, వ్యాపార రంగాలు అపారమైన రీతిలో విస్తరించాయి. ఆర్థికపరమైన మోసకృత్యాలు, అంతర్జాతీయ విలాస నృత్యాలలో తేలియాడాయి. ఒక వైపున ప్రజలు దరిద్రంలో కుమిలి పోతుంటే, గౌరవ మర్యాద లన్నిటినీ కోల్పోయిన భోగ లాలసత, తన జుగుప్సాకరమైన ఆకర్షణను, అట్టహాసాన్ని సిగ్గు లేకుండా ప్రదర్శించుకున్నది. రాజ్యాంగ యంత్రం, సమాజానికంటె ఉన్నతంగా పైన ఎక్కడో ఉన్నట్లు నటిస్తుంది. నిజానికి సమాజంలోని కుళ్ళు అంతటికీ అదే కేంద్రం. అత్యంత హేయమైన అవినీతి పుట్ట. దాని కుళ్ళు, అది కాపాడిన సమాజం యొక్క కుళ్ళు, ప్రష్యా తుపాకులు బహిర్గతం చేశాయి. ఈ పాలనా యంత్ర కేంద్రాన్ని పారిస్ నుండి బెర్లిన్‌కు మార్చాలని ఈ ప్రభుత్వమే తీవ్రంగా ప్రయత్నించింది. అదే సమయంలో, సామ్రాజ్యవాదం, రాజ్యాంగ యంత్రం యొక్క అత్యంత వ్యభిచార రూపకమైన, అంతిమ రూపం. అపుడపుడే తల ఎత్తుఉన్న మధ్యతరగతి సమాజం. భూస్వామ్య వ్యవస్థ నుండి తాను విముక్తి చెందటానికి ఒక సాధనగా సామ్రాజ్యవాదాన్ని భావించ సాగింది. కాగా పూర్తిగా పెరిగిన బూర్జువా సమాజం. అంతిమంగా ఈ వ్యవస్థను, కార్మిక వర్గాన్ని, బానిసత్వంలో ఉంచేందుకు పెట్టుబడిదారీ వర్గం చేతిలోని సాధనగా మార్చి వేసింది.

సామ్రాజ్యానికి పూర్తిగా విరుద్ధమైనది కమ్యూన్. పారిస్ కార్మికవర్గం 'సోషల్ రిపబ్లిక్' పేరుతో ఫిబ్రవరి విప్లవం నిర్వహించింది. రాచరిక రూపంలోని వర్గ పాలనను మాత్రమే కాక, మొత్తం వర్గ పాలననే రద్దు చేసే రిపబ్లిక్ ఏర్పడాలనే అస్పష్టమైన ఆకాంక్షను పై మాట వ్యక్తం చేస్తున్నది. రిపబ్లిక్ యొక్క రూఢి రూపం కమ్యూన్.

వెనకటి ప్రభుత్వాధికారానికి, అదే సమయంలో ఫ్రెంచి కార్మిక వర్గానికి బలమైన స్థావరం పారిస్. సామ్రాజ్యం సంక్రమింప చేసిన వెనుకటి ప్రభుత్వాధికారాన్ని కొనసాగింప యత్నించిన థయర్స్, రూరల్స్ యొక్క ప్రయత్నాలకు వ్యతిరేకంగా కార్మిక వర్గం ఆయుధాలతో తిరుగుబాటు చేసింది. పారిస్‌పై జరిగిన ముట్టడి ఫలితంగా సైన్యం అంతరించి, ఆ స్థానంలో జాతీయ రక్షక దళం ఏర్పడ్డది. ఇందులో కార్మిక శ్రమజీవులు ఎక్కువ. కనుకనే కార్మిక వర్గం తిరుగుబాటు చేయగలిగింది. ఈ వాస్తవాన్ని ఇప్పుడొక వ్యవస్థగా మార్చటానికి యత్నాలు జరిగాయి. కనుక కమ్యూన్ చేసిన మొదటి డిక్రీలోనే, స్థిర సైన్యాన్ని రద్దుచేసి ఆ స్థానంలో ప్రజలను సాయుధులను చేసింది.

పట్టణంలోని వివిధ వార్డులలో సార్వజనీన వోటింగ్ ప్రాతిపదికపై ఎన్నికైన మునిసిపల్ కౌన్సిలర్స్‌తో కమ్యూన్ ఏర్పడ్డది. స్వల్ప కాలం మాత్రమే వీరు పదవీ బాధ్యతలు నిర్వహిస్తారు. కమ్యూన్ సభ్యులలో అధిక సంఖ్యాకులు సహజంగానే కార్మికుల లేక కార్మిక వర్గం యొక్క గుర్తింపు పొందిన ప్రతినిధులు. కమ్యూన్

పార్లమెంటరీ సంస్థ కాదు, క్రియాశీల సంస్థ శాసన విధులు, కార్యనిర్వాహక విధులు రెంటినీ కలిగి ఉంది. కేంద్ర ప్రభుత్వ ఏజంటుగా అంతవరకూ పని చేస్తున్న పోలీసు శాఖకు రాజకీయ హక్కులన్నీ రద్దు చేయబడ్డాయి. సర్వ కాలాలకు అది కమ్యూన్‌కే బాధ్యురాలు; దానిని రద్దు చేసే హక్కు కూడా కమ్యూన్ కున్నది. పరిపాలనా విభాగానికి చెందిన అన్ని శాఖల ఉద్యోగుల పరిస్థితి కూడా అంతే. కమ్యూన్ సభ్యుల స్థాయి నుండి క్రింది వరకు ప్రభుత్వోద్యోగులందరూ కార్మికులతో సమానమైన వేతనాల మీదనే పని చేయాలి. ఉన్నతాధికార పదవులతో పాటు, ఆ అధికారులకు లభించే ప్రత్యేక అలవెన్సులు, స్వార్థ ప్రయోజనాలు అన్నీ రద్దయినాయి. కేంద్ర ప్రభుత్వ కీలు బొమ్మల స్వంత ఆస్తులుగా ఉన్న పౌర బాధ్యతలన్నీ రద్దయినాయి. మునిసిపల్ పరిపాలన మాత్రమే కాదు, ఇంతవరకు ప్రభుత్వ యంత్రాంగం నిర్వర్తిస్తున్న చొరవ యావత్తూ, కమ్యూన్ చేతులకు దఖలు పడ్డాయి.

పాత ప్రభుత్వం యొక్క దోపిడీకి ప్రత్యక్ష సాధనాలయిన స్థిర సైన్యాన్ని పోలీసును ఈ విధంగా వదలించుకున్న తర్వాత దోపిడీయొక్క నైతికరూపమైన 'మతాధిపతుల అధికారాన్ని' రద్దు చేయటానికి కమ్యూన్ సంకల్పించింది. ప్రైవేట్ వ్యక్తుల స్వంత సంస్థలుగా ఉన్న చర్చిల హక్కులను, ఆస్తులను, రద్దు చేసింది. మతాధిపతులందరినీ వారి వ్యక్తిగత జీవిత రంగాలకు పంపివేసింది. వారి పూర్వీకులైన మత ప్రవక్తలవలె, విశ్వాసపరులు ఐచ్ఛికంగా చదివించే భిక్షలపై జీవించవలసిందిగా ఆదేశించింది. విద్యాసంస్థ లన్నిటిలోకి ప్రజలందరికీ ఉచిత ప్రవేశం కల్పించబడ్డది. అదే సమయంలో విద్యా సంస్థలలో ప్రభుత్వం యొక్క, చర్చి యొక్క జోక్యం నివారించబడ్డది. ఆ విధంగా విద్య యావన్మందికి అందుబాటులోకి రావడమేగాక, శాస్త్రవిజ్ఞానంపై ప్రభుత్వాధికారం, వర్గ పక్షపాతము విధించిన సంకెళ్ళు కూడా రద్దు చేయబడ్డాయి.

న్యాయశాఖాధికారులందరూ అంతకాలం ధరిస్తున్న బూటకపు స్వాతంత్ర్య ముసుగు తొలగించబడ్డది. ఈ ముసుగు క్రిందవారు అధికారంలోకి వచ్చే ప్రతి ప్రభుత్వానికి లొంగి పడివుండటం మినహా మరేదీ చేయటంలేదు. ఈ ప్రభుత్వాల పట్ల విశ్వాసపాత్రంగా వుంటామని ప్రమాణాలు చేస్తూ, వాటిని భగ్నంచేస్తూ వుండే వారు మిగతా ప్రభుత్వోద్యోగులందరి వలెనే మేజిస్ట్రేట్లు, న్యాయమూర్తులు ఎన్నుకోబడాలి. ప్రజలకు బాధ్యత వహించాలి. ప్రజలు వీరిని వెనక్కు రప్పించే హక్కు కలిగి వుంటారు.

పారిస్‌లోని అన్ని గొప్ప పారిశ్రామిక కేంద్రాలకు సహజంగానే పారిస్ కమ్యూన్ నమూనాగా వుంటుంది. పారిస్‌లోనూ, రెండో తరహా కేంద్రాలలోనూ కమ్యూన్ తరహా పరిపాలన ఏర్పడిన మీదట, రాష్ట్రాలలో పాత పద్ధతికి చెందిన కేంద్రీకృత

ప్రభుత్వపాలన అంతరించి, ఉత్పత్తిదారుల స్వయంపరిపాలన ఏర్పడ సాగింది. జాతీయనమూనా పరిపాలనా పద్ధతి నొకదానిని స్థూలంగా రూపొందించింది. దీనిని పూర్తిగా అభివృద్ధి చేసే అవకాశం కమ్యూన్‌కు లభించలేదు. ఈ నమూనా ప్రకారం, దేశంలోని అతి చిన్న కుగ్రామం యొక్క పరిపాలనా రూపం కూడా కమ్యూన్ మాదిరిగానే వుండాలని గ్రామీణ జిల్లాలలో స్థిర సైన్యం రద్దయి ఆ స్థాయిలో జాతీయ రక్షక దళం ఏర్పడాలి. దీని జీవితకాలం అతి స్వల్పంగా వుండాలి. ప్రతి జిల్లాలోని గ్రామీణ కమ్యూన్‌లు, తమ ఉమ్మడి వ్యవహారాలను, కేంద్ర పట్టణంలో జరిగే ప్రతినిధుల సభ ద్వారా నిర్వహించుకోవాలి. ఈ జిల్లా సభలు, తిరిగి, పారిస్‌లోని జాతీయసభకు ప్రతినిధులను పంపాలి. ప్రతినిధిని ఏ క్షణంలో నయినా వెనుకకు పిలిపించే హక్కు ప్రజలకున్నది. తన నియోజకవర్గంలోని సభ్యుల లాంఛన ప్రాయమైన ఆదేశాలకు వారు కట్టుబడి వుండాలి. కేంద్ర ప్రభుత్వానికి అప్పటికి కొన్ని ముఖ్యమైన బాధ్యతలు మిగిలే వుంటాయి. కొందరు కావాలని దుష్ప్రచారం చేసినట్లు కేంద్రప్రభుత్వాన్ని అణచివేయలేదు. ఈ బాధ్యతలను కమ్యూన్‌కు సంబంధించిన అనగా బాధ్యతగల అధికారులు నిర్వహించాలి. జాతి సమైక్యతను విచ్ఛిన్నం చేయరాదు. పైపెచ్చు కమ్యూన్ రాజ్యంగ చట్టప్రకారం అది సంఘటితం కావాలి. రాజ్యాంగ యంత్ర అధికారాన్ని ధ్వంసంచేయటం ద్వారా, అది మరింత వాస్తవ రూపం ధరించాలి. ఈ రాజ్యాంగ యంత్రం జాతికంటె అతీతంగా, స్వతంత్రంగా ఐక్యతకు తానే ప్రతీకఐనట్లు రాజ్యాంగ యంత్రం చెప్పుకుంటున్నది. వాస్తవానికి రాజ్యాంగ యంత్రం. పరాన్నభుక్కు స్వభావం కలిగిన ఒక విపరీతసృష్టి మాత్రమే పాతప్రభుత్వం యొక్క కేవలనిర్బంధ విధాన సాధనాలను శస్త్రచికిత్స చేస్తూనే, ప్రభుత్వం చట్టరీత్యా నిర్వహించవలసిన బాధ్యతలను, సమాజానికంటె అతీతంగా, ఉన్నతంగా వ్యవహరించే సంస్థ చేతులలోనుండి తొలగించి సమాజం యొక్క బాధ్యతాయుత ప్రతినిధులకు అప్పగించబడ్డాయి. పాలకవర్గానికి చెందిన సభ్యుడు. ప్రజలకు తప్పుడు ప్రాతినిధ్యం వహించాలి అనే సమస్యను మూడేండ్లకో ఆరేండ్లకో ఒకసారి నిర్ణయించే దానికంటె కమ్యూన్‌లలో సంఘటితమైన ప్రజలు సార్వజనీన ఓటింగ్ హక్కును వినియోగించుకుంటారు. తన పరిశ్రమలో పనివారిని, మేనేజర్‌లను ఎన్నుకోవటానికి, యజమాని తన వ్యక్తిగత ఓటు హక్కును వినియోగించుకున్న విధంగానే ఇది జరుగుతుంది. వ్యక్తులకు లాగానే కంపెనీలకు కూడా, వ్యాపార విషయాలలో సరియైన మనిషిని సరైన స్థానంలో ఎలా వుంచాలనో తెలుసు. ఒకసారి తప్పుచేస్తే దానిని వెంటనే ఎలా సవరించుకోవలెనో కూడా తెలుసు. కాగా సార్వజనీన ఓటింగ్ హక్కును రద్దుచేసి, దాని స్థానంలో ఆనువంశిక అధికార సంస్థను ఏర్పరచటం, కమ్యూన్ లక్ష్యాలకే పూర్తిగా విరుద్ధమైన విషయం.

పూర్తిగా నూతన చారిత్రక పరిస్థితులలో సృష్టిచెందే రూపాలు, పాత సామాజిక జీవితంలోని కాలగర్భంలో కలసిపోయిన కొన్ని రూపాలతో సమానమైనవిగా పొరపడే అవకాశం తరచు ఏర్పడుతుంది. వాటితో ఇది కొంత సామ్యం కలిగివుండవచ్చు. ఆధునిక రాజ్యాంగ యంత్రాన్ని ధ్వంసం చేసిన కమ్యూన్, అదే విధంగా మధ్య యుగాల కమ్యూన్‌కు పునస్సృష్టిగా కొందరు పొరబడుతున్నారు. మధ్య యుగాల కమ్యూన్, రాజ్యాంగ యంత్రానికి పూర్వమే ఏర్పడి, క్రమంగా అందులో అంతర్భాగమైంది. మాంటిస్క్యూ గిరాండిన్స్‌లు కలలు గన్నట్లు పెద్ద రాజ్యాన్ని చిన్న రాష్ట్రాల సమాఖ్యగా రూపొందించే యత్నంగా కమ్యూన్ రాజ్యాంగాన్ని గురించి పొరపడుతున్నారు. మొదట్లో రాజకీయ బలప్రయోగం ద్వారా ఏర్పడినప్పటికి, పెద్ద జాతుల ఐక్యత, సామాజిక ఉత్పత్తికి బలమైన ప్రోత్సాహక శక్తిగా వుంది. రాజ్యాంగయంత్రానికి, కమ్యూన్‌కు గల శతృత్వ వైరుధ్యాన్ని, అధికార కేంద్రీకరణకు వ్యతిరేకంగా అనాదిగా జరుగుతున్న పోరాటంయొక్క అతిశయ రూపంగా భ్రమపడుతున్నారు. బూర్జువా ప్రభుత్వ రూపం సాంప్రదాయమైన రూపంలో అభివృద్ధి కాకపోడటానికి, ఫ్రాన్సులోవలెకొన్ని చారిత్రక పరిస్థితులు కారణం కావచ్చు. ఇంగ్లాండులోవలె ప్రభుత్వ యంత్రాంగం యొక్క ముఖ్య విభాగాలన్నీ అవినీతికరమైన పొట్టి చొక్కాల ఉద్యోగులతో లంచగొండి కౌన్సిలర్లతో, పట్టణాలలో న్యాయచట్టాలను కఠినంగా అమలుజరిపే పేద అధికారులు, జిల్లాలలో దాదాపు అనువంశికంగా పదవులు అధిష్టించే ఉద్యోగులతో నిండివుండవచ్చు. పరాన్న భుక్కు అయిన రాజ్యాంగ యంత్రం, సమాజం యొక్క స్వేచ్ఛాయుతమైన చలనాన్ని అరికట్టి, జలగలా దాని రక్తం పీలుస్తూ తాను స్వాయత్తం చేసుకున్న శక్తులన్నిటినీ. కమ్యూనల్ రాజ్యాంగచట్టం పునరుద్ధరించి వుండేది. ఈ ఒక్క చర్యద్వారానే అది ఫ్రాన్స్ పునరుజ్జీవనానికి తోడ్పడివుండేది. లూయీ ఫిలిప్పొ కాలంలో దేశంమీద చలాయించిన తమ పెత్తనం కమ్యూన్ ద్వారా పునరుద్ధరించే యత్నం జరుగుతుందని ఫ్రెంచి మధ్యతరగతి ఆశించింది. ఈ అధికారం లూయీ నెపోలియన్ కాలంఠ రద్దయింది. పట్టణాలపై గ్రామాల పరిపాలన యేర్పడినట్లుగా ఆనాడు భ్రమ పెట్టడం జరిగింది. నిజానికి, కమ్యూనల్ సజీవంగా ఉండటం ద్వారా సహజంగానే స్థానిక మునిసిపల్ సంఘాలకు స్వేచ్ఛ లభిస్తుంది. అయితే ఇప్పుడు తొలగించబడిన రాజ్యాంగ యంత్రంపైన అదుపుచేసే భావన మాత్రం కమ్యూన్‌కు లేదు. ప్రష్యన్ రాజ్యాంగం అనే పోలీసు యంత్రాంగానికి, పట్టణ పరిపాలనను ఉపాంగ చక్రాలుగా ప్రష్యన్ మునిసిపల్ రాజ్యాంగం మార్చివేసింది. ఈ ప్రష్యన్ మునిసిపల్ రాజ్యాంగాన్ని 1791 ఫ్రెంచి మునిసిపల్ సంస్థలు అనుసరించినట్లుగా పారిస్ కమ్యూన్ కూడా అనుకరించనున్నదని

ఆరోపించటం బిస్మార్క్‌కే చెల్లింది. ఈ బిస్మార్క్ దారుణమైన హత్యాయత్నాలతో కూడిన కుట్రలు చేస్తూవుంటాడు. ఆ యత్నాలో కొంత విశ్రాంతి వచ్చిప్పుడల్లా. తన మానసిక స్థాయికి తగిన రచనలు చేస్తూవుంటాడు. బెర్లిన్ నుండి వెలువడే పచ్[29] పత్రికకు వ్యాసాలు రాయటం అతని స్థాయికి తగిన పని. ఆ స్థాయికి తగినవాడు కనకనే పై ఆరోపణలు చేస్తున్నాడు.

స్థిరసైన్యం, ప్రభుత్వ బ్యూరాక్రటిక్ యంత్రాంగం అనే రెండు దుబారాఖర్చు పద్దులను ధ్వంసం చేయటంద్వారా, పారిస్ కమ్యూన్ అన్ని బూర్జువా విప్లవాలకు తక్కువ వ్యయంతో కూడిన ప్రభుత్వం అనే నినాదాన్ని ఇచ్చింది. కమ్యూన్ జీవించడమంటేనే రాచరికం నశించడం. ఈ రాచరిక వ్యవస్థ, కనీసం యూరప్‌లో వర్గపాలనలో అనివార్యమైన అనుబంధంగా ముసుగుగా తయారైంది. రిపబ్లిక్‌కు అవసరమైన నిజమైన ప్రజాతంత్ర వ్యవస్థలను కమ్యూన్ సమకూర్చింది. కాని తక్కువ వ్యయంతో కూడిన ప్రభుత్వం గాని నిజమైన రిపబ్లిక్ గాని కమ్యూన్ యొక్క అంతిమ లక్ష్యం కాదు; ఇవి కమ్యూన్ యొక్క అనివార్యమైన అనుబంధాలు మాత్రమే.

కమ్యూన్‌కు బహువిధమైన వ్యాఖ్యానాలు వచ్చాయి. బహు విధాలైన వర్గాలు కమ్యూన్ తమ ప్రయోజనాలకు లాభకరమని భావించారు. కనుక కమ్యూన్ అతి విస్తృత రాజకీయ స్వరూపమని స్పష్టమౌతూనే ఉంది. అంతకు పూర్వపు ప్రభుత్వాలన్నీ ఖచ్చితమైన దోపిడీ స్వభావాన్ని కలిగి ఉండేవి. కమ్యూన్ అసలు రహస్యం ఇది. అది ప్రధానంగా కార్మికవర్గ ప్రభుత్వం. ఉత్పత్తిచేసే వర్గాలు, దోపిడీచేసే వర్గాలకు వ్యతిరేకంగా సాగించిన పోరాట ఫలితంగా ఇది ఆవిర్భవించింది. కార్మికుల ఆర్థిక విముక్తి సాధించటానికిగాను ఎట్టకేలకు రూపొందిన రాజకీయ రూపం.

ఈ ఆఖరు షరతువల్ల కాకపోతే, కమ్యూన్ రాజ్యాంగాన్ని అర్థం చేసుకోలేము. అదొక భ్రమగా కనిపిస్తుంది. ఉత్పత్తిదారుల రాజకీయ పరిపాలన, సామాజిక బానిసత్వము సహజీవనం చేయలేవు. వర్గాలు, వర్గపరిపాలన ఏ ఆర్థిక పునాదులపై ఉన్నాయో ఆ పునాది నిర్మూలించడానికి కమ్యూన్ ఒక సాధనగా ఉపయోగపడాలి. కార్మికులు విముక్తి చెందితే ప్రతి వ్యక్తి శ్రమజీవే ఔతాడు. ఉత్పాదక శ్రమ, ఒక ప్రత్యేక వర్గ లక్షణంగా ఉండదు.

ఇది చాలా ఆశ్చర్యకరమైన విషయం గత అరవై సంవత్సరాలుగా శ్రమ విముక్తిని గురించి అపారమైన సాహిత్యం వెలువడ్డది. సుదీర్ఘ చర్చలు సాగాయి. కాగా ఈ సమస్యను శ్రమజీవులు దృఢచిత్తంతో తమ చేతులలోకి తీసుకున్న మరుక్షణం. ప్రస్తుత సమాజపు బాకాలన్నీ సమాజాన్ని సమర్థించే పదజాలంతో ముందుకొస్తాయి. ఈ సమాజానికి, పెట్టుబడి, వేతన బానిసత్వం – అనేవి రెండు ముఖాలు పెట్టుబడిదారీ

సమాజ అంతర్గత వైరుధ్యాలు ఇంకా అభివృద్ధి కాలేదని, ఈ సమాజం ఇంకా కన్యాత్వపు అమాయక దశలోనే ఉన్నదని ఈ బాకాలు ప్రచారం చేస్తాయి. ఈ సమాజంపై భ్రమలు ఇంకా బద్దలు కాలేదని, వెలయాలివంటి ఈ సమాజ వాస్తవికత ఇంకా బహిర్గతం కాలేదని వీరు వాదిస్తారు. నాగరికతకు పునాదిఐన ఆస్తివ్యవస్థను కమ్యూన్ ధ్వంసం చేస్తుందని వీరుగగ్గోలు పెడుతున్నారు. అవును, పెద్దమనుషులారా అసంఖ్యాకుల శ్రమ, అల్పసంఖ్యాకుల సంపదగా మారే ప్రస్తుతవర్గ ఆస్తిని కమ్యూన్ రద్దు చేయాలనే వాంచిస్తున్నది. దోపిడీ దారులను రద్దు చేయాలనే కమ్యూన్ కోరుకుంటున్నది. కార్మికులను దోపిడీ చేయటానికి, బానిసలుగా చేయటానికి ప్రధాన సాధనగాఉన్న ఉత్పత్తి సాధనాలను, భూమి, పెట్టుబడులను, నిజమైన స్వంత ఆస్తిగా మార్చాలని కమ్యూన్ ఆశిస్తున్నది. స్వేచ్ఛగా సమీకృతమైన కార్మికుల పనిముట్లుగా, ఉత్పత్తి శక్తులను మార్చాలని యత్నిస్తున్నది. కాని ఇదంతా కమ్యూనిజం అసాధ్యమైన కమ్యూనిజం! అని వారు గగ్గోలు పెడుతున్నారు. ప్రస్తుత వ్యవస్థను ఈ రూపంలో కొనసాగించటం అసాధ్యమని ఊహించే తెలివితేటలు గల పాలకవర్గ ప్రతినిధులు, అలాంటివారు చాలామంది ఉన్నారు. ఇప్పుడు సహాకర ఉత్పత్తి విధానాన్ని పిలవని పేరంటంగా నోరారా సమర్థిస్తున్నారు. కాగా సహకార ఉత్పత్తి, ఒక ఎరలేక బూటకంగా ఉండరాదు అనుకుంటే పెట్టుబడిదారీ వ్యవస్థ స్థానాన్ని అది ఆక్రమించాలనుకుంటే సంయుక్త సహకార సంఘాలు ఒక ఉమ్మడి పథకం ప్రకారం జాతీయ ఉత్పత్తిని క్రమబద్ధం చేయాలంటే, పెట్టుబడిదారీ ఉత్పత్తిలో అనివార్యమైన శాశ్వత అరాచకత్వాన్ని దఫాలవారీ కల్లోలంను అంతంచేసి, ఉత్పత్తి తమ చేతులలోకి తీసుకోవాలనుకుంటే, అయ్యా అప్పుడది కమ్యూనిజంకాక, మరేమౌతుంది? సాధ్యమైన కమ్యూనిజమే అవుతుంది.

కమ్యూన్ ఏదో అద్భుతాలను చేస్తుందని కార్మికవర్గం ఆశించలేదు. ప్రజా ఆదేశాల ద్వారా ప్రవేశపెట్టటానికి ముందుగా తయారైన తన ఊహాత్మక పథకాలేవీ కార్మికులకు లేవు. ప్రస్తుత సమాజం దాని ఆర్థిక కారణాల ఫలితంగానే, ఉన్నతమైన మరో రూపంవైపు అనివార్యంగా మొగ్గుతున్నది. తమ విముక్తి కూడా అందులోనే ఉఉన్నదని కార్మికవర్గం గుర్తిస్తున్నది. దీర్ఘకాల పోరాటాలు, చారిత్రక క్రమాల ద్వారా ముందుకుసాగి, పరిస్థితులను మనుషులను మారిస్తే తప్ప, ఈ లక్ష్యం సాధ్యంకాదని వారు గ్రహిస్తున్నారు. పతనాసన్నమైన బూర్జువా వ్యవస్థ గర్భంలో పెరుగుతున్న నూతన శక్తులను స్వేచ్ఛగా బైటికి వదలటం మినహా, కార్మిక వర్గానికి మరో లక్ష్యం లేదు. తమ చారిత్రక పాత్రను వారు పూర్తిగా గుర్తిస్తున్నారు. సాహసోపేతంగా ఆ పాత్రను నిర్వహించ నిశ్చయించుకున్నారు. సిరాబుడ్డిని, పేనాను ఖరాబుచేస్తూ పెద్దమనుషులుగా

చలామణీ అయ్యేవారందరూ దూషణలు కురిపిస్తున్నారు. బూర్జువా సిద్ధాంతకర్తలు శ్రేయోభిలాషులవలె ఉపదేశాత్మకంగా అభిమానం కురిపిస్తున్నారు. శాస్త్రీయ అనివార్యతా సిద్ధాంతం జపించే దేవతల మాదిరిగా అజ్ఞానజనిత సూక్తులను, ఒంటెత్తువాదపు పిచ్చి కబుర్లను ధారాపాతంగా కురిపిస్తున్నారు. ఇదంతా చూసి, కార్మికవర్గం అసహ్యంతో మందహాసం చేసి ఊరుకోగలదు.

విప్లవ యాజమాన్యాన్ని పారిస్ కమ్యూన్ తన అధీనంలోకి తీసుకున్నది. మొదటిసారిగా, సాధారణ కార్మికులు, అంతకాలం తమ కంటె "సహజంగా ఉన్నతులైన" వారు నిర్వహించే పనులు చేయసాగారు. అనూహ్యమైన కష్టకాలంలో తమ పనిని ఎంతో వినయంతో చిత్తశుద్ధితో సామర్థ్యంతో చేయసాగారు. మునిసిపల్ స్కూల్ యాజమాన్యపు కార్యదర్శికి, న్యాయంగా ఇవ్వలసిన వేతనం అని అత్యున్నత శాస్త్రవేత్తలు నిర్ణయించిన దాంట్లో అయిదోవంతు జీతాన్ని మాత్రమే కమ్యూన్‌లోని అత్యున్నతాధికారులు తీసుకునేవారు. అధికార కేంద్రమైన హోటల్ డీ విల్లీపై శ్రామిక రిపబ్లిక్ చిహ్నంగా ఎర్రజండాను చూసి పాత ప్రపంచం ఆగ్రహంతో మండిపోసాగింది.

కాగా, మధ్యతరగతికి చెందిన అత్యధిక సంఖ్యాకులు, షాపు యజమానులు, వ్యాపారస్తులు, వర్తకులు సైతం కార్మికవర్గం ఒక్కటే సామాజిక చొరవగల వర్గం అని గుర్తించింది. ఈ విప్లవంలోనే ధనికులైన పెట్టుబడిదారులు మాత్రమే ఇందుకు మినహాయింపు. మధ్యతరగతులలో నిరంతరం వివాదగ్రస్తమైన వివాదాన్ని రుణదాతలకు రుణగ్రస్తులకు మధ్య తగాదాను, కమ్యూన్ చాలా తెలివితేటలతో మధ్యతరగతికి అనుకూలంగా పరిష్కరించింది. (మూడేండ్లవరకు అప్పు చెల్లింపులను వాయిదా వేస్తూ ఏప్రిల్ 18న కమ్యూన్ ఉత్తర్వు చేసింది). జూన్ 1848లో కార్మిక ప్రజల సంఘాన్ని అణచివేయటంలో మధ్యతరగతుల సహకారాన్ని తీసుకుని, వెన్వెంటనే. రాజ్యాంగ నిర్ణయసభ, వారిని రుణదాతల దయాదాక్షిణ్యాలకు వదలివేసింది. సరిగ్గా మధ్యతరగతిలోని ఆ వర్గమే కమ్యూన్ ఆదేశంవల్ల లాభపడ్డది. కాగా కార్మికవర్గం చుట్టూ మధ్యతరగతి సమీకృతం కావటానికి ఇదొక్కటే కారణం కాదు. వారు ఒకటి గుర్తించారు. పేరు ఏదైనా వారి ఎదుట రెండే ప్రత్యామ్నాయాలున్నవి. కమ్యూన్ లేక సామ్రాజ్యం ప్రజాధనాన్ని దుర్వినియోగపరిచి, పెద్ద ఎత్తున అర్థిక మోసకృత్యాలను పెంపుచేసి, పెట్టుబడి కృత్రిమంగా కేంద్రీకృతమయ్యేందుకు ఎత్తులుపెట్టి. పై అన్నివిధాల సామ్రాజ్యం, మధ్యతరగతిని ఆర్థికంగా నాశనం చేసింది. రాజకీయంగా వారిని అణచి వేసింది. తమ అవినీతికర ప్రదర్శనల ద్వారా వారిని నైతికంగా భయభ్రాంతులను చేసింది. వారి పిల్లల చదువును, అజ్ఞానులైన పీఠాధిపతుల చేతుల్లోపెట్టి వాల్టేరు ఏర్పరచిన మధ్యతరగతి లౌకిక సాంప్రదాయాలను అవమానపరచింది. వినాశకరమైన

యుద్ధంలోకి వారిని తలమున్కలుచేసి ఫ్రెంచి పౌరులుగా వారి ఆత్మాభిమానాన్ని దెబ్బతీసింది. ఈ యుద్ధంద్వారా జరిగిన నష్టం సామ్రాజ్య విచ్ఛిత్తితో సమానమైనది. నిజానికి పై తరగతికి చెందిన బోనపార్టీ, పెట్టుబడిదారీ నాయకులు, పారిస్‌ను వదలిపెట్టి పారిపోయిన మీదట నిజమైన మధ్యతరగతికి చెందిన పార్టీ ఆఫ్ ఆర్డర్ "రిపబ్లిక్ యూనియన్" పేరుతో ముందుకు వచ్చింది. కమ్యూన్ రక్షణ శ్రేణులలో సైనికులుగా చేరారు. థయర్స్ ఉద్దేశ్య పూర్వకంగా చేస్తున్న కుట్రలకు వ్యతిరేకంగా కమ్యూన్‌ను రక్షించారు. నేడు ఏర్పడిన తీవ్ర విషమ పరిస్థితి అసంఖ్యాకమైన ఈ మధ్యతరగతి ప్రదర్శించిన విశ్వాసం నిలుస్తుందో లేదో కాలమే నిర్ణయించవలసి ఉంది.

'మా విజయం ఒక్కటే మీకు ఆశాజ్యోతి' అని రైతులకు కమ్యూన్ చెప్పటం పూర్తిగా సరైన పని. వర్సేల్స్ సృష్టించబడి, యూరపియన్ పత్రికా ప్రపంచంచే, డబ్బుకాశపడి రాతలు రాసేవారిచే, ప్రచారం చేయబడిన అబద్ధాలలో కల్లా పెద్ద అబద్ధం ఒకటి వుంది. రూరల్స్ ఫ్రెంచి రైతాంగానికి ప్రాతినిధ్యం వహిస్తున్నదనేదే అది. 1815 తర్వాత నష్టపరిహారంగా మిలియన్‌ల ధనం ఏ పార్టీ మనుషులకు రైతాంగం చెల్లించవలసి వచ్చిందో ఆ పార్టీ పట్ల రైతులకు ప్రేమ ఉంటుందా! అసలు పెద్ద భూస్వాములు కొనసాగడమే, 1789 విప్లవంలో సాధించిన విజయాలపై చౌరబాటుగా, ఫ్రెంచి రైతాంగం భావిస్తున్నది. ప్రతి ఫ్రాంకుపైన 45 సెంట్ల అదనపు పన్నును విధించి, ఫ్రెంచి బూర్జువా వర్గం 1848లో రైతులపై భారాన్ని పెంచింది. విప్లవం పేరుతో బూర్జువా వర్గం ఆ పని చేసింది ఇప్పుడు బూర్జువా వర్గం విప్లవానికి వ్యతిరేకంగా అంతర్యుద్ధాన్ని రెచ్చగొట్టింది. ప్రష్యన్‌లకు చెల్లించవలసిన అయిదు మిలియన్ల నష్టపరిహార భారాన్ని రైతుల భుజస్కందాలపై నెట్టడానికి యత్నిస్తున్నది. కాగా, కమ్యూన్ చేసిన మొట్టమొదటి ప్రకటనలలోనే, యుద్ధానికి మూలకారకులెవరో వారే నష్టపరిహార భారం వహించాలని స్పష్టం చేసింది. రైతుల నెత్తురు పీల్చే పన్నులను రద్దు చేయగలనని కమ్యూన్ ప్రకటించింది. ప్రభుత్వ నిర్వహణ ఖర్చును తగ్గిస్తుంది. రైతుల నెత్తురు పీలుస్నున్న రిజిస్ట్రార్, న్యాయవాది, దస్తావేజు రాతగాడు, తదితర న్యాయశాఖ రాబందులను నెలసరి వేతనాలపై, రైతులచే ఎన్నుకోబడి, రైతులకే బాధ్యత వహించేటట్లు చేస్తుంది. గ్రామీణ పోలీస్ కానిస్టేబుల్ సైనికుడు గ్రామాధికారుల పెత్తనం నుండి రైతులకు విముక్తి కలిగిస్తుంది. పీఠాధిపతి బోధించే మతమౌఢ్యం స్థానంలో గ్రామ ఉపాధ్యాయుని ద్వారా విజ్ఞాన ప్రసారం చేయిస్తుంది. ఫ్రెంచి రైతు అన్నిటికి మించి, తన లాభనష్టాలు గ్రహించగల నేర్పరి. పీఠాధిపతికిచ్చే జీతాన్ని రైతుల నుండి బలవంతంగా గుంజటం వంటి, గ్రామీణుల ఐచ్ఛిక మతవిశ్వాసంపై

ఆధారపడిన చందా రూపంలో ఉండటం మేలు అని గ్రహించగలదు. కమ్యూన్ పాలన, పైన వివరించిన సౌకర్యాలన్నిటీనీ రైతులకు వాగ్దానం చేసింది. అదొక్కటి మాత్రమే అలా చేయగలదు. ఇంతకంటే జటిలమూ ప్రధానమూ అయిన సమస్యలు లేకపోలేదు. రైతు గుండెలపై కుంపటిలా వారి భూముల తాకట్టు రుణభారం ఉండనే వుంది. ఆధునిక వ్యవసాయం పెరుగుదల, పెట్టుబడిదారీ వ్యవసాయ క్షేత్రాల పోటీ ఫలితంగా, రైతులు తమ భూములను పోగొట్టుకొని వ్యవసాయ కార్మికజనాభాలో చేరిపోతున్నారు. కనుక వ్యవసాయ కార్మికుల సంఖ్యరోజు రోజుకూ పెరుగుతున్నది. ఈ సమస్యలన్నిటినీ రైతులకు క్షేమకరమైన పద్ధతిలో పరిష్కరించగలిగింది కమ్యూన్ ఒక్కటేనని ప్రత్యేకించి చెప్పనక్కరలేదు.

ఫ్రెంచి రైతు, రిపబ్లిక్ అధ్యక్ష పదవిని లూయీ బోనపార్టీని ఎన్నుకున్నాడు.కాని సామ్రాజ్యాన్ని సృష్టించింది మాత్రం పార్టీ ఆఫ్ ఆర్డర్. తమకు నిజంగా ఏమి కావలెనో ఫ్రెంచి రైతులు 1849, 50లలోనే వ్యక్తీకరించసాగారు. ప్రభుత్వ నియమిత గ్రామ అధికార స్థానంలో ఎన్నికైన గ్రామపంచాయతీ అధ్యక్షుడు, ప్రభుత్వ నియమిత పీఠాధిపతి స్థానంలో ఉపాధ్యాయుడు, ప్రభుత్వ పోలీసు స్థానంలో, దృఢగాత్రుడైన రైతు. ఇవి రైతుకు కావలసినవి. 1850 జనవరి ఫిబ్రవరి నెలల్లో పార్టీ ఆఫ్ ఆర్డర్ చేసిన చట్టాలన్నీ, రైతుపై బాహాటంగా నిర్బంధాలు విధించినవే. రైతు బోనపార్టీస్టు ఏమంటే ఫ్రెంచి మహా విప్లవం రైతుకు అనేక సౌకర్యాలు కలిగించటంతోపాటు విప్లవానికి ప్రత్యక్షరూపం నెపోలియన్ అనే భావాన్ని కూడా కలిగించింది. రెండవ సామ్రాజ్యపాలనలో ఈ భ్రమలు త్వరత్వరగా బద్దలు కాసాగినవి (ఇలా కావటం సహజంగానే రూరల్స్‌కు హానికరం) గతానికి చెందిన ఈ దురభిప్రాయం. రైతుల సజీవ ప్రయోజనాలను తక్షణ కోర్కెలను స్పందింపచేసే కమ్యూన్ విజ్ఞప్తిని తట్టుకుని ఎలా నిలబడగలదు?

మూడు నెలలపాటు కమ్యూన్ పాలనలో ఉన్న పారిస్‌కు రాష్ట్రాలతో స్వేచ్ఛగా రాకపోకలు సాగినట్లయితే, రైతుల సాధారణ తిరుగుబాటు తప్పదని, రూరల్స్ సహజంగానే ఆందోళన చెందసాగారు. కనుకనే ఈ దొమ్మవ్యాధి వ్యాపించకుండా పారిస్ చుట్టూ పోలీసు దిగ్బంధనం ఏర్పరచాలని వారు ఆందోళన పడసాగారు.

ఈ విధంగా కమ్యూన్ ఫ్రెంచి సమాజంలోని ఆరోగ్యకర అంశాలన్నిటికి నిజమైన ప్రతినిధి కనుక నిజమైన జాతీయ ప్రభుత్వం అదే సమయంలో అది కార్మిక ప్రజల ప్రభుత్వం, కార్మికుల విముక్తికై ధైర్యంగా ముందుండి పోరాడింది. ఖచ్చితమైన అంతర్జాతీయ స్వభావం కలిగి ఉంది. రెండు ఫ్రెంచి రాష్ట్రాలను జర్మనీలో లీనం

చేసుకున్న ప్రష్యన్ సైన్యం ఒక వైపున ఉండగా. యావత్ ప్రపంచ కార్మికులను కమ్యూన్ తనవైపు ఆకట్టుకున్నది.

రెండవ సామ్రాజ్యం అన్ని రకాల దొంగ కూలీలకు కేరింతలు కొట్టే కేంద్రం ఐంది. అందులో జరిగే జుగుస్సాకర విలాసాలలో పాలు పంచుకునేందుకు ఫ్రెంచి ప్రజల దోపిడీలో వాటా పొందేందుకు, అన్ని దేశాల సంఘ వ్యతిరేక పోకిరీ శక్తులు అక్కడ పోగయ్యారు. ఆ క్షణానికి కూడా థయర్స్‌కు నమ్మకస్తుడైన అనుచరుడు గనెస్కో వాలాష్‌కు చెందిన దుర్మార్గుడు. అతని నమ్మకస్తుడు, రష్యన్ గూఢచారి మర్కోవస్కీ అజరామరమైన ఆశయం కొరకు అసువులర్పించేందుకై విదేశాల నుండి వచ్చిన ప్రతి ఒక్కరినీ కమ్యూన్ స్వీకరించింది. బూర్జువా వర్గ ద్రోహం వల్ల, విదేశంతో జరిగిన యుద్ధంలో ఫ్రాన్స్ ఓడిపోయింది. విదేశీ ఆక్రమణ దారులతో వారు జరిపిన కుట్ర ఫలితంగా అంతర్యుద్ధం ప్రజ్వరిల్లింది. ఈ మధ్య కాలంలో ఫ్రాన్స్ దేశంలోని జర్మన్లపై పోలీసుదాడులను తీవ్రతరం చేసి, ఫ్రెంచి బూర్జువా వర్గం తన దేశభక్తిని నిరూపించుకున్నది. ఒక జర్మన్ కార్మికుడ్ని, కమ్యూన్ కార్మిక మంత్రిగా నియమించింది. మరొక వైపున థయర్స్ బూర్జువా వర్గం, రెండవ సామ్రాజ్యం నిరంతరం పోలండును మోసం చేస్తూనే వచ్చారు. ఒక వైపు పోలెండు పట్ల సానుభూతిని ప్రకటిస్తూనే రష్యాకు పోలెండు లొంగిపోయేటట్లు నీచమైన పనులన్నీ చేస్తూనే వచ్చారు. కమ్యూన్ మాత్రం పారిస్ రక్షణ శ్రేణిలో అగ్రస్థానాన పోలిష్ వీరుల నుంచింది. ఆ విధంగా వారిని గౌరవించింది. అంతేకాదు చరిత్రలోనూ తన అధ్యాయాన్ని సృష్టించేందుకు గాను జయించుకుంటూ చొచ్చుకు వస్తున్న ప్రష్యన్లు, బోనపార్టిస్టు సేనానుల ఆధ్వర్యాన ఉన్న పార్టిస్టు సైన్యం, రెండు వైపుల మోహరించి ఉండగానే, సైనిక విజయాలకు చిహ్నమైన వెండోంగోపురాన్ని[30], ఉద్దేశ పూర్వకంగానే కమ్యూన్ ధ్వంసం చేసింది (ఆ విధంగా అది సామ్రాజ్య వ్యతిరేక స్వభావాన్ని నిరూపించుకుంది).

కమ్యూన్ సాధించిన గొప్ప సామాజిక విజయం, అది అసలు జీవించడమే. ప్రజల కొరకు ప్రజల ప్రభుత్వం అనే నినాదాన్ని అమలు జరపడానికి కొన్ని ప్రత్యేక చర్యలు చేపట్టింది. రొట్టెలు తయారుచేసే కార్మికులు రాత్రిళ్ళు పని చేయరాదని నిషేధించింది. ఏవో జరిమానాలు, సాకులతో కార్మికుల వేతనాలలో యజమానుల ఎత్తుగడలను నిషేధించింది. ఈ విధంగా జరిమానా విధించడంలో యజమాని, శాసన సభ్యుడు. కార్యనిర్వాహకాధికారి. న్యాయమూర్తి పదవులన్నిటినీ తానే నిర్వహించేవాడు. డబ్బు కూడా అతనే స్వాహా చేసేవాడు. కార్మిక వర్గం మరో పని కూడా చేసింది. మూతపడిన కార్ఖానాలు, ఫ్యాక్టరీలన్నిటినీ, ఆ ఫ్యాక్టరీ యజమానులైన పెట్టుబడిదారులు పారిపోయారా, లేక సమ్మె చేస్తున్నారా అనే వ్యత్యాసం లేకుండా

వారికి నష్టపరిహారం ఇచ్చి, ఆ సంస్థలను కార్మికుల సంఘాలకు స్వాధీనం చేసింది.

కమ్యూన్ తీసుకున్న ఆర్థిక చర్యలు, నిగ్రహానికి, ఉచితజ్ఞతకు తార్కాణాలు. దిగ్బంధంలో ఉన్న పట్టణం సహజంగా తీసుకోవలసిన చర్యలను వారు తీసుకున్నారు. పారిస్ నగర సంపదను, హాస్‌మన్* ఆధ్వర్యంలో పెద్ద వ్యాపార సంస్థలు, కాంట్రాక్టర్లు సాగించిన దారుణమైన దోపిడీ దృష్ట్యా, వారి ఆస్తులన్నిటినీ కమ్యూన్ స్వాధీనం చేసుకున్నా తప్పులేదు. ఆర్లియన్ కుటుంబీకుల ఆస్తులను లూయీ నెపోలియన్ స్వాధీనం చేసుకున్నదాని కంటే ఎక్కువ సమంజసంగానే ఉండేది. చర్చి ఆస్తులను స్వాధీనం చేసుకోవటం ద్వారా విపరీతంగా ఆస్తులను సమకూర్చుకున్న హోహెన్ జోలర్న్ ఇంగ్లీషు ప్రభువులు, ఉభయులూ చర్చికి నష్ట పరిహారంగా 8 వేల ఫ్రాంకులు మాత్రమే కమ్యూన్ చెల్లించినందుకు నిర్ఘాంతపోయారు. వర్సేల్స్ ప్రభుత్వం తిరిగి కొంచెం ఊపిరి బలం పుంజుకున్న మీదట, కమ్యూన్‌కు వ్యతిరేకంగా దారుణమైన నిర్బంధ విధానాన్ని అనుసరించింది. ఫ్రాన్సు అంతటా అభిప్రాయ స్వేచ్ఛను నిషేధించింది. పెద్ద నగరాలకు చెందిన ప్రతినిధుల సమావేశాలను కూడా నిషేధించింది. వర్సేల్స్‌లోను మిగతా ఫ్రాన్సులోను, రెండవ సామ్రాజ్యాని కంటె పకడ్బందీగా గూఢచారి శాఖను విస్తరించింది. పారిస్‌లో అచ్చు అయ్యే పత్రికలన్నిటినీ తన పోలీసులచే తగల బెట్టించింది. పారిస్‌కు వచ్చే, అక్కడి నుండి బైటికి వెళ్ళే ఉత్తర ప్రత్యుత్తరాలన్నిటినీ తెరిచి చూడసాగింది. జాతీయ శాసనసభలో పారిస్ తరపున ఎవరు కొద్దిపాటి సమర్థన చేసినా, వారిని గందరగోళం మధ్య నోరు నొక్కివేసేవారు 1816 ప్రభుత్వ శాసన సభలో కూడా ఇంత అల్లరి జరగలేదు. బైట నుండి వర్సేల్స్ దారుణమైన యుద్ధాన్ని చేస్తున్నది. పారిస్ లోపల అవినీతిని. కుట్రలను అది ప్రోత్సహిస్తున్నది. సుస్థిరమై శాంతి పరిస్థితులలో గనక ఉదారవాదపు మర్యాదలను, నియమాలను కమ్యూన్ పాటించుట కంటే విప్లవ ప్రజలు తనపై నుంచిన విశ్వాసాన్ని కమ్యూన్ వమ్ము చేసినట్లే అయ్యేది కదా! కమ్యూన్ ప్రభుత్వం కూడా థియర్స్ ప్రభుత్వం లాంటిదే ఐనట్లయితే పారిస్‌లో ప్రచురించిన పార్టీ ఆఫ్ ఆర్డర్ పత్రికలను అణచివేయవలసిన అవసరం ఉండదు. వర్సేల్స్‌లో కమ్యూన్‌కు చెందిన పత్రికలను మూసివేయవలసిన అవసరం ఉండదు.

ఫ్రాన్సు బాగుపడాలంటే చర్చికి విశ్వాసపాత్రంగా ఉండాలని. రూరల్స్ ప్రకటన చేసే సమయానికి, వారికి ఇబ్బంది కలిగించే విధంగా. నాస్తికవాద కమ్యూన్ పిక్యూస్

---

* రెండవ సామ్రాజ్య కాలంలో, బారన్ హాస్‌మన్, పారిస్ నగరంలో, నేనీ విభాగం అధిపతి, కార్మికుల తిరుగుబాటును అణచివేసే దృష్టిలో అతడు నగరంలోని పేటల నిర్మాణంలో అనేకమైన మార్పులు చేశాడు.

సన్యాసినీ మఠంలోనూ సైంట్ లారెంట్ చర్చిలోనూ జరుగుతన్న అవినీతికర ఘటనలను బైటపెట్టసాగింది. యుద్ధాలలో ఓడిపోయి లొంగుబాటులో సిద్ధహస్తులై, విల్హెల్మ్‌షోలో సిగరెట్లు తాగుతూ కాలక్షేపం చేసిన బోనపార్టిస్టు సేనానులకు, థియర్స్ విజయ పతాకాలు అందిస్తుండగా కమ్యూన్ విధి నిర్వహణలో విఫలులైనట్లు అనుమానం తోచిన వెంటనే తన సేనానులను తొలగించి, నిర్బంధించ సాగింది. థియర్స్‌కిది పెద్ద అవమానంగా పరిణమించింది. కమ్యూన్ సభ్యులలో ఒకరు, మారుపేరుతో పారిపోయి దివాలా తీసినందుకు గాను లాయన్స్ జైలులో ఆరు రోజులు విడి ఖైదు అనుభవించాడు. అతనిని కమ్యూన్ తన సంస్థలో నుంచి బహిష్కరించింది. మరొక వైపున అప్పటికే ఫ్రాన్సు విదేశాంగ మంత్రిగా చలామణీ అవుతున్న టూల్స్ షేవ్రె, దేశాన్ని బిస్మార్క్‌కు అమ్మివేస్తూనే ఉన్నాడు. పవిత్రమైన బెల్జియం ప్రభుత్వానికి ఉత్తర్వులు జారీ చేస్తూనే ఉన్నాడు. అయితే, కమ్యూన్ తానేమాత్రం పొరపాట్లు చేయలేదని చెప్పుకోవటం లేదు. ఆనాటి ప్రభుత్వాలన్నీ ఆ రకంగా గొప్పలు చెప్పుకునేవి. తాను చేసిన పనులను, ఇచ్చిన వాగ్దానాలను అది ప్రచురించింది. తన లోపాలన్నిటినీ ప్రజలకు తెలియజేస్తూనే ఉంది.

ప్రతి విప్లవంలోనూ, నిజమైన విప్లవకారుల సరసన మోసకారులూ చేరుతూ ఉంటారు. వీరిలో కొందరు వెనుకటి విప్లవాలకు విశ్వాస పాత్రులు. కొందరు ఆ విప్లవాల హతశేషులు. వారికి ప్రస్తుత పరిస్థితుల ఆంతర్యం తెలియదు. తమ నిజాయితీ, ధైర్యాల ఫలితంగానో లేక కేవలం సాంప్రదాయ ప్రభావం వలననో ప్రజలలో పలుకుబడిని కాపాడుకుంటూ ఉంటారు. మరికొందరు ఏదో ఎల్లప్పుడూ పేలుతూనే ఉంటారు. ప్రభుత్వానికి వ్యతిరేకంగా, ఒకే రకమైన దూషణలను అదే పనిగా వారు ప్రతి ఏటా వల్లిస్తుంటారు. ఆ విధంగా ప్రథమ శ్రేణి విప్లవకారులనే పేరు సంపాదించుకుంటారు. మార్చి 18 తర్వాత, అలాంటి వ్యక్తులూ కొందరు పైకి వచ్చారు. కొన్ని సందర్భాలలో చాలా ప్రముఖ స్థానాలను కూడా ఆక్రమించారు. వారి శక్తి మేరకు కార్మిక వర్గం యొక్క నిజమైన కార్యాచరణను అడ్డుకుంటూ వచ్చారు. అంతకు ముందు జరిగిన ప్రతి విప్లవంలోను, ఇట్టి మనుషులు ఇలాంటి వైఖరినే అవలంభిస్తూ వచ్చారు. వారొక అనివార్యమైన అరిష్టం. కాల క్రమేణ మాత్రమే వారిని వదలించుకోవటం సాధ్యం. అయితే కమ్యూన్‌కు ఆ విధంగా కాలం కలిసి రాలేదు.

పారిస్‌లో కమ్యూన్ తీసుకువచ్చిన మార్పులు నిజంగా ఆశ్చర్యకరమైనవి. రెండవ సామ్రాజ్యకాలపు అట్టహాసాలన్నీ పారిస్ నుండి అదృశ్యమైనాయి. బ్రిటిష్ భూస్వాములు పారిపోయి వచ్చిన పారిస్ భూస్వాములు మాజీ అమెరికన్ బానిస యజమానులు ఇతర అప్రతిష్టాకరమైన వ్యక్తులు. రష్యన్ మాజీ అర్థ బానిస ప్రభువులు;

వాకస్‌కు చెందిన సేనానులు–వీరందరూ అదృశ్యమైనారు. శవపరీక్షాశాలలో దహనం కాకుండా శవాలు పడి ఉండడంలేదు. అర్ధరాత్రి దొంగతనాలు లేవు, బందిపోట్లు అదృశ్యమయాయి. నిజానికి 1848 ఫిబ్రవరి రోజుల నుండి మొట్టమొదటి సారిగా పారిస్ వీధులలో భద్రతా భావం ఏర్పడ్డది. ఎట్టి పోలీసు రక్షణ లేకుండానే ఇలా జరిగింది. కమ్యూన్ సభ్యుడొకడు ఇలా అన్నాడు. "దొంగతనాలు, హత్యలు వ్యక్తులపై దాడులను గురించి మేము ఏమీ వినటం లేదు పోలీసులు, తమ మితవాద స్నేహితులతో సహా అంతా వర్సేల్స్‌కు తరలిపోయినట్లున్నారు. కుటుంబం, మతం, ఆస్తి బూటకపు మాటలు చెప్పే కుహనా నీతివాదులు, విలాస స్త్రీలు తమ యజమానులతో వెళ్ళిపోయారు. వారి స్థానంలో నిజమైన పారిస్ స్త్రీలు, ధైర్యవంతులు, చిత్తశుద్ధి గలవారు, ప్రాచీన కాలపు మహిళల వలె ముందుకు వచ్చారు. పని చేస్తూ, ఆలోచిస్తూ పోరాడుతూ నెత్తురోడుతూ పారిస్ నగరం. నూతన సమాజ నిర్మాణ సంరంభంలో – గేటు ఆవతల ఉన్న నరరూప భక్షకులను మరచిపోయి, తన చారిత్రక చొరవతో ఉత్సాహంతో తొణికిసలాడ సాగింది."

పారిస్‌లోని ఈ నూతన ప్రపంచంతో వర్సేల్స్‌లోని పాత ప్రపంచాన్ని పోల్చి చూద్దాం. రెజితెమిస్టులు, ఆర్లియనిస్టులు పడిపోయిన వంశాల ప్రేతాత్మలు. జాతి మృత దేహాన్ని చీల్చుకు తిందామని కాచుకు కూచున్నవారు. పూర్వకాలపు రిపబ్లికన్లు కొందరున్నారు. శాసన సభలో సభ్యత్వం ద్వారా వీరు బానిస యజమానుల తిరుగుబాటుకు ఆమోదం తెలిపారు. తమ నాయకుడుగా ఉన్న నిర్జీవ ప్రతిమ ఆత్మాడంబరంపై ఆధారపడి, పార్లమెంటరీ రిపబ్లిక్‌ను కాపాడాలని వీరి యత్నం. తమ కుట్రలకన్నిటికీ జూడిపోమే అనే టెన్నిసు కోర్టును కేంద్రస్థలంగా చేసుకున్నారు. 1789 ఫ్రెంచి మహా విప్లవ సన్నాహాలన్నీ ఆ స్థలంలోనే జరిగాయి. కనుక ఆ విప్లవానికి తాము వారసులమైనట్లు వీరు నటించ చూస్తున్నారు. ఫ్రాన్సులో మృతప్రాయమైన వాటన్నిటికీ ప్రాతినిధ్యం వహించే శాసన సభను. అక్కడ లూయీ బోనపార్టీ సేనానులు కేవలం తమ ఆయుధ బలంతో నిలబెట్టాలని చూస్తున్నారు. పారిస్ సత్యానికి చిహ్నం. వర్సేల్స్ అసత్యానికి ప్రతిబింబం. ఈ అసత్యాన్ని థయర్స్ తన నోటి నుండే పలుకుతున్నాడు.

సేన్ థట్ జసికి చెందిన మేయర్ల ప్రతినిధి వర్గంతో మాట్లాడుతూ థయర్స్ ఇలా అన్నాడు. : "మీరు నామాటమీద విశ్వాసం ఉంచండి. నేనెప్పుడూ మాట తప్పిన వాణ్నికాను." అతను శాసనసభలో ఇలా అంటున్నాడు : "అత్యంత స్వేచ్ఛతో ఉదారభావంతో ఎన్నికైన శాసనసభ ఇది. ఇలాంటిది ఫ్రాన్సులో ఎన్నడూ ఏర్పడలేదు." తన అమాంబాపతు సైనికులతో ఇలా అంటున్నాడు. "ప్రపంచమంతా మిమ్ము

ప్రశంసిస్తున్నది. ఇంతటి చక్కని సేన ఫ్రాన్సుకు ఎన్నడూ లేద." తాను పారిస్‌పై బాంబుల కురిపించాననడం అబద్ధమని రాష్ట్రాలకు నచ్చచెబుతున్నాడు. "ఏవైనా కొన్ని ఫిరంగిగుండ్లు పడితే అది వర్సేల్స్ సైన్యం పనికాదు. ఎవరో కొందరు తిరుగుబాటు దారులు. తాము ఇంకా పోరాడుతున్నమని చెప్పుకొటానికి చేసిన పని. తమ ముఖాలను వారు చూపించలేరు." అతడు రాష్ట్రాలకు తిరిగి ఇలా చెబుతున్నాడు "వర్సెల్స్ ఫిరంగులు పారిస్‌పై గుండ్ల వర్షం కురిపించవు. కేవలం ఫిరంగులతో చుట్టుముట్టి ఉంటుంది." వర్సెల్స్‌లో జరిగినట్లు చెప్పబడుతున్న వధలు. ప్రతీకార చర్యలు అన్నీ అబద్ధాలనీ, పారిస్ ఆర్చి బిషప్‌కు అతడు తెలియజేస్తున్నాడు. "మిమ్ములను దోపిడీచేస్తున్న దారుణ నియంతల" నుండి మీకు విముక్తి కలించటమే మా లక్ష్యం అని పారిస్ ప్రజలకు చెబుతున్నాడు. పారిస్ కమ్యూన్ అనేది "కొద్దిమంది నేరస్తుల గుంపు" మాత్రమే అంటున్నాడు.

థయర్స్ ఊహించే పారిస్ "దుర్మార్గులైన గుంపులకు చెందిన నిజమైన పారిస్ కాదు. ప్రేతాత్మ వంటి పారిస్. స్త్రీ, పురుష విలాసజీవులకుచెందిన పారిస్, ధనికులు పెట్టుబడిదారులు, భుజకీర్తులుధరించి, ఖాళీ జీవితం గడపేవారు. వారి తాబేదారులు, దొంగ కూలీలు, వారి భజనపరులైన రచయితలు, వర్సెల్స్, సెంట్ డెనిస్, రూయర్, సెంట్‌న్ జర్మన్ నగరాలలోని వారి అనుయాయులు-వీరికి చెందిన పారిస్, వారి దృష్టిలో అంతుర్యుద్ధం వాంఛనీయమైన ఒక పెడమార్గం. వారు దూరదర్శినీ యంత్రాలతో యుద్ధ దృశ్యాలను చూస్తారు. ఫిరంగి గుండ్ల కాల్పులను లెక్కించుకుంటూ, పోర్ సెంట్ మార్టిన్ యుద్ధంకంటే, ఈ యుద్ధం బాగా జరుగుతున్నదని, తమపైన, తమ ఉంపుడుకత్తెలపైనా ప్రమాణం చేస్తూ ప్రగల్భాలు పలుకుతుంటారు. క్రింద పడిపోయినవారు నిజంగా చచ్చిపోయిన వారే. గాయపడినవారి హాహాకారాలు, నిజమైన హాహాకారాలే. అంతేకాదు. ఈ యావత్తు చర్య నిజంగా చారిత్రాత్మకమైంది.

ఇది థయర్స్‌కు చెందిన పారిస్. జర్మనీలోని కోబ్లెంజ్‌లో[32] ప్రవాస జీవితం గడిపిన ఫ్రాన్సు, డికాలోనీ ఫ్రాన్సు ఐనట్లు.

## IV

ప్రష్యన్లచే పారిస్‌ను ఆక్రమింపచేసి అణచి వేయాలని, బానిస యజమానులు చేసిన మొదటి కుట్ర బిస్మార్క్ నిరాకరణ ద్వారా విఫలమైంది. మార్చి 18న జరిగిన రెండవ ప్రయత్నంలో, సైన్యం ఓడిపోయింది. పారిస్‌లోని యంత్రాంగాన్నంతా విచ్ఛిన్నం చేసి తనతో తీసుకుపోవాలనుకున్న ప్రభుత్వం వర్సేల్స్‌కు పారిపోయింది. పారిస్‌తో శాంతి సంభాషణలు అనే నాటకం ఆడుతూ, థయర్స్ యుద్ధానికి సన్నాహాలు

చేయసాగాడు. అయితే అతనికి సైన్యం ఏది? హత శేషులైన సేనలు, సంఖ్యలోనూ చాలా కొద్ది, వారి ప్రవర్తన నమ్మదగినది కాదు. జాతీయ రక్షక దళాలు, వాలంటీర్లు, అత్యవసరంగా వర్సెల్స్ రక్షణకు రావలసిందిగా, థయర్స్ చేసిన విజ్ఞప్తిని ఎవరూ పాటించలేదు. బ్రిటిన్ రాష్ట్రం మాత్రమే[33] కొందరు కిరాయి మూకలను సప్లయి చేసింది. వీరు తెల్లటి జండాను ధరించి, తమ రొమ్ములపై తెల్లటి ఏసుక్రీస్తు బొమ్మను ధరించి, "రాజు చిరకాలం వర్ధిల్లాలి" అని నినాదాలు ఇచ్చుకుంటూ పోరాడారు. కనుక థయర్స్ తప్పని సరై, హడావిడిగా, నావికులు, యుద్ధ నౌకల సిబ్బంది, ఫ్రెంచి పదాతిదళమైన జోన్‌లు,[34] వాలెంటిన్ హంతకులు, పియత్రికి గూండాలు, దగాకోర్లు ఇలాంటి అమాంబాపతు వారిని చేర్చి ఒక సైన్యం ఏర్పరచాం. అయితే జర్మన్ సామ్రాజ్యం చేజిక్కించుకున్న యుద్ధ ఖైదీలు లేకపోతే, సైన్యం ఎందుకూ పనికిరాదు. అట్టి యుద్ధ ఖైదీలను, బిస్మార్క్, అంతర్యుద్ధం కొనసాగేటందుకు అవసరమైన మోతాదులో మాత్రమే విడుదల చేశాడు. వర్సేల్స్ ప్రభుత్వం, ప్రష్యన్ ప్రభుత్వంపై పూర్తిగా ఆధారపడే విధంగా చేశాడు. తీరా యుద్ధంలో కూడా, వర్సేల్స్ సైన్యం పోరాడేటట్లు, వర్సేల్స్ పోలీసులు కాపలా కాయవలసి వచ్చింది. ఈ సైన్యాన్ని కిరాయి గుండాలు ముందుండి నడిపిస్తూ, మొదటి దాడికి వారే గురికావలసి వచ్చేది. కొన్ని కోటలు లొంగిపోయినవి. అయినా వాటిని ఈ సైన్యం స్వాధీనం చేసుకోలేక పోయింది. ఫెడరల్స్ వీరోచితంగా పారిస్‌ను రక్షించారు. దాంతో, తన వ్యూహాత్మక సామర్థ్యము, తన చేతిలోని సన్నీలు పారిస్‌ను పట్టుకోటానికి చాలవని థయర్స్ గుర్తించక తప్పలేదు.

ఈలోగా రాష్ట్రాలతో సంబంధాలు మరింత జటిలం కాసాగాయి. థయర్స్‌కు అతని రూరల్స్‌కు సంతోషం కలిగించే ఒక్క వార్తకూడా రాష్ట్రాల నుండి రాలేదు. అందుకు విరుద్ధంగా, విజ్ఞప్తులు, పత్రాలు రాసాగాయి. ఈ పత్రాల భాష థయర్స్‌కు మర్యాద సూచకంగా లేనేలేదు. రిపబ్లికన్‌ను నిర్నిబంధంగా గుర్తించి, పారిస్‌తో రాజీపడాలని, ఈ విజ్ఞప్తుల సారాంశం. కమ్యూన్ ఇచ్చిన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలన్నిటినీ గుర్తించటం, జాతీయ శాసన సభను రద్దు చేయటం. అవసరమని కోరుతూ విజ్ఞప్తులు శరపరంపరగా రాసాగాయి. జాతీయ శాసనసభ ఉత్తర్వులు అప్పటికే అసలు నిరుపయోగమై పోయాయి. థయర్స్ మంత్రి వర్గంలో న్యాయశాఖా మంత్రి దూపారే ఏప్రిల్ 23న ఒక సర్క్యులర్ జారీ చేస్తూ ఇలా అన్నాడు.

"రాజీపడాలి" అనే మాట విద్రోహంతో సమానం అని. తన దాడి విఫల మౌతున్నదని, దానికి భవిష్యత్తు లేదని థయర్స్ గుర్తించక తప్పటంలేదు. అతడు తన ఎత్తుగడలు మార్చాడు. జాతీయ శాసనసభకు తాను ఆదేశించిన మునిసిపల్ చట్టం ప్రకారం, ఫ్రాన్సు అంతటా ఏప్రిల్ 30న, ఎన్నికలు జరుగుతాయని

ప్రకటించాడు. అతని అనుచరుల కుట్రలు, పోలీసుల బెదిరింపులు, ఈ ఎన్నికలలో గెలుపు సాధిస్తాయని. తద్వారా జాతీయ శాసనసభకు అంతకు ముందెన్నడూ లేని నైతిక శక్తి లభిస్తుందని. పారిస్‌ను జయించటానికి అవసరమైన భౌతిక శక్తిని ఎట్టకేలకు తాను సంపాదించగలనని అతడు ఆశించాడు.

ఒకవైపున పారిస్‌కు వ్యతిరేకంగా వారి దోపిడీ యుద్ధం సాగిస్తూ తన ప్రకటనలలో స్వోత్కర్షగా ఆ ఘటనలను చెప్పుకొంటూ యంత్రాంగంలోని అతని మంత్రులు, ఫ్రాన్స్ అంతటా నియంతృత్వ పాలనను నెలకొల్పుతూనే, థయర్స్ మరోవైపున ఏదో కొంత రాజీ ధోరణి ఒక పక్కన ప్రదర్శిస్తూనే వచ్చాడు. ఇలా చేయటంలో అతనికి చాలా లక్ష్యాలున్నాయి. రాష్ట్రాలను మోసపుచ్చటం. మధ్యతరగతిని మభ్య పెట్టటం. జాతీయ శాసన సభలోని రిపబ్లికన్లుగా చెప్పుకునే వారు, పారిస్‌కు వ్యతిరేకంగా చేస్తున్న తమ ద్రోహాన్ని థయర్స్‌పై విశ్వాసం అనే ముసుగులో కప్పిపుచ్చుకోవటం, ఇవి అతని లక్ష్యాలు. మార్చి 21న ఇంకా అతని చేతిలో సైన్యం లేనప్పుడే శాసనసభ నుద్దేశించి అతడిలా అన్నాడు: “రిపబ్లిక్ ఒక సుస్థిరమైన సంస్థ అనే నమ్మకం నాకు కలిగింది. దానిని స్థిరంగా కొనసాగించడానికి నేను నిశ్చయించుకున్నాను.” వాస్తవానికి, అతడు లాయన్స్. మార్సిలీస్*లో విప్లవాన్ని అణచివేశాడు. రిపబ్లిక్ పేరుతో ఈ విధంగా విప్లవాలను అణచివేస్తూనే. అతనికి చెందిన రూరల్స్. వర్సెల్స్‌లో ఈమాటే వినబడకుండా రణగొణ ధ్వని చేసేవారు. ఈ ఘనకార్యం తర్వాత. ఈ వాస్తవాన్ని అతడు సిద్ధాంతీకరించాడు. బోర్డో అవతలికి మర్యాదగా అతడు పంపించి వేసిన ఆర్లియన్స్ రాజవంశీకులు, ఇప్పుడు వాగ్దానానికి పూర్తి విరుద్ధంగా డ్రూల్స్‌లో కుట్రలు చేయటానికి అనుమతించబడ్డారు. పారిస్ నుండి. రాష్ట్రాల నుండి వచ్చిన ప్రతినిధులతో థయర్స్ నిరంతరాయంగా చర్చలు సాగిస్తుండేవాడు. క్షణక్షణానికి పరిస్థితుల ననుసరించి ఈ చర్చల ధోరణి సారాంశం మారుతూ ఉండేది. “లేకుంటే క్లెమెంట్ థామస్‌ల హత్యలు భాగస్వాములైన కొద్దిమంది నేరస్తులపై ప్రతీకార చర్యలను పరిమితం చేయటానికి మించి” ఈ చర్చలు ముందుకు సాగేవికావు. ఈ చర్చలన్నిటికీ ప్రాతిపదికగా ఒక షరతు విధించేవాడు. పారిస్, ఫ్రాన్సు యావత్తూ థయర్స్‌ను, బేషరతుగా అత్యుత్తమ రిపబ్లికన్‌గా గుర్తించాలనేదే ఆ షరతు. 1830 తాను ఇదే విధంగా ఫిలిప్పాను గుర్తించాడు. ఈ విధంగా ఇచ్చిన సౌకర్యాలను కూడా అతని మంత్రులు శాసన సభలో చేసే ప్రకటన ద్వారా, ఎంతో

---

*1871 మార్చి 18 తర్వాత కొద్దిరోజులకే, లాయన్స్, మార్సేల్స్‌లో విప్లవాలు బద్ధలయ్యాయి. వాటి లక్ష్యం కమ్యూన్లను ప్రకటించటం, థయర్స్ ప్రభుత్వం ఈ ఉద్యమాన్ని అణచివేసింది.

అనుమానాస్పదమైనవిగా తయారయ్యేవి. అతని తరఫున పనిచేయటానికి దూఫారే ఉండనే ఉన్నాడు. ఆర్లినిస్టులకు చెందిన ఈ పాత లాయరు మొదటి నుంచి పారిస్ దిగ్బంధాన్ని సమర్థించేవాడే. 1871లో థయర్స్ క్రింది. 1839లో లూయిా ఫిలిప్పొ క్రింది, 1849లో లూయిా బోన పార్టీ అధ్యక్ష పదవీ కాలంలోనూ ఇలా వ్యవహరించేవాడు. అధికారంలో లేనప్పుడు అతడు పారిస్ పెట్టుబడిదారుల తరఫున వాదించి ధన సంపాదన చేసేవాడు. తానే సృష్టించిన చట్టాలకు తానే వ్యతిరేకంగా వాదించి, రాజకీయంగా లబ్ధి పొందేవాడు. అతడిప్పుడు హడావిడిగా జాతీయ శాసనసభలో, కొన్ని నిర్బంధ చట్టాలను ఆమోదింపచేశాడు. పారిస్ పతనం తర్వాత, ఫ్రాన్సులో మిగిలిన రిపబ్లికన్ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను సంపూర్తిగా అపహరించటానికి ఇవి ఉద్దేశితమైనాయి. సైనిక విచారణ తతంగం మరీ నిదానంగా సాగుతున్నట్లుగా భావించి, దానిని శీఘ్రతరం చేశాడు. అనుమానస్తులను ప్రవాసం పంపించేందుకు విపరీతాధికారాలను ఇచ్చే శాసనం చేశాడు. వీటి ద్వారా పారిస్ భవిష్యత్తును అతడు ముందుగానే నిర్ణయించాడు. రాజకీయ నేరాలకు ఉరిశిక్షను రద్దుచేస్తూ దాని బదులు, ప్రవాసానికి పంపే చట్టాన్ని 1848 విప్లవం చేసింది. లూయిా బోనపార్టీ, కనీసం సిద్ధాంతరీత్యా ఐనా, బహిరంగ ఉరికంబాన్ని పునరుద్ధరించటానికి సాహసించలేదు. పారిస్ పౌరులు హంతకులు తప్ప తిరుగుబాటుదారులు కాదని రూరల్ అసెంబ్లీసైతం సూచన ప్రాయంగానైనా చెప్పటానికి సాహసించలేదు. కనుక తన ప్రతీకారాన్ని దూఫారే యొక్క కొత్త ప్రవాస నిబంధనలకు మాత్రమే పరిమితం చేయక తప్పింది కాదు. ఈ అన్ని పరిస్థితులలో, థయర్స్ సైతం, తన రాజీ కపట నాటకాన్ని కొనసాగించలేకపోయాడు. రూరల్స్ ఈ కాపట్యాన్ని ఆగ్రహంతో కోలాహలంగా వ్యతిరేకించారు. వారి మందబుద్ధికి, ఈ కుట్రలు మోసం రెండు నాల్కల ధోరణి, మొసలి కన్నీళ్ళు కురిపించటం.... ఇదంతా అవసరమని తోచలేదు.

ఏప్రిల్ 30 మునిసిపల్ ఎన్నికలు ముంచుకొస్తుండగా, థయర్స్ తన రాజీ నాటకంలో ఒక గొప్ప అధ్యాయాన్ని ప్రదర్శించాడు. తెచ్చిపెట్టుకున్న సానుభూతితో కూడిన మహోపన్యాసం చేస్తూ అసెంబ్లీ వేదికపై నుండి ఇలా ప్రసంగించాడు : "రిపబ్లిక్ వ్యతిరేక కుత్ర ఏదీలేదు. పారిస్ ఒక్కటే కుట్ర చేస్తున్నది. కనుక మేము ఫ్రెంచి రక్తాన్ని చిందించవలసి వస్తున్నది. నేను ఈ విషయాన్ని పదేపదే చెబుతున్నాను. ఆయుధాలు ధరించినవారు తిరుగుబాటుతో అపవిత్రమైన చేతులనుండి ఆయుధాలను క్రింద పడవేయండి. అప్పుడు కొద్దిమంది నేరస్తులపై మినహా మిగతావారిపై ఎట్టి శిక్ష ఉండదు. శాంతి ఒప్పందం వెంటనే జరుగుతుంది." రూరల్స్ కోలాహలంగా అడ్డు తగులుతూ గలభా చేయగా అతడిలా సమాధానం చెప్పాడు : "పెద్ద మనుషులారా

చెప్పండి. నా తప్పు ఏదైనా ఉందా! మిమ్ములను వేడుకుంటున్నాను. నేరస్తులు కొద్దిమంది మాత్రమేనని నిజం చెప్పి నందుకు మీరు నిజంగా విచారిస్తున్నారా? మన దురదృష్టకర పరిస్థితులలో కొద్దిపాటి అదృష్టం లభించింది. క్లెమెంట్ థామస్, జనరల్ లేకామ్టెల నెత్తురు చిందించిన నేరస్తులు కొద్దిమంది మాత్రమే కావటం మన అదృష్టం కాదా?"

థయర్స్ చేసిన ఆత్మోత్కర్షపూరిత ప్రసంగ గేయాన్ని. ఫ్రాన్సు వినిపించుకోనేలేదు. ఫ్రాన్సులో మిగిలిపోయిన 35 వేల కమ్యూన్లు 7 లక్షల మునిసిపల్ కౌన్సిలర్లను ఎన్నుకోగా, వారిలో యునైటెడ్ లెజిటిమిస్టులు. ఆర్లియనిస్టులు బోన పార్టీస్టులు 8 వేల మందికంటె ఎక్కువ లేరు. తర్వాత జరిగిన అనుబంధ ఎన్నికలు మరింత వ్యతిరేక ఫలితాల నిచ్చాయి. ఆ విధంగా రాష్ట్రాలనుంచి ఎంతో ఎదురు చూసిన భౌతిక తోడ్పాటు లభించకపోగా, జాతీయ శాసనసభ దేశం యొక్క సార్వజనీన వోటింగ్ ఫలితంగా ఎన్నికైనదని చెప్పుకునే నైతిక బలానికి గల తన ఆఖరు హక్కును కూడా కోల్పోయింది. ఈ దురవస్థను పూర్తి చేయటానికి గాను, ఫ్రాన్సులోని అన్ని నగరాలకు చెందిన కొత్తగా ఎన్నికైన మునిసిపల్ కౌన్సిలర్లు, వర్సేల్స్ శాసన సభకు, పోటీగా, బోర్డోలో పోటీ శాసన సభకు ఏర్పరచారు.

అప్పటికి బిస్మార్క్‌కు చాలా కాలంగా ఎదురు చూస్తున్న నిర్ణయాత్మక అవకాశం లభించింది. శాంతి సంధిపై వెంటనే సంతకం పెట్టే హక్కు గల ఉన్నతాధికారులను ఫ్రాంక్ ఫర్టుకు వెంటనే పంపవలసిందిగా బిస్మార్క్, థయర్స్‌కు ఆదేశించాడు. తన యజమాని ఆదేశానికి వినయంతో తలఒగ్గి, తనకు నమ్మకస్తుడైన జూల్స్‌ఫెవ్రేను, పోయర్ క్వెర్టియర్‌ను తోడిచ్చి థయర్స్ పంపించాడు. పోయర్ క్వెర్టియర్ ధూయన్‌కు చెందిన ప్రముఖ నూలు పారిశ్రామికుడు. రెండవ సామ్రాజ్యానికి అణగి మణగి ఉండే, బానిస వంటివాడు. రెండవ సామ్రాజ్య వ్యవహారాలలో అతనికి ఏ దోషం కనపడలేదు. ఒక్క అంశం మినహా అదేమంటే తన స్వంత పరిశ్రమ హానికరంగా ఇంగ్లాండుతో వ్యాపార ఒప్పందం చేసుకోవటం. బోర్డోలో థయర్స్ యొక్క వాణిజ్య మంత్రిగా పదవీ బాధ్యత స్వీకరించిన వెంటనే, అతడు పైన వివరించిన 'అపవిత్ర' ఒప్పందాన్ని తిరస్కరించాడు. దానిని రద్దు చేస్తానన్నాడు. అంతేకాదు. ఆల్సేక్‌కు వ్యతిరేకంగా వెనుకటి రక్షణ సుంకాలను విధిస్తానని బెదరించాడు. అందుకు అంతర్జాతీయ ఒప్పందాలేవీ అడ్డురావన్నాడు. అయితే ఇదంతా బూకరింపే. ఏమంటే అవతల బిస్మార్కు ఉన్నాడనే సంగతి అతడు మరచిపోయాడు. రూయన్ కార్మికుల వేతనాలు తగ్గించటానికి ప్రతీఘాత విప్లవం ఒక సాధనగానూ, ఫ్రాన్స్‌లో తన సరుకుల ధరల పెరగటానికి ఫ్రెంచి రాష్ట్రాలను జర్మనీకి అప్పగించటం ఒక మార్గంగానూ,

భావించిన ఈ వ్యక్తి థయర్స్ తలపెట్టిన అంతిమ లొంగుబాటుకు, జూల్స్ ఫేవ్రేకు తోడుగా ఉండవలసిన వాడే కదా?

ఈ అద్భుతమైన ఉన్నతాధికారద్వయం, ఫ్రాంక్‌ఫర్ట్ చేరిక వెంటనే, బిస్మార్క్ తన సహజమైన బెదరింపు పద్ధతిలో వారికి ఒకే అగౌరవకరమైన ప్రత్యామ్నాయాన్ని తెలియ జేశాడు. సామ్రాజ్య పునరుద్ధరణ, లేక తన శాంతి ఒప్పందాలను బేషరతుగా ఆమోదించటం. ఈ షరతులలో ఒకటి. యుద్ధ పరిహారాలను చెల్లించే కాల వ్యవధిని తగ్గించటం, ఫ్రాన్సులో పరిస్థితులు బాగు పడ్డాయని బిస్మార్క్‌కు నమ్మకం కలిగే వరకూ, పారిస్ శివార్లలోని బురుజులను ప్రష్యన్ సైన్యాలు ఆక్రమించుకోవటం. ఆ విధంగా ఫ్రెంచి రాజకీయాలలో అంతిమ నిర్ణేతగా ప్రష్యాను గుర్తించాలి. ఇందుకు బదులుగా, బిస్మార్క్ పారిస్‌ను నాశనం చేసేందుకుగాను. తన వద్ద యుద్ధఖైదీలుగా ఉన్న బోనపార్టిస్టు సైన్యాన్ని విడుదల చేస్తాడు. వారికి సరాసరిగా, విలియం చక్రవర్తికి చెందిన సైనిక దళాలను తోడిస్తాడు. తన మాటపై విశ్వాసం కలగటానికిగాను, బిస్మార్క్ ఒక సౌకర్యం ఇచ్చాడు. యుద్ధ పరిహారంలో మొదటి వాయిదా చెల్లింపు, పారిస్ "ప్రశాంతీకరణ" పూర్తి అయిన తర్వాత ఇవ్వవచ్చు. ఈ ఎరను థయర్స్ అతని ఉన్నతాధికార ప్రతినిధులు వెంటనే స్వీకరించారు. మే 10వ తేదీన వారు శాంతిసంధిపై సంతకం చేశారు. 18వ తేదీన వర్సేల్స్ శాసనసభచే ఆమోదింప చేశారు.

శాంతి ఒప్పందం జరిగి బోనపార్టిస్టు ఖైదీల విడుదల జరిగే మధ్య కాలంలో, థయర్స్ తిరిగి తన రాజీనాటకం ప్రారంభించాడు. పారిస్‌పై తాము తలపెట్టిన సామూహిక హత్యాకాండకు ముందుగా ఏదో ఒక సమర్థన అతని రిపబ్లిక్ సేవకులకు అవసరమైంది. మే 8వ తేదీన, మధ్యతరగతికి చెందిన ఒక రాజీ బృందానికి థయర్స్ ఇలా సమాధానం చెప్పాడు. "తిరుగుబాటుదారులు లొంగుబాటుకు అంగీకరించి, పారిస్ ద్వారాలు ఒక వారం రోజులపాటు, క్లెమెంట్ థామస్, లేకామ్టెల హంతకులకు తప్ప, మిగతా అందరికీ తెరిచే ఉంటాయి".

కొద్దిరోజుల తర్వాత, ఈ వాగ్ధానాలను గురించి, రూరల్స్ గట్టిగా ఎదురు ప్రశ్నలు వేయగా, థయర్స్ ఎట్టి సమాధానం ఇవ్వటానికీ నిరాకరించాడు. అయితే అర్థవంతమైన ఒక సూచన మాత్రం చేశాడు. "మీలో ఓర్పులేనివారు కొందరున్నారు. చాలా తొందర పడేవారు కొందరున్నారు. ఆ విషయం మీకు చెప్పదలచాను. అలాంటివారు మరొక 8 రోజులు ఆగాలి, ఆ ఎనిమిది రోజుల తర్వాత ఎట్టి ప్రమాదం ఉండదు. వారి ధైర్యానికి, సామర్థ్యానికి తగిన విధంగానే ఆనాటి కర్తవ్యం ఆధారపడి ఉంటుంది." ఇక మీరు పారిస్‌లో ప్రవేశించవచ్చును అని మాక్‌మోహన్ హామీ

ఇచ్చిన వెంటనే థియర్స్ శాసనసభలో ఇలా అన్నాడు. "నేను చట్టాన్ని ఒక చేత్తో పట్టుకుంటాను. సైనికులు జీవితాలను అంతం చేసి, పౌర భవనాలను ధ్వంసం చేసిన దుర్మార్గుల నుండి ప్రాయశ్చిత పరిహారాన్ని గుంజుతాను." "నేను నిర్దాక్షిణ్యంగా వ్యవహరించ దలచాను" పారిస్ ఇక ధ్వంసమైపోతుంది. బోనపార్టిస్టు హంతకులు ఇక తమ ఇష్టానుసారం పారిస్‌ను దోపిడీ చేసి మనసారా, ప్రతీకారం తీర్చుకోవచ్చు. అందుకు ప్రభుత్వం అనుమతిస్తున్నది. చివరకు విద్రోహం ఫలితంగా, మే 21న, పారిస్ గేట్లు తెరవబడ్డాయి. జనరల్ దూయే నగరంలో ప్రవేశించాడు. మే 22న తన రాజీకపట నాటకం లక్ష్యం ఏమిటో థియర్స్ రూరల్స్‌కు తెలియజేశాడు. "మన లక్ష్యాన్ని సమీపించనున్నామని మీకు కొద్ది రోజుల క్రితమే తెలియజేశాను. లక్ష్యాన్ని చేరుకున్నాము. అని ఈ రోజున మీకు చెప్పదలచుకున్నాను. భద్రత, న్యాయం, నాగరికత చిట్టచివరకు విజయం సాధించాయి." ఈ రహస్యాన్ని ఇంత కాలం రూరల్స్ మొండిగా గ్రహించలేకపోయారు.

ఆ విధంగా కథ ముగిసింది. బానిసలు, పతితులు యజమానులపై ఎదురు తిరిగిన నాడు, బూర్జువా వ్యవస్థ నాగరికతా, న్యాయాలు నగ్నరూపంలో వెల్లడి ఔతాయి. ఈ నాగరికతా న్యాయాలు, ఎట్టి ముసుగులేని కర్కశత్వానికి, చట్ట రహితమైన ప్రతీకార వాంఛకు తార్కాణమౌతాయి. ఉత్పత్తిదారునికి, సంపదను స్వాహాచేసే పరాన్న భుక్కుకు జరిగే వర్గపోరాటంలో ప్రతి నూతన సంక్షోభం, ఈ వాస్తవాన్ని మరింత స్పష్టంగా బైటపెడుతుంది. 1871 అమానుష హత్యాకాండతో పోలిస్తే 1848 జూన్‌లో బూర్జువావర్గం సాగించిన దారుణాలు స్వల్ప విషయాలు అవుతాయి. వర్సేల్స్ సైన్యాలు పారిస్‌లో ప్రవేశించిన తర్వాత పారిస్ స్త్రీలు, పురుషులు, పిల్లలు 8 రోజులపాటు అపారమైన త్యాగంతో, ధైర్య సాహసాలతో పోరాడారు. వారి లక్ష్యం ఎంతటి ఉన్నతమైనదో వారి ప్రతిఘటనే చిహ్నం. వర్సేల్స్ సైనికులు నగరంలో సాగించిన అమానుష హత్యాకాండ, ఈ కిరాయి మూకలు ప్రాతినిధ్యం వహించే నాగరికతలోని పాశవికత్వాన్ని వెల్లడిస్తుంది. యుద్ధం అయిన తర్వాత మృతులశాల గుట్టలను తొలగించటమే ఒక పెద్ద సమస్యగా చేసిన నాగరికత ఎలాంటిదో చెప్పనక్కరలేదు.

థియర్స్, అతని కిరాయి మూకలు సాగించిన హత్యాకాండకు పోలిక చెప్పదలచుకుంటే, రోమ్‌లో, సుల్లా, త్రిమూర్తి పాలకులలోని మిగతా ఇద్దరు సాగించిన హత్యాకాండను ఉదహరించాలి. అదే విధంగా, పెద్దఎత్తున పనిగట్టుకుని పౌరులను హత్యచేశారు. వయస్సును, స్త్రీ పురుష విభేదాన్ని ఏమాత్రం పాటించలేదు. ఖైదీలను అదే విధంగా చిత్రహింసల పాల్జేశారు. అదే విధమైన నిషేధాలు విధించారు. అయితే ఈ సారి ఒక మొత్తం వర్గంపై నిషేధాలు అమలు జరిగాయి. రహస్యంగా దాక్కున్న

నాయకుల కొరకు ఏ ఒక్కడూ తప్పించుకోగూడదనే కక్షతో పైశాచికమైన వేట జరిగింది. రాజకీయ శత్రువులను వ్యక్తిగత శత్రువులను అదే విధంగా తీవ్రంగా దూషణలతో ఖండించారు. తగాదాతో ఏమాత్రం సంబంధంలేని అమాయకుల పట్ల సైతం అదే విధమైన పైశాచిక హత్యాకాండ జరిగింది. అయితే ఒకటే తేడా. ఆనాటి రోమన్లకు నిషేధ వ్యక్తులను మొత్తంగా హత్య చేయటానికి భారీ ఫిరంగులు లేవు. "చట్టాన్ని వారు తమ చేతుల్లో" పెట్టుకోలేదు, తమ పెదవులపై 'నాగరికత' శబ్దాన్ని ఉచ్చరించలేదు.

ఈ దౌర్జన్యాలన్నీ జరిగిన తర్వాత అంతకంటే అసహ్యమైన దేమంటే బూర్జువా నాగరికతను వారి పత్రికలే వర్ణించిన తీరు.

లండన్ టోరీ పత్రిక పారిస్ విలేఖరి ఇలా వ్రాస్తున్నాడు. "దూరంగా అక్కడక్కడ తుపాకుల ధ్వనులు వినిపిస్తున్నాయి. గాయపడిన వారు పెరీలాచే (Pere la Chaise) శ్మశాన వాటికలో దిక్కూ మొక్కూ లేకుండా మరణిస్తున్నారు. భయభ్రాంతులైన 6వేల మంది తిరుగుబాటు దారులు గోరీల మాటున నిరాశోప హతులై సంచరిస్తున్నారు. చేతికందిన దిక్కుమాలిన తిరుగుబాటుదారులను గుంపులుగా, వీధులలో తరలించి, భారీఫిరంగులకు ఎరజేస్తున్నారు. ఒక వైపున ఇలా ఉండగా హోటళ్ళలో, క్లబ్బులలో, బిలియర్డ్సు, పాచికలు తదితరమైన వినోదాలతో విలాస పురుషులు, స్త్రీలు కాలక్షేపం చేస్తున్నారు. ఉద్యాన వాటికల చాయలలో స్త్రీలు విశృంఖలంగా ప్రవర్తిస్తున్నారు. విలాసవంతమైన హోటళ్ళలో రాత్రంతా జరిగే వినోద క్రీడల సవ్వడులు రాత్రి ప్రశాంతతను భంగపరుస్తున్నాయి." కమ్యూన్ నిషేధించిన వెర్సైలిస్టు పత్రిక జర్నల్ డి పారిస్‌లో ఎడురాడ్ ఫెర్వే యిలా రాస్తున్నాడు. "పారిస్ ప్రజలు సంతృప్తిని వ్యక్తం చేసిన తీరు అత్యంత బాధ్యతా రహితంగా, జుగుప్సాకరంగా ఉంది. రోజు రోజుకు ఈ ధోరణి తీవ్రమయ్యే సూచనలున్నాయి. పారిస్ పండుగ రోజుల్లో ఉన్నట్లు ఉంది. యిది ఏ మాత్రం సందర్భోచితంగా లేదు. పతనావస్థలోని పారిస్ పౌరులు అని పిలిపించ దలచుకుంటే తప్ప ఇలాంటి దృశ్యాలు కొనసాగరాదు." పిమ్మట టానిటస్ నుండి ఈ క్రింది వాక్యాలను ఉల్లేఖిస్తున్నాడు. "దారుణమైన ఆ పోరాటం జరిగిన మర్నాడు, ఇంకా ఆ పోరాటం పూర్తి కాక ముందే, రోమ్ నగరం తిరిగి తన శృంగార లీలల ఊబిలో కూరుకు పోసాగింది. అవినీతితో పతనమై పోయింది. ఈ ప్రవర్తన ఆ నగరం దేహాన్ని వినాశనమూ, ఆత్మను అపవిత్రం చేస్తున్నది. (ఈ మూల పోరాటాలు, గాయాలు, ఆమూల సాముదాయక స్నానాలు, హోటళ్ళలో వినోదాలు), 'పారిస్ జనాభా' అంటే కేవలం, థయర్స్‌కు చెందిన పారిస్ జనాభా అని చెప్పటం మాత్రమే హెర్వే మరచిపోయాడు. వర్సెల్స్, సెయింట్‌డెనిస్, రూయాల్, సెయింటు జర్మనీ నుండి పారిస్‌కు తిరిగి వచ్చిన ఉన్నత శ్రేణి ఫ్రెంచి పతితులు."

నూతనమూ, ఉన్నతమూ ఐన సమాజ నిర్మాణం కొరకు ఆత్మ త్యాగంతో పోరాడిన వీరులపై రక్తపాతంతో కూడిన విజయం సాధించిన అపవిత్రమైన నాగరికత, కార్మికుల దోపిడీపై ఆధారపడిన నాగరికత, పరాజితులు హాహాకారాలను, ఆక్రందనలను, ప్రపంచ వ్యాపిత దుష్ప్రచార ఝంఝూరవంతో, వినపడకుండా చేసింది. శ్రమజీవుల కమ్యూన్‌కు చెందిన ప్రశాంత గంభీరమైన పారిస్, ఒక్కసారిగా శాంతి భద్రతల స్థాపన వేటకుక్కలతో అల్లకల్లోలమై పోయింది. ఈ బ్రహ్మాండమైన మార్పును వివిధ దేశాలలోని బూర్జువా మేధావులు ఎలా భావించారు? నాగరికతకు వ్యతిరేకంగా కమ్యూన్ కుట్ర చేసింది అని వారి భావన. చరిత్రలో ఏ పోరాటంలోనూ చనిపోనంత పెద్ద సంఖ్యలో పారిస్ ప్రజలు, కమ్యూన్ రక్షణకొరకు వీరోచితంగా ప్రాణాలర్పించారు. ఇది ఏమి నిరూపిస్తున్నది? కమ్యూన్ ప్రజల ప్రభుత్వం కాదని, కొద్దిమంది నేరస్తులు కుట్రద్వారా స్వాధీనం చేసుకున్న ప్రభుత్వమని; పారిస్ స్త్రీలు, కాట్రగడలవద్ద వధ్యస్థలాల వద్ద, కమ్యూన్ కొరకు సంతోషంతో తమ ప్రాణాలర్పిస్తున్నారు. ఇది ఏమితెలియ జేస్తున్నది? కమ్యూన్ రాక్షసులు స్త్రీల నందరినీ, పిశాచాలుగా మార్చి వేశారని! రెండు నెలలపాటు అధికారంలో ఉన్న కమ్యూన్ ప్రదర్శించిన నిగ్రహం, దాని రక్షణకై అది ప్రదర్శించిన ధైర్య సాహసాలతో మాత్రమే సరితూగుతుంది. ఇది ఏమి నిరూపిస్తున్నది? నెలల తరబడి, కమ్యూన్, నిగ్రహం, మానవత్వం ముసుగులో, దాని పైశాచిక రక్తపిపాపసను దాచిపెట్టుకుని, ఒక్కసారిగా కష్టకాలంలో వెళ్ళ గ్రక్కుతున్నదని.

సాహసోపేతంగా ఆత్మరక్షణ చేసుకుంటున్న పారిస్ శ్రమజీవులు, తమ భవనాలను, ప్రాచీన స్మృతి చిహ్నాలను తామే దగ్ధం చేశారు. ఈ శిల్ప సంపద అంతా తిరిగి వర్సేల్స్ పాలకుల చేత పడరాదనే వారి సంకల్పం. దానిని వర్సేల్స్ ప్రభుత్వం 'దహనకాండ' అని పేరు పెట్టుతున్నది. ఈ దుష్ప్రచార రహస్యాన్ని గ్రామ గ్రామానికి. పేట పేటకు వ్యాపింప చేసింది. తన శత్రువులను వేటాడి, వారందరినీ గృహ దహనాలే వృత్తిగా కలిగిన నేరస్తులుగా చిత్రించాలని దాని సంకల్పం. యావత్ప్రపంచంలోని బూర్జువావర్గం, యుద్ధానంతరం జరిగిన సామూహిక హత్యాకాండ సంగతి పట్టించుకోనేలేదు. కాని సున్నం, ఇటుకలు ధ్వంసమైనందుకు మాత్రం హాహాకారాలు చేసింది.

తన సైనికులకు ప్రభుత్వం చంపటానికి, తగల పెట్టటానికి, నాశనం చేయటానికి ప్రభుత్వ లైసెన్సు జారీ చేస్తే అది హత్యాకాండ కాకుండా పోతుందా! వాషింగ్టన్‌లోని కాపిటల్‌ను ఉద్దేశపూర్వకంగా బ్రిటిష్ సైనికులు దగ్ధం చేయటం. చైనా చక్రవర్తి గ్రీష్మ ప్రాసాదాన్ని తగల బెట్టడం, విధ్వంసకాండ కాదా? ప్రష్యన్లు

సైనిక అవసరాలేవీ లేకుండానే, కేవలం కక్ష తీర్చుకునేందుకు, పెట్రోలు పోసి చాతిడన్ లాంటి పట్టణాలను, అసంఖ్యాకమైన గ్రామాలను తగలబెట్టటం తన లక్ష్యమనే సాకుతో, థయర్స్ ఆరు వారాలపాటు పారిస్‌పై గుండ్ల వర్షం కురిపించటం విధ్వంసకాండ కాదా? యుద్ధం, ఇతర ఆయుధాలవలెనే, నిప్పుకూడా ఒక చట్టబద్ధమైన ఆయుధం. శత్రువులు ఆక్రమించుకున్న భవనాలకు నిప్పు పెట్టటానికి తుపాకి గుండ్లు కురిపిస్తారు. ఆ భవన రక్షకులు, ఖాళీ చేయదలచుకుంటే, దాడి చేసేవారి చేతుల్లోకి ఆ భవనాలు పడకుండా ఉండేందుకు. వారే ఆ భవనానలను అగ్నికి ఆహుతి చేస్తారు." ప్రపంచంలో సైనిక శ్రేణుల ముందు వరుసలో ఉండే భవనాలన్నీ అనివార్యంగా దగ్ధం చేయబడుతూనే ఉన్నాయి. కాగా బానిసలు బానిస యజమానులపై చేసే యుద్ధంలో. నిజానికి ఈ యుద్ధం ఒక్కటే న్యాయమైనది. ఈ విధంగా చేయటం మాత్రం సరికాదట కమ్యూన్ అగ్నిని కేవలం ఆత్మరక్షణ సాధనంగా వాడుకున్నది. హోసమన్‌గేట్లు తెరిచిన మీదట. వర్సేల్స్ సేనలు, విశాలమైన వీధుల గుండా తుపాకి గుండ్లవర్షం కురిపించకుండా ఉండేందుకు. వారు అగ్ని ఆయుధాన్ని వాడుకున్నారు. వర్సేల్స్ సేనలు ముందుకు సాగడానికి అగ్నిని వాడుకుంటే, కమ్యూన్ సేనలు వెనక్కు ఉపసంహరించు కోవటానికి అగ్నిని వాడుకున్నారు. కమ్యూన్ సేనల అగ్నివలన ఎన్ని భవనాలు దగ్ధమయ్యాయో, వర్సేల్స్ సేనల తుపాకి గుండ్లుద్వారా అన్ని భవనాలు దగ్ధమయ్యాయి. ఏ భవనాలను దాడి సేనలు దగ్ధం చేశాయి, ఏ భవనాలను ఆత్మరక్షణ సేనలు దగ్ధం చేశాయి. అన్నది నేటికీ వివాదాస్పద సమస్యగానే ఉంది. వర్సేల్స్ సేనలు, తమ యుద్ధ ఖైదీలను మూకుమ్మడిగా హత్య చేయటం ప్రారంభించిన మీదటనే కమ్యూన్ అగ్ని ఆయుధాన్ని వాడుకున్నది. అంతేకాదు కమ్యూన్ అంతకు ముందే ఒక బహిరంగ ప్రకటన చేసింది. తీవ్ర పరిస్థితి గనుక ఎదురైతే తాము పారిస్ శిథాలాల్లో చనిపోతామని పారిస్‌ను మరో మాస్కో చేస్తామని అన్నారు. ప్రభుత్వం కూడా తన మోసానికి ముసుగుగా ఈ వాగ్దానమే చేసింది. ఇందుకవసరమైన పెట్రోలునుకూడా ట్రోచూ జాగ్రత్త పెట్టాడు. పారిస్ పౌరుల జీవితాలపట్ల తన శత్రువులకే మాత్రం లక్ష్యం లేదని తమ పారిస్ భవనాలపట్ల మాత్రమే వారికి ఆసక్తి ఉన్నదని కమ్యూన్‌కు తెలుసు. మరొక వైపున, ప్రతీకార చర్యల విషయంలో తాను అతి కఠినంగా ఉంటానని థయర్స్ ముందుగానే చెప్పాడు. సైన్యం తన వైపున సంసిద్ధమైన తర్వాత, రెండో వైపున బైటికి పారిపోయే ద్వారాలన్నిటినీ ప్రష్యన్లు మూసివేసిన మీదట, అతడు ఇలా అన్నాడు. "నేను నిర్దాక్షిణ్యంగా ఉండబోతున్నాను. ప్రతీకారం సంపూర్ణంగా అమలు జరుగుతుంది. న్యాయం అత్యంత కఠోరంగా ఉంటుంది." పారిస్ శ్రమ జీవుల చర్యలు విద్రోహ చర్యలే ఐనట్లయితే అవి తెగింపుతో

ఆత్మరక్షణ చేసుకుంటున్న వారి విద్రోహచర్యలు; విజేతల విద్రోహచర్యలు కావు. అమూల్యమైన ప్రాచీన హేతెన్ కళాఖండాలపై, పూర్వకాలపు క్రిస్టియన్లు జరిపిన విద్రోహ చర్యలలాంటివికావు ఆ విద్రోహ చర్యలను సైతం చరిత్రకారులు సమర్థించారు. శిథిలమౌతున్న పాత సమాజానికి, ఆవిర్భవిస్తున్న నూతన సమాజానికి జరిగే భయంకర పోరాటంలో ఈ విద్రోహం అత్యల్ప విషయంగా వారు జమకట్టారు. చరిత్రాత్మకమైన పారిస్‌ను కూలగొట్టి, విలాస యాత్రికులకు పారిస్‌ను ఆకర్షణీయంగా చేసిన హాస్‌మన్, విద్రోహచర్యకంటె ఇది తక్కువైనదే.

అయితే, పారిస్ ఆర్చిబిషప్ నాయకత్వానగల 64 మంది యుద్ధ ఖైదీలను కమ్యూన్ హతమార్చిందిగదా, దాని సంగతేమిటి? జూన్ 1848న, బూర్జువా వర్గం, దాని సైన్యం ఒక ఆచారాన్ని, ఏనాడో అదృశ్యమైన ఆచారాన్ని పునరుద్ధరించింది. నిరాయుధులైన యుద్ధ ఖైదీలను కాల్చిచంపటం, ఈ దారుణమైన ఆచారం ఆనాటినుండి, యూరపులోను, ఇండియాలోను ప్రజా ఉద్యమాలను అణచివేసిన దోపిడీదారులందరూ, దాదాపు ఖచ్చితంగా పాటిస్తూ వచ్చారు. “నాగరికతలో ఇది పురోగతి” అని తద్వారా వారు నిరూపించారు. మరొకవైపున, ప్రష్యన్లు, ఫ్రాన్సులో మరో ఆచారాన్ని పునః స్థాపించారు. అమాయకులైన వారిని ఖైదుచేసి, ఇతరుల చర్యలకు వీరి ప్రాణాలను బలి ఇవ్వటం. పైన మనం తెలుసుకున్నట్లు, థయర్స్ మొదటినుండి తన చేజిక్కిన కమ్యూన్ ఖైదీలను కాల్చివేసే ‘మానవతా’ వైఖరిని చేపట్టాడు. అప్పుడు కమ్యూన్ ఖైదీల జీవితాలను రక్షించేందుకుగాను, బందీలను స్వాధీనం చేసుకునే ప్రష్యన్ ఆచారాన్ని అనుసరించవలసి వచ్చింది. వర్సేల్స్ పదేపదే ఖైదీలను కాల్చివేయటంతో ఈ బందీల జీవితం పదేపదే వారు పోగొట్టుకుంటూనే ఉన్నారు. మాక్‌మోహన్ ఆధ్వర్యాన వర్సేల్స్ సేనలు పారిస్ నగరంలో ప్రవేశించి హత్యాకాండ ప్రారంభించిన తర్వాత ఇక బందీల జీవితం ఎలా కాపాడుతుంది? బూర్జువా ప్రభుత్వాల నిస్సంకోచ రాక్షసత్వంపై ఆఖరు అదుపుగా ఉన్న, బందీలను తీసుకునే పద్ధతి కూడా అపహాస్యం పాలు కావలసిందేనా? ఆర్చిబిషప్ డార్బాయి నిజమైన హంతకుడు థయర్స్. థయర్స్ తన చేతిలో ఉన్న ఒక్క బ్లాంక్విని వదలివేస్తే, ఆర్చిబిషప్‌ను, ఇంకా అనేకమంది మతగురువులను విడుదల చేస్తామని కమ్యూన్ పదేపదే ప్రకటించింది. థయర్స్ మొండిగా నిరాకరించాడు. బ్లాంక్విని వదిలితే, కమ్యూన్‌కు ఒక మెదడు ఇచ్చినట్లు అవుతుందని థయర్స్‌కు తెలుసు. తనకు కావలసింది ఆర్చిబిషప్ శవం. అదే అతని ప్రయోజనానికుపయోగపడుతుంది. కవైనాక్ సాంప్రదాయాన్ని థయర్స్ అనుసరించాడు. జూన్ 1848లో కవైనాక్ అతని ఆర్డర్‌కు చెందిన వ్యక్తులు, తిరుగుబాటుదారులు ఆర్చిబిషప్ అఫ్రేను చంపివేశారని గగ్గోలు

పెట్టలేదా: ఆర్చిబిషప్‌ను ఆర్డర్‌కు చెందిన సైనికులే కాల్చి వేశారని వారికి స్పష్టంగా తెలుసు. కాల్పుల సమయంలో అక్కడే ఉన్న ఆర్చిబిషప్ అంగరక్షకుడు జాక్విమెట్, ఈ విషయాన్ని వెన్వెంటనే తన సాక్ష్యంలో పేర్కొన్నాడు కూడా.

ఒక వైపున రక్తం చిందిస్తూనే, విజితులపై పార్టీ ఆఫ్ ఆర్డర్ నిరంతరాయంగా ఈ దుష్ప్రభావ వర్షం కురిపిస్తూనే ఉంది. ఒకే విషయాన్ని ఇది నిరూపిస్తున్నది. మన కాలపు బూర్జువా వర్గం. పాతకాలపు భూస్వామ్య ప్రభువులకుతానే నిజమైన వారసురాలని భావిస్తున్నది. పేద ప్రజలపై ప్రయోగించడానికి ఏ ఆయుధాన్నయినా తాము వాడుకోవచ్చు; పేదలు ఏ ఆయుధాన్ని వాడినా అది మాత్రం మహానేరం.

విప్లవాన్ని, విదేశీ దురాక్రమణదారుని ప్రోత్సాహంతో, అంతర్యుద్ధంగా మార్చి ధ్వంసం చేయాలనేది పాలకవర్గం యొక్క కుట్ర. సెప్టెంబరు 4వ తేదీ నుండి. పారిస్‌లోకి సెంటీ క్లాడ్ ద్వారం గుండా మాక్ మోహన్ సేనలు ప్రవేశించేవరకు మనం ఈ కుట్ర పరిణామాన్ని పరిశీలించాము. ఇది పారిస్ దారుణ హత్యాకాండతో ముగిసింది. పారిస్ శిథిలమైనందుకు బిస్మార్క్ సంబరపడుతున్నాడు. 1849లో ప్రష్యన్ శాసనసభలో సాధారణ సభ్యుడుగా ఉన్నప్పటినుండి, పారిస్ లాంటి మహానగరాలు ధ్వంసం కావాలని అతడు ప్రార్థనలు చేస్తూ ఉన్నాడు. పారిస్ కార్మికవర్గం శవాలను చూసి అతడు సంబరపడుతున్నాడు. అతని దృష్టిలో, ఇది కేవలం విప్లవాన్ని అణచివేయటం మాత్రమే కాదు, ఫ్రాన్సునే నాశనం చేయటం. ఇప్పుడు ఫ్రెంచి ప్రభుత్వమే ఫ్రాన్సును నిర్వీర్యం చేసివైచింది. జయప్రదమైన రాజకీయ వేత్తలందరికీ ఉండే, మందబుద్ధితో అతడు, ఈ మహత్తర చారిత్రక ఘటనయొక్క ఉపరితలాన్ని మాత్రమే చూస్తున్నాడు. ఇంతకు ముందు చరిత్రలో ఎక్కడైనా విజేత, తాను జయించిన దేశానికి పోలీసు వానిగా వ్యవహరించటం మాత్రమేకాక ఓడిపోయిన ప్రభుత్వం పరాజయాలపై ఇంత నీచంగా సంబరపడిన వాడున్నాడా! ప్రష్యాకు పారిస్ కమ్యూన్‌ల మధ్య అసలు యుద్ధమే లేదు. తద్విరుద్ధంగా కమ్యూన్ ప్రాథమిక శాంతి షరతులను ఆమోదించింది. ప్రష్యా తన తటస్థతను ప్రకటించింది. కనుక ప్రష్యా యుద్ధంలో అసలు భాగస్వామి కాదు. అది ఒక కోతలరాయుడి పాత్రను. అందులోనూ పిరికిపంద ఐన ప్రగల్భాల రాయుడుపాత్రను నిర్వహించింది. ఏమంటే ప్రష్యాకు ఏ ప్రమాదమూ లేదు. పారిస్ పడిపోతే 500 మిలియన్లు ప్రష్యాకు చెల్లిస్తామని ముందుగానే ఫ్రెంచి ప్రభుత్వం ఒప్పందం చేసుకున్నది. కనుక డబ్బు కక్కుర్తితో కోతలరాయుడు పాత్ర వహించినవాడు బిస్మార్క్. ఈ విధంగా యుద్ధంయొక్క నిజస్వభావం ఎట్టకేలకు బహిర్గతమైంది. నాస్తికవాద భూయిష్టమైన, అవినీతికరమైన ఫ్రాన్సు దేశాన్ని, నీతివంతమూ, సాత్విక ప్రవృత్తి కలిగిన జర్మనీచే విధి శిక్షింప చేసింది. పాతకాలపు న్యాయవాదుల దృష్టిలో

కూడా, ఈ ప్రవర్తన అంతర్జాతీయ న్యాయ సూత్రాలకు విరుద్ధం. ఇట్టి ప్రవర్తన యూరపుకు చెందిన నాగరిక ప్రభుత్వాలకు ఆగ్రహం కలిగించిందా? సెంటో పీటర్స్‌బర్గ్ మంత్రివర్గపు చేతిలో తొత్తుగా పనిచేసిన ఇట్టి జిత్తులమారి ప్రష్యన్ ప్రభుత్వాన్ని జాతులనుండి బహిష్కరించారా? లేదు. పైపెచ్చు పారిస్ చుట్టూ విధించబడిన రెండు శ్రేణుల దిగ్బంధం నుండి ఎవరైనా పొరపాటున తప్పించుకుపోతే, వారిని వర్సేల్స్ ప్రభుత్వ కసాయి వాళ్ళకు స్వాధీనంపరచటం ఎలాగా అని వారు ఆలోచించసాగారు.

ఈ విధంగా ఆధునిక కాలంలో జరిగిన దారుణమైన యుద్ధం తర్వాత, విజేతలు, విజితులు ఇద్దరు, కార్మికవర్గాన్ని నాశనం చేసే ఉమ్మడి కుట్రలో భాగస్వాములైనారు. చరిత్రలోనే అపూర్వమైన ఈ ఘటన, బిస్మార్క్ ఊహించినట్లు, పైకి ఆవిర్భవిస్తున్న నూతన వ్యవస్థయొక్క శాశ్వత అణచివేతను సూచించదు. పాత బూర్జువా వ్యవస్థ మట్టిలో కలిసిపోతున్న విషయాన్ని నిరూపిస్తుంది. పాత వ్యవస్థ ఇప్పటికీ చేయగలిగిన మహత్కార్యం, జాతి క్షేమం కొరకు యుద్ధం చేయటం. ఇది కూడా ప్రభుత్వ పరమైన మోస కృత్యంగా ఇప్పుడు రుజువైంది. వర్గాల పోరాటాన్ని వాయిదా వేయటానికి ఇది ఉద్దేశితమైంది. ఆ వర్గ పోరాటం, అంతర్యుద్ధంగా ప్రజ్వరిల్లిన మరుక్షణం ఈ ముసుగును తోసిపారేస్తున్నది. వర్గపాలన ఇవే ఏమాత్రం జాతీయ వేషంలో దాగి ఉండలేదు. జాతీయ ప్రభుత్వాలన్నీ కార్మికులపట్ల ప్రవర్తించే విషయంలో ఒకే రకంగా వ్యవహరిస్తాయి.

1871, దారుణ హత్యాకాండ జరిగిన ఆదివారం తర్వాత, ఫ్రెంచి కార్మిక ప్రజలకు వారి సంపద దోచుకునేవారికి మధ్య శాంతిగాని ఒప్పందంగాని ఇక ఏ మాత్రం సాధ్యంకాదు. కిరాయి సైనికుల ఇనుప కౌగిలి కొంతకాలంపాటు రెండు వర్గాలను ఉమ్మడి దోపిడీకి లోనుచేయవచ్చు. కాని ఈ యుద్ధం ఆనాటికానాడు పెద్ద స్థాయిలో తిరిగి, తిరిగి బద్దలవుతూనే వుంటుంది. అంతిమ విజయం కొద్దిమంది దోపిడీదారులదా, అత్యధికులైన శ్రామికులదా? ఎవరిది అనేవిషయంలోనూ సందేహం లేదు. ఫ్రెంచి కార్మికవర్గం, ఆ ధనిక వర్గం యొక్క అగ్రశ్రేణి విభాగం మాత్రమే.

ఈ విధంగా పారిస్ ఎదుట యూరపియన్ ప్రభుత్వాలన్నీ, తమ వర్గపాలన యొక్క అంతర్జాతీయ స్వభావాన్ని నిరూపించుకున్నాయి. మరొక వైపున వీరే అంతర్జాతీయ కార్మిక సంస్థకు, పెట్టుబడియొక్క అంతర్జాతీయ కుట్రకు ప్రతిగా అంతర్జాతీయ ప్రతీఘాత సంస్థగా–నిందిస్తున్నారు. సర్వ అరిష్టాలకు మూలమైనట్లు నిందిస్తున్నారు. కార్మికుల విమోచన దాతగా నటిస్తూ, ఇది కార్మికులపై నియంత అని థయర్స్ దూషించాడు. ఫ్రెంచి అంతర్జాతీయ సంస్థకు, విదేశాలకుగల సంబంధాలన్నిటినీ తెంచివేయాలని పికార్డ్ ఉత్తర్వుచేశాడు. ఈ సంస్థను కూకటివేళ్ళతో

పెళ్ళగించటం, అన్ని నాగరక ప్రభుత్వాలకు పెద్ద సమస్య అని 1835లో థయర్స్‌కు నమ్మినబంటైన కౌంట్ జూబర్టు ప్రకటించాడు. రూరల్స్ ఈ సంస్థకు వ్యతిరేకంగా ఆక్రందనలు చేస్తున్నారు. యూరపు పత్రికా ప్రపంచం అంతా ఇందుకు వంత పాడుతున్నది. మన సంస్థకు పూర్తిగా పరాయివారైన గౌరవనీయుడైన ఒక ఫ్రెంచి వ్యక్తి ఇలా రాస్తున్నాడు. జాతీయ రక్షక దళ కేంద్ర కమిటీ సభ్యులు, కమ్యూన్ సభ్యులలో అత్యధికులు, అంతర్జాతీయ కార్మిక సంస్థలోని తెలివి కలిగిన, చురుకైన, ఉత్సాహపూరిత వ్యక్తులలో ముఖ్యులు. వీరు పూర్తిగా చిత్తశుద్ధి గలవారు. నిజాయితీపరులు, తెలివైన వారు, దీక్షాపరులు, పవిత్రులు సరైన అర్థంలో తమ విశ్వాసాలకు మొండిగా అంటిపెట్టుకొని వుండే వారు." పోలీసు మనస్తత్వంతో కలుషితమైన బూర్జువా బుద్ధికి, అంతర్జాతీయ కార్మిక సంస్థ ఒక కుట్రదారుల రహస్య సంస్థగా కనిపిస్తుంది. దాని కేంద్ర సంస్థ దఫదఫాలుగా, వివిధ ప్రాంతాలలో బాంబులు పేల్చవలసిందిగా ఉత్తర్వులు చేస్తూ వుంటుంది. నిజానికి నాగరిక ప్రపంచంలోని వివిధ దేశాల అభివృద్ధి చెందిన శ్రమజీవులకు మధ్య గల అంతర్జాతీయ అనుబంధం మన సంస్థ, అంతకంటే వేరేమీ కాదు ఎక్కడ ఏ రూపంలో ఏ పరిస్థితులలో వర్గపోరాటం ఏమాత్రమైనా స్థిరత్వాన్ని పొంది నట్లయితే మన సంస్థ సభ్యులు ఆ పోరాటం అగ్రశ్రేణిలో సహజంగానే నిలబడతారు. ఆధునిక సమాజం అనే భూమినుండే ఈ సంస్థ ఉద్భవిస్తున్నది. ఎంతటి హత్యాకాండతోనైనా ఈ సంస్థను నిర్మూలించటం సాధ్యంకాదు. దీనిని నిర్మూలించాలంటే, ప్రభుత్వాలు, కార్మికులపై పెట్టుబడిదారుల నియంతృత్వాన్ని నిర్మూలించాలి. ఈ నియంతృత్వం, వారి పరాన్నభుక్కుల జీవితానికి తొలి షరతు.

శ్రమజీవుల పారిస్, దాని కమ్యూన్‌తో సహా, నూతన సమాజపు వేగు చుక్కగా చిరస్థాయిగా నిలుస్తుంది. దాని మృతవీరులు కార్మిక వర్గ హృదయాలలో చిరస్థాయిగా నిలిచివుంటారు. దానిని నిర్మూలించినవారు, ఇప్పటికే వారి వధ్యశిలకు శాశ్వతంగా బంధించబడి ఉన్నారు. వారి మత గురువులు ఎన్ని ప్రార్థనలు చేసినా, వారికి విముక్తి లభించేది లేదు.

లండన్ 1871, మే 30



# అనుబంధం - 1

"ఖైదీల బృందం, ఎవెన్యూ యూరిచ్‌లో ఆగిపోయింది. వరుసకు నలుగురు, ఐదుగురు చొప్పున రోడ్డుకు ఎదురుగా ఉన్న కాలిబాటపై నిలచి ఉన్నారు. జనరల్ మార్క్విస్ డి గాలిఫేట్, అతని అనుచరులు, గుర్రాల మీది నుండి క్రిందికి దిగి, ఖైదీలను పరీక్ష చేయసాగారు. ఎడమ నుండి మొదలు పెట్టారు. నెమ్మదిగా నడుస్తూ, ఖైదీలను కంటితో చూస్తూ, సేనాని అక్కడక్కడ ఆగుతుండేవాడు. ఒక సైనికుని భుజంపై తట్టేవాడు. ఒకన్ని ముందుకు పిలిచే వాడు. చాలా సందర్భాలలో అలా వేరు చేయబడిన ఖైదీలను రోడ్డు మధ్యకు చేరి. ఒక అనుబంధపు వరుసను ఏర్పరచేవారు. ఇలా ఎన్నిక చేయటంలో సహజంగా కొంత పొరపాటుగా జరిగే అవకాశముంది. గుర్రము పైన ఉన్న ఒక సైనికుడు ఒక పురుషుడ్నో లేక స్త్రీనో ఏదో ఒక నేరంతో సంబంధ మున్నట్లుగా వేలితో చూపించేవాడు. వరుసలో నుంచి ఆ స్త్రీ పరిగెత్తుకుంటూ వచ్చి సేనా నాయకుని కాళ్ళపై వాలేది. చేతులు పైకెత్తి తాను నిర్దోషినని ఆవేశంతో మొత్తుకునిది. జనరల్ కొంచెంసేపు ఆగేవాడు. పిమ్మట ఏ మాత్రం చలనం లేని ముఖంతో కర్కశత్వం ఉట్టిపడే ధోరణిలో ఇలా అన్నాడు. "అమ్మా నేను పారిస్‌లో ప్రతి ఒక్క నాటకశాలను చూశాను. నీ నటన నాపై ఎట్టి ప్రభావాన్ని కలిగించదు... ఆ రోజున మిగతా ఖైదీల కంటె, పొడుగ్గానో శుభ్రంగానో ఎక్కువ వయస్సుతోనో లేక అసహ్యంగానో ఉండటం క్షేమం కాదు. ఒక వ్యక్తి ముక్కు పగిలిపోయి ఉండటం నేను గమనించాను. ఆ పగిలిన ముక్కు కారణంగానే అతనికి ఈ ప్రపంచ బాధల నుండి వెంటనే విముక్తి లభించింది. ఈ విధంగా ఒక వందమందిని ఎన్నుకొని, ఒక తుపాకి కాల్పుల పార్టీకి అప్పగించి, మిగతా ఖైదీలను ముందుకు నడిపించేవారు. కొద్ది నిమిషాల తర్వాత మా వెనుక నుండి పావుగంటసేపు తుపాకి గుండ్ల వర్షం వినిపించింది. తక్షణ శిక్షకు గురి చేయబడిన ఆ నిర్భాగ్యులు కాల్చివేయ బడ్డారు.(డైలీ న్యూస్[37] పారిస్ విలేఖరి, జూన్ 8).

ఈ సేనాని గలిఫెట్ - అతని భార్య ఇతన్ని ఉంపుడుకాడుగా మార్చి వేసింది-రెండవ సామ్రాజ్యంలోని అవమానకరమైన దురంతాల కంతా బాధ్యుడు. యుద్ధ కాలంలో "ఎన్ సైన్ పిస్టల్" పేరుతో వ్యవహరించ బడ్డాడు.

చాలా జాగ్రత్త గల పత్రిక ఐన టెంప్స్[38] అతిశయోక్తులు రాయటం అలవాటు లేని పత్రిక. పూర్తిగా మరణించకుండానే సమాధి చేయబడిన వారిని గురించి పూర్తిగా కాల్చకుండానే మృతులైనట్లు నెట్టివేయబడిన వారిని గురించి భయంకరమైన గాథను ఇలా వర్ణించింది: చాలా మందిని, సెంటు జాక్విస్-లా-బుచర్, చతురస్రం చుట్టూ, పైపైన సమాధి చేశారు. పగటి పూట వీధులలో ఉండే కోలాహలం ఫలితంగా ఏం జరుగుతున్నది తెలిసేది కాదు. కాని గాఢాంధకారపు ప్రశాంతతలో, చుట్టుపక్కల ఇండ్లవారు. దూరంగా ఏవో మూలుగులు వినేవారు. తెల్లవారేసరికి, భూమిలో నుండి, ఒక బిగించిన పిడికిలి పైకి పొడుచుకు వచ్చేది. ఫలితంగా శవాలను తవ్వి తీసివేశారు. చాలామంది గాయపడిన వారిని బతికి ఉండగానే సమాధి చేశారనే విషయంలో నా కెలాంటి సందేహమూ లేదు. ఒక్క ఉదంతం నేను ఖచ్చితంగా చెప్పగలను. ప్లేస్ వెండోంలోని ఒక భవనం వెనుక భాగంలో, బ్రూనెల్‌ను, అతని ప్రియురాలిని 24వ తారీఖున కాల్చివేశారు. 27వ తేదీ వరకు, ఆ శవాలు అలాగే ఉన్నాయి. శవాలను సమాధి చేయటానికి, మనుషులు రాగా, స్త్రీ ఇంకా బతికే ఉన్నట్లు గమనించి. ఆమెను అంబులెన్సు కారులో తీసుకుపోయారు. ఆమెకు నాలుగు తుపాకి గుండ్లు తగిలాయి. అయినా ఆమె ప్రమాదం నుండి బైట పడ్డది.(ఈవెనింగ్ స్టాండర్డు[39], పారిస్ విలేఖరి. జూన్ 8)



# అనుబంధం - 2

**జూన్** 13వ తేదీ లండన్ టైమ్స్[40]లో ఈ క్రింది ఉత్తరం ప్రచురించబడ్డది.

టైమ్స్ సంపాదకులకు,

అయ్యా – 1871 జూన్ 6వ తేదీన జూల్ ఫావ్రే యూరపియన్ రాజ్యాలన్నిటికీ ఒక సర్క్యులర్ జారీ చేశాడు. అంతర్జాతీయ కార్మిక సంస్థను వేటాడ వలసిందిగా అందులో అతడు కోరాడు. ఆ పత్రం స్వభావం తెలుసుకోటానికి కొద్దిపాటి వ్యాఖ్యలు చాలు.

“మా నిబంధనావళి ముందు మాటలోనే మేమిలా చెప్పాము. 1864 సెప్టెంబరు 28న అంతర్జాతీయ సంస్థ లండన్, లాంగ్ ఆర్క్‌లోని సెంట్ మార్టిన్స్ హాల్‌లో జరిగిన సభలో ఏర్పడ్డది. తన స్వప్రయోజనాల కొరకై ఈ తేదీన జూల్స్ ఫేవ్రె. 1862 అని వెనక్కు నెట్టాడు.

“మా ఉద్దేశాలను వివరించటానికై అతడు 1869 మార్చి 25(అంతర్జాతీయ) పత్రాన్ని ఉల్లేఖిస్తున్నారు. ఇంతకీ అతని ఉల్లేఖన ఏమిటి? అంతర్జాతీయ సంస్థకు సంబంధం లేని పత్రాన్ని ఉల్లేఖిస్తున్నాడు. ఇలాంటి మోసపూరిత కుట్రలు, ఇతడు యువ న్యాయవాదిగా ఉండగానే చేశాడు. కాబెట్ చేత విచారణకు గురి చేయబడిన 'నేషనల్' పత్రిక తరఫున వాదించే సందర్భంలో ఆ పని చేశాడు. కాబెట్ కరపత్రంలోని భాగాలను చదువుతున్నానంటూ, ఇతడు తన స్వంత వ్యాఖ్యలను చదివాడు. కోర్టు సమావేశంలో ఉండగానే ఈ కుట్ర బహిర్గతమైంది. కాబెట్ ఉదాసీనంగా ఉండబట్టి గాని, లేకపోతే పారిస్ న్యాయవాదుల సంఘం నుండి జూల్స్ ఫేవ్రె బహిష్కరించబడేవాడు. అంతర్జాతీయ సంస్థ పత్రాలంటూ అతడు ఉల్లేఖించిన పత్రాలన్నిటిలోను, ఒకటి కూడా అంతర్జాతీయ సంస్థకు చెందినది కాదు. ఉదాహరణకు అతడిలా అంటున్నాడు.

"1869 జూలైలో లండన్‌లో ఏర్పడిన సాధారణ కౌన్సిలు, అలయన్స్ తననుతాను నాస్తికమైనదిగా చెప్పుకొందని ప్రకటించింది." జనరల్ కౌన్సిల్ అలాంటి పత్రాన్ని ఎప్పుడూ జారీ చేయనేలేదు. తద్విరుద్ధంగా, జూల్స్ ఫేవ్రె ఉల్లేఖించిన సంఘటన నిబంధనావళి మూల ప్రతిని ఖండిస్తూ అది ఒక పత్రాన్ని జారీ చేసింది.

"అతని పత్రం కొంత భాగం సామ్రాజ్యానికి వ్యతిరేకంగా ఉద్దేశించబడినట్లు కూడా కనిపిస్తుంది. ఆ పత్రం అంతటా జూల్స్ ఫేవ్రే అంతర్జాతీయ సంస్థకు వ్యతిరేకంగా, సామ్రాజ్యం యొక్క పబ్లిక్ ప్రాసిక్యూటర్లు పునశ్చరణ చేసిన పోలీసుల కల్పిత ఆరోపణలనే, ఇతడూ పునశ్చరణ చేశాడు సామ్రాజ్యం న్యాయస్థానాలలోనే ఇవన్నీ అబద్ధాలని కుప్పకూలి పోయినవి.

"గడచిన యుద్ధాన్ని గురించిన రెండు ప్రసంగాలలోను(జులై, సెప్టెంబరు) అంతర్జాతీయ కార్మిక సంస్థ జనరల్ కౌన్సిల్, ఫ్రాన్సును జయించటానికి ప్రష్యా పన్నాగాలను ఖండించింది. ఆ పిమ్మట, జూల్స్ ఫేవ్రే ఆంతరంగిక కార్యదర్శి ఐన రిడ్లింగర్, ఒక వృధా ప్రయత్నం చేశాడు. బిస్మార్కుకు వ్యతిరేకంగా జాతీయ రక్షణ ప్రభుత్వానికి అనుకూలంగా, ఒక ప్రదర్శనను కౌన్సిల్ ఏర్పరచేటట్లు చేయటానికి కొందరు కౌన్సిల్ సభ్యులకు అతడు విజ్ఞప్తి చేశాడు. రిపబ్లిక్ పేరు ప్రస్తావించ వద్దని ప్రత్యేకంగా వారిని కోరాడు కూడా. లండన్‌లో జూల్స్ ఫేవ్రే రాక సందర్భంగా, ఒక ప్రదర్శనకు సన్నాహాలు, సదుద్దేశంతోనే జరిగాయి అయితే ఈ పని, జనరల్ కౌన్సిల్ హెచ్చరికకు విరుద్ధంగా జరిగింది. సెప్టెంబరు 9, తీర్మానంలో జనరల్ కౌన్సిల్ జూల్స్ ఫేవ్రే. అతని సహచరుల విషయంలో హెచ్చరికగా ఉండవలసిందిగా ప్రత్యేకంగా పేర్కొన్నది.

"యూరపులోని అన్ని ప్రభుత్వాల మంత్రి వర్గాలకు అంతర్జాతీయ సంస్థ, ఒక సర్క్యులర్ పంపి, పారిస్‌లో కీ.శే. మిల్లిర్ ప్రచురించిన పత్రాన్ని అందులో ప్రస్తావించి ఉంటే, జూల్స్ ఫేవ్రే ఏమనేవాడు?

మీ విధేయుడు

జాన్ హేల్స్.

అంతర్జాతీయకార్మిక సంస్థ జనరల్ కౌన్సిల్ కార్యదర్శి.

1871, జూన్ 12, లండన్

'అంతర్జాతీయ సంస్థ,' దాని లక్ష్యాలు అనే వ్యాసంలో, పవిత్రమైన ఆ పోలీసు ఏజంటు లండన్ స్పెక్టేటర్[41] (జూన్24) ఇతర అనేక కుతంత్రాలతోపాటు, జూల్స్ ఫేవ్రె కంటె కూడా మరింత విస్తృతంగా పైన పేర్కొన్న సంఘటన పత్రాన్ని అంతర్జాతీయ

సంస్థ పత్రంగా పేర్కొంటూ వుల్లేఖించాడు. ఈ పత్రం అబద్ధమని టైమ్స్ పత్రికలో ప్రకటింపబడిన తర్వాత 11 రోజులకు అలా ఉల్లేఖించాడు. మాకిది ఆశ్చర్యంగా లేదు. జెసూట్సు అందరిలోకి ప్రొటెస్టంటులు అతి నీచులు అని ఫ్రెడరిక్ దిగ్రేట్అంటూ ఉండేవాడు.

1871 ఏప్రియల్ మే నెలల్లో మార్బ్చే రచించబడి 1871 మే 30వ జరిగిన అంతర్జాతీయ కార్మిక సంస్థ జనరల్ కౌన్సిల్ సమావేశంలో ఆమోదించబడ్డ కరపత్రం.

1871 ఇంగ్లీషు కరపత్రం అనుసరించి ప్రచురించబడ్డది.

మొట్టమొదట లండన్‌లో 1871లో ప్రత్యేకంగా ఆంగ్లభాషలో కరపత్రంగా వెలువడ్డదు-

అదే సమయంలో, జర్మన్ ఫ్రెంచి ప్రచురణలు కూడా వెలువడ్డాయి-

ఎంగెల్సు సంపాదకత్వం వహించిన జర్మన్ ప్రతి. అతని పీఠికతో సహా 1891 బెర్లిన్‌లో ప్రత్యేక ప్రచురణగా వెలువడ్డది.






# నోట్సు

1. సోషలిస్టు వ్యతిరేక చట్టం - 1879లో జర్మనీలో ప్రవేశపెట్టబడ్డది. అన్ని సోషల్ డెమొక్రటిక్ సంస్థలను, ప్రజా కార్మిక సంఘాలను, కార్మికుల ప్రెస్సులను, నిషేధించటానికి. సోషలిస్టు సాహిత్యాన్ని స్వాధీనం చేసుకోటానికి, సోషల్ డెమొక్రట్లను శిక్షించటానికి ఇది అవకాశం కలిగించింది. ప్రజా కార్మికోద్యమ వత్తిడి ఫలితంగా ఈ చట్టం 1890లో రద్దు చేయబడ్డది. (పేజి-11)
2. సెడాన్‌లో 1870 సెప్టెంబరు 2న, ఫ్రెంచి సైన్యం ఓడిపోయింది. చక్రవర్తితో సహా ఖైదు చేయబడ్డది. విల్హెల్మ్‌షో(కాసెల్ వద్ద)-ప్రష్యన్ రాజుల నివాసపు కోట. 1870 సెప్టెంబరు 5 నుండి. 1871 మార్చి 19 వరకు మాజీ చక్రవర్తి, 3వ నెపోలియన్ ఇక్కడ ఖైదు చేయబడ్డాడు. (పేజి-14)
3. పాసిబ్లిస్టులు 19వ శతాబ్దిలో ఫ్రెంచి కార్మికోద్యమంలో తల ఎత్తిన ఒక అవకాశవాద ధోరణి. (పేజి-21)
4. సామ్రాజ్యాన్ని గురించి ప్రజాభిప్రాయాన్ని తెలుసుకునే సాకుతో, 1870 మేలో మూడవ నెపోలియన్ జనవాక్య సేకరణ జరిపించాడు. అతని విధానాన్ని వ్యతిరేకించ దలచుకున్నవాడు, అదే సమయంలో అన్ని ప్రజాతంత్ర సంస్కరణలను కూడా వ్యతిరేకిస్తున్నట్లు కనపడే విధంగా, ప్రశ్నలను రూపొందించారు. ప్రమాదకరమైన ఈ కుట్రను గురించి మొదటి ఇంటర్నేషనల్ విభాగాలు, తన సభ్యులకు హెచ్చరించి ఓటింగ్‌లో పాల్గొనవలదని విజ్ఞప్తి చేసింది. (పేజి-25)
5. 1870 జూలై 19న ఫ్రాంకో ప్రష్యన్ యుద్ధం మొదలైంది. 1851 డిసెంబరు 2న లూయీ బోనపార్టీ కుట్ర చేశాడు. రెండవ సామ్రాజ్యానికి చెందిన బోనపార్టీ వ్యవస్థ దాంతో మొదలైంది. (పేజి-26)

6. రెవిల్-చార్లెస్ డిలెక్లూజ్ ప్రారంభించిన వామపక్ష రిపబ్లికన్ దిన పత్రిక. 1868 నుండి 1871 జనవరి వరకు అది పారిస్‌లో వెలువడ్డది. (పేజి-)

7. మార్సిలెస్-1869 డిసెంబరు నుండి 1870 సెప్టెంబరు వరకు పారిస్‌లో హెన్రి రోచ్‌ఫోర్టుచే ప్రచురించబడిన వామపక్ష రిపబ్లికన్ దిన పత్రిక. (పేజి-27)

8. సొసైటీ ఆఫ్ డిసెంబరు 10 - ఈ సంస్థ ముఖ్యుడైన లూయీ బోనపార్టీ ఫ్రాన్సు రిపబ్లిక్ అధ్యక్షుడుగా 1848 డిసెంబరు, 10న ఎన్నికయ్యాడు. కనుక ఆ పేరు వచ్చింది. ఇదొక రహస్య బోనపార్టిస్టు సంఘం 1849లో మొదలైంది. వర్గ పునాది వదలుకున్న వ్యక్తులు, రాజకీయ దుస్సాహసిక వాదులు, సైన్యం ప్రతినిధులు మొదలైనవారు ఇందులో ఉన్నారు. 1850 నవంబరున అధికార పూర్వకంగా ఈ సంస్థ నిషేధానికి గురైంది. ఐనా ఈ సంస్థ మాజీ సభ్యులు బోనపార్టిస్టు ప్రచారాన్ని చేస్తూనే వచ్చారు. 1851 డిసెంబరు 2 కుట్రలో ప్రముఖ పాత్ర వహించారు. వివరమైన వ్యాఖ్యకై మార్క్స్ వ్రాసిన లూయీ బోనపార్టీ బ్రూమైర్ 18వ తేదీన చూడుడు. (పేజి-27)

9. సదోవా యుద్ధం(బొహీమియా), 1866 ఆస్ట్రో ప్రష్యన్ యుద్ధంలో నిర్ణయాత్మకమైనది. దాంతో ప్రష్యా విజయవంతమైంది. (పేజి-28)

10. 1813-15లో, మొదటి నెపోలియన్‌కు వ్యతిరేకంగా జరిగిన యుద్ధం. పాత వ్యవస్థను పునరుద్ధరించింది. జర్మన్ భూస్వామ్య ఖండాలుగా చీలిపోకుండా కాపాడింది. (పేజి-28)

11. సెప్టెంబరు 4న, ఫ్రాన్సులో రిపబ్లిక్ ప్రకటించబడ్డది. 'జాతీయ రక్షణ ప్రభుత్వం' అనే కొత్త ప్రభుత్వం ఏర్పడ్డది. (పేజి-31)

12. టిల్సిట్ ఒప్పందం - 1807లో, మొదటి నెపోలియన్‌చే ప్రష్యా ఓడిపోయిన మీదట ఫ్రాన్సు, రష్యాల మధ్య జరిగింది. (పేజి-35)

13. మార్క్స్, మొదటి అంతర్జాతీయ సంస్థ జనరల్ కౌన్సిల్‌ల ప్రోత్సాహంతో ఫ్రెంచి రిపబ్లిక్‌ను గుర్తించాలంటూ. బ్రిటిష్ కార్మికులలో పెద్ద ఉద్యమం మొదలైంది. అనేక సభలు జరిగాయి. (పేజి-38)

14. పారిశ్రామిక ఉత్తర ప్రాంతం, దక్షిణ ప్రాంతాల మధ్య జరిగిన అమెరికా అంతర్యుద్ధంలో (1861-65). బ్రిటన్, బానిస క్షేత్రాలున్న దక్షిణ ప్రాంతాన్ని బలపరచింది. (పేజీ-38)

15. ఫ్రెంచి రిపబ్లిక్ అధికార జర్నల్ - పారిస్ కమ్యూన్ అధికార పత్రిక. 1871, మార్చి 19 నుండి మే 24 వరకు పారిస్‌లో వెలువడ్డది. (పేజి-42)

16. లాఎటెండార్డ్ (పతాకం)-బోనపార్టిస్టు ధోరణికి చెందిన ఫ్రెంచి దినపత్రిక. పారిస్‌లో 1866-68 సంవత్సరాల మధ్య ప్రచురించ బడ్డది. ఈ పత్రిక మోసకృత్యాల ద్వారా వచ్చిన ధనంతో నడుస్తున్నదని తెలిసిన మీదట, ప్రచురణ ఆగిపోయింది. (పేజి-43)

17. జర్మన్ ప్రచురణలో కార్ ఫోగ్ట్ ఉన్నాడు. ఫ్రెంచి ప్రచురణలో ఫాల్‌స్టాఫ్ ఉన్నాడు.

జోమిల్లర్-ప్రసిద్ధి చెందిన 18వ శతాబ్దపు ఇంగ్లీషు నటకుడు. కార్ల్ ఫోగ్ట్ జర్మన్ బూర్జువా ప్రజాతంత్ర వాది. మూడవ నెపోలియన్‌కు ఏజెంటుగా పని చేశాడు. ఫాల్ స్టాఫ్ - కోతలరాయుడు. మోసకారి ఐన వ్యక్తిని తెలియజేసే షేక్స్‌పియర్ పాత్ర. (పేజి-43)

18. 1848 జనవరిలో రెండవ ఫెర్టినాండ్‌కు చెందిన నియోపాలిటన్ సేనలు, పలెర్మోపై బాంబుల వర్షం కురిపించాయి. 1848-49లో ఇటాలియన్ రాష్ట్రాలలో బూర్జువా విప్లవానికి సంకేతంగా తయారయిన ప్రజా తిరుగుబాటును ఈ సేనలు అణచివేశాయి. అదే సంవత్సరం ఆకురాలు కాలంలో మెసీనాపై దారుణమైన ఫిరంగి దాడి జరిగింది. దాంతో ఆ సేనానికి బొంబారాజు అను మారుపేరు స్థిరమైంది. (పేజి-45)

19. 1849 ఏప్రిల్‌లో ఫ్రెంచి, సేనలు, ఇటాలియన్ విప్లవాన్ని అణచటానికి ఇటలీకి వెళ్ళాయి. విప్లవ రోమ్‌పై అవి దాడి చేశాయి. రిపబ్లిక్ ఏ పరిస్థితిలోను మరో దేశ ప్రజల స్వాతంత్ర్యాన్ని హరించదు, అని ఫ్రెంచి రాజ్యాంగంలో ఉన్న నిబంధనకు వ్యతిరేకంగా ఈ దాడి జరిగింది. (పేజి-45)

20. పార్టీ ఆఫ్ ఆర్డర్ - 1848లో ఏర్పడిన మితవాద బడా బూర్జువా పార్టీ. లెజిటిమిస్టులు, ఆర్లియనిస్టులు అని రెండు రాచరిక శాఖలు కలిసి ఈ పార్టీని ఏర్పరచాయి. 1849 నుండి. 1851 డిసెంబరు 2 కుట్ర వరకు. ఇది రెండవ రిపబ్లిక్ శాసనసభలో ప్రధాన స్థానాన్ని ఆక్రమించుకుని ఉంది. పార్టీ ఆఫ్ ఆర్డర్ యొక్క ప్రజా వ్యతిరేక విధానాన్ని అవకాశంగా తీసుకుని, రెండవ సామ్రాజ్య వ్యవస్థను స్థాపించటంలో లూయీ బోనపార్టీ ముఠా జయప్రదమైంది. (పేజి-47)

21. లెజిటిమిస్టులు - చట్టబద్ధమైన బోనపార్టీ వంశాన్ని బలపరిచే పార్టీ. ఈ పార్టీ ఫ్రాన్సులో 1792 వరకు, తిరిగి పునరుద్ధరణ కాలంలోను (1814-30) అధికారంలో ఉన్నారు. ఆర్లియన్ వంశాన్ని బలపరిచేవారు ఆర్లియనిస్టులు. వీరు 1830 జూలై విప్లవ కాలం నుండి అధికారంలో ఉండి. 1848 విప్లవంలో

పదవీ భ్రష్టులైనారు. (పేజి-48)

22. అపురూపమైన శాసనసభ - 1815-16 డిప్యూటీల ఛాంబర్ (పునరుద్ధరణ మొదటి రోజులు) అత్యంత అభివృద్ధి నిరోధకులు ఇందులో ఉన్నారు. (పేజి-49)

23. పోర్సినాక్-మెలియర్ హాస్య నాటికలలో ఒక పాత్ర, మందబుద్ధి సంకుచిత దృష్టి, కలిగిన చిన్న భూస్వామ్య వర్గానికి ఈ పాత్ర ప్రతినిధి. (పేజి-)

24. రూరల్స్ అసెంబ్లీ - 1871 ఫిబ్రవరి 12న బోర్డోలో సమావేశమైన జాతీయ శాసన సభలో రూరల్స్ అత్యధిక సంఖ్యలో ఉన్నారు. (750 మందిలో 450 మంది) పట్టణ గ్రామీణ ప్రాంతపు భూస్వాముల అభివృద్ధి నిరోధకుల ప్రతినిధులు, కనుక రూరల్స్ అసెంబ్లీ లేక భూస్వాముల శాసనసభ అని దానికి పేరు వచ్చింది. (పేజి-49)

25. కయెనె - దక్షిణ అమెరికాలోని ఫ్రెంచి గుయానా రాజధాని. ప్రవాసుల శిక్షించేందుకు పంపే జైలు. (పేజి-52)

26. లా నేషనల్ - 1830-51 సం॥ల మధ్య పారిస్‌లో వెలువడిన దిన పత్రిక బూర్జువా రిపబ్లికన్ పార్టీ వాణి. (పేజి-54)

27. వాల్టేరును చూడుము - కాండిడ్, 22వ అధ్యాయం (పేజి-57)

28. ఇనెవెస్టిచర్ -తన క్రింది సామంతునికి భూమిని దఖలుపరచే ఉత్సవం. అతనిని ఒక మత పీఠానికి అధిపతిగా చేసి భూమిని దఖలుపరచడం జరుగుతుంది. క్రింది అంతస్తులో వుండేవారు. పై అంతస్తులోని లౌకిక, మత పీఠాధిపతులకు పూర్తిగా లొంగి పడివుండేవాడు. (పేజి-)

29. క్లాడర్ డాష్- హాస్య ప్రధానమైన జర్మన్ పత్రిక. 1848 తర్వాత బెర్లిన్‌లో ప్రచురితమయింది. వారపత్రిక, 'పంచ్' 1841 నుండి లండన్‌లో ప్రచురితమయ్యేది. (పేజి-66)

30. వెండోం స్తంభం - 1806 - 10లో పారిస్‌లో ప్లేస్ వెండోం అనుచోట నిర్మించబడ్డది. నెపోలియన్ హయాంలో ఫ్రాన్సు సాధించిన విజయాలకు ఇది చిహ్నం. (పేజి-71)

31. ఆబ్సెంటీలు - తమ భూముల ముఖం ఎన్నడూ చూడని బడాభూస్వాములు. (పేజి-)

32. కోబ్లెంజ్ - ఫ్రెంచి విప్లవ ప్రతీఘాతకులకు కేంద్రమైన జర్మన్ నగరం. 18వ శతాబ్ది ఆఖరులో ఫ్రెంచి బూర్జువా విప్లవ కాలంలో, విదేశాలకు వలస వెళ్ళిన ప్రభువులు అంతా అక్కడ చేరేవారు. (పేజి-75)

33. చోవన్స్-బ్రిటన్‌లో ఏర్పచబడిన వర్సెల్స్ సైన్యంలోని అభివృద్ధి నిరోధక విభాగాలకు పారిస్ కమ్యూన్ వాదులు చోవన్స్ అని పేరుపెట్టారు. 18వ శతాబ్ది ఆఖరులో జరిగిన ఫ్రెంచి బూర్జువా విప్లవ కాలంలో వాయవ్య ఫ్రాన్సులో ప్రతీఘాత విప్లవంలో పాల్గొన్న వారి పోలిక ననుసరించి ఈపేరు పెట్టారు. (పేజి-76)

34. జోవేస్ (Zovaves) - ఫ్రెంచి తేలిక పదాతి దళం. (ఆల్జీరియన్ తెగ నుండి ఈ పేరు వచ్చింది) 19వ శతాబ్ది మొదటి మూడవ విభాగంలో, స్థానిక ఆల్జీరియన్ ప్రజలతో మొదటి జోవే దళాలు ఏర్పడ్డాయి. - పిమ్మట ఈ దళాలను ఫ్రాన్సులోనే ఏర్పరచారు. ఐనా వెనుకటి ప్రాచ్య దేశాల యూనిఫారాన్ని కొనసాగించారు. (పేజి-76)

35. మగేరా, హెకాటా-ప్రాచీన గ్రీకు పురాణాలలో దుష్టత్వానికి, భూత వైద్య ప్రక్రియలకు చిహ్నామైన దేవతలు. (పేజి-)

36. ప్రేటోరియన్లు -ప్రాచీన రోమ్‌లో, చక్రవర్తి యొక్క లేక సేనాని యొక్క స్వంత అంగరక్షక దళం పేరు. వీరికి అనేకమైన సౌకర్యాలుండేవి. ఇక్కడ ప్రేటోరియన్స్ అంటే వర్సేల్స్ సైన్యం. (పేజి-)

37. డైలీ న్యూస్ - ఇంగ్లీషు ఉదారవాద దినపత్రిక. పారిశ్రామిక బూర్జువా వర్గవాణి. లండన్‌లో 1846-1930 మధ్య వెలువడ్డది. (పేజి-89)

38. లేటెంప్స్ - ప్రముఖ ఫ్రెంచి ఉదారవాద దినపత్రిక. 1861-1943 మధ్యలో పారిస్‌లో ప్రచురితమైంది. (పేజి-90)

39. ది ఈవెనింగ్ స్టాండర్డు - లండన్‌లో 1857-1905ల మధ్య ప్రచురితమైన ఇంగ్లీషు మితవాద దినపత్రిక. (పేజి-90)

40. ది టైమ్సు-ప్రముఖ ఇంగ్లీషు దినపత్రిక. 1788లో ప్రారంభమైంది. 19వ శతాబ్ది 7వ దశకంలో ఉదారవాద వైఖరీని స్వీకరించింది. (పేజి-91)

41. స్పెక్టేటర్ - లండన్‌లో 1828 నుండి ప్రచురించబడిన ఉదారవాద వారపత్రిక. (పేజి-92)



# నామ సూచి

ఆఫ్రే (1793-1848)-పారిస్ ఆర్చిబిషప్. జూన్ 1848 తిరుగుబాటులో తిరుగుబాటు కార్మికులను ఆయుధాలు విసర్జించవలసిందని నచ్చచెబుతూ ఉండగా ప్రభుత్వ దళాలచే తుపాకి గుండ్లకు గురిఅయి కాల్చివేయబడ్డాడు.

అలెగ్జాండర్ II (1818-1881)-రష్యన్ చక్రవర్తి (1855-1881)

అలెగ్జాండ్రా (1844-1925)-డెన్మార్కు రాజైన 9వ క్రిస్టియన్ కుమార్తె 1863లో ఆనాటి ప్రిన్స్ ఆఫ్ వేల్సును వివాహం చేసుకున్నది. ఇతడు 1901లో, 7వ ఎడ్వర్డుగా బ్రిటిష్ రాజైనాడు.

అరెలా డి పలాడిన్స్ లూయీ (1804-1877) - ఫ్రెంచి జనరల్. రాచరికవాది. 1871 మార్చిలో పారిస్ జాతీయ రక్షక దళానికి అధిపతి. 1871న శాసనసభ్యుడు.

బెర్రీ డచ్చెస్ డి(1798-1870) కౌంట్ చాంబోర్డు తల్లి. ఫ్రెంచి సింహాసనానికి లెజిటి మిస్టుల తరఫున వారసుడు. 1832లో లూయీ ఫిలిప్పును. కూలదోసే ఉద్దేశంతో వెండేలో ఒక తిరుగుబాటును లేవదీయటానికి యత్నించాడు.

బెస్లే ఛార్లెస్ (1795-1878) -ఫ్రెంచి యజమాని, విద్యాధికుడు, రాజకీయవేత్త మొదటి అంతర్జాతీయ సంస్థ సభ్యుడు, ప్రౌడానిస్టు, పారిస్ కమ్యూన్ సభ్యుడు.

బిస్మార్క్ ఆటో(1815-1898) రాజకార్యధురంధరుడు, ప్రష్యా. జర్మనీల దౌత్య వ్యవహర్త. జర్మన్ సామ్రాజ్యానికి 1871-1890ల మధ్య ఛాన్సలర్.

బ్లాంక్వి లూయీ అగస్టె (1805-1881)-ఫ్రెంచి విప్లవకారుడు. ఊహాజనిత కమ్యూనిస్టు, కొన్ని రహస్య సంఘాలను, కుట్రలను ఏర్పరచాడు. 1830-1848 విప్లవాలలో ప్రముఖ పాత్ర వహించాడు. ఫ్రాన్సు కార్మికోద్యమ నాయకుడు, పారిస్‌లో 1870, అక్టోబరు 31న జరిగిన తిరుగుబాటు నాయకులలో ఒకడు, పదే పదే జైలు శిక్షలకు గురయ్యాడు.

బోనపార్టీ-నెపోలియన్ I

బోనపార్టీ లూయీ -నెపోలియన్ III

బ్రూసెల్ అంటోని మగ్లోరే-1830-ఫ్రెంచి ఉద్యోగి, బ్లాంక్విస్టు పారిస్ కమ్యూన్ సభ్యుడు, జాతీయ రక్షకదళ కేంద్ర కమిటీ సభ్యుడు; 1871 మేలో వర్సేల్స్ పోరాటంలో తీవ్రంగా గాయపడ్డాడు.

కాబెట్ ఎట్లెని (1788-1856)-ఫ్రెంచి ఊహాజనిత కమ్యూనిస్టు-ఇకారియా యాత్రలు-గ్రంథకర్త.

కాలోన్ ఛార్లెస్ అలెగ్జాండ్రి(1734-1802)లూయీ XVI వద్ద ఆర్థిక మంత్రి

కవైనక్ లూయీ యూగిని(1802-1857)-ఫ్రెంచి సేనాని. రాజ్యాంగ నిర్ణయసభ ఇతనికి నియంతృత్వ అధికారాలు దఖలు పరచింది. జూన్ 1848 తిరుగుబాటును అతి దారుణంగా అణచివేశాడు.

చంగార్నియర్ నికోలాస్ అనె ధియోడూల్(1793-1877) - ఫ్రెంచి సేనాని. రాచరికవాది. పారిస్‌లో జూన్ తిరుగుబాటును అణచి వేయటంలో పాల్గొన్నాడు.

కొట్లోన్ లూయీ అంథీం (1814-1886)-ఫ్రెంచి ఉద్యోగి, ఒక పరిపాలనా శాఖాధ్యక్షుడు.

కార్బన్ క్లాడ్ అంథీం(1808-1891)-ఫ్రెంచి రాజకీయవేత్త, రాజ్యాంగ నిర్ణయసభ సభ్యుడు (1848-1849) 1870, సెప్టెంబరు తర్వాత, ఒక పారిస్ విభాగానికి మేయర్, జాతీయ శాసనసభ సభ్యుడు.

కసిస్ మెంటుబిన్ చార్లెస్ గులోం, కామ్టిడి పాలికో(1796-1878) - ఫ్రెంచి సేనాని, బోనపార్టిస్టు, 1870 ఆగస్టు - సెప్టెంబరు నెలల్లో యుద్ధమంత్రి, ప్రధాన మంత్రి కూడా.

డర్బోయ్ జార్జిస్(1813-1871) - పారిస్ ఆర్చిబిషప్, కమ్యూన్ సభ్యులచే బందీగా కాల్చివేయబడ్డాడు.

డెస్మారెట్-ఫ్రెంచి పోలీసు అధికారి, కమ్యూన్‌కు వ్యతిరేకంగా జరిగిన అత్యాచారాలలో భాగస్వామి.

డూయే ఫిలిక్స్ (1816-1879)-ఫ్రెంచి సేనాని. మూడవ నెపోలియన్‌తో పాటు ఫ్రాంకో ప్రష్యన్ యుద్ధంలో సెడాన్‌వద్ద ఖైదీగా పట్టుబడ్డాడు. పారిస్ కమ్యూన్ హంతకులలో ఒకడు.

డూఫారె ఆర్మండ్ జూల్స్ (1798-1881) - ఫ్రెంచి న్యాయవాది. లూయీ ఫిలిప్పాక్రింద రెండవ రిపబ్లిక్‌లో మంత్రి, థయర్స్ ప్రభుత్వంలో న్యాయశాఖామంత్రి.

డువాల్ ఎమిలి విక్టర్ (1841-1871) - ఫ్రెంచి కార్మికుడు. మొదటి

అంతర్జాతీయ సంస్థ సభ్యుడు, పారిస్ కమ్యూన్ సేనాని, ఏప్రిల్ 3-4 తేదీలలో వర్సెల్స్ సేనలచే కాల్చివేయబడ్డాడు.

ఎస్పార్టియో బల్డోమిరో(1793-1879) స్పానిష్ సేనాని. ప్రోగ్రెసివ్ పార్టీ నాయకుడు. స్పెయిన్ రీజెంటు (1841-43). ప్రధాని (1854-1856).

యీడిస్ ఎమిలి(1843-1888)-బ్లాంక్విస్టు. పారిస్ కమ్యూన్ సభ్యుడు. ఏప్రిల్ 4 వరకు కమ్యూన్ సైనిక ప్రతినిధి.

ఫేవ్రె జూల్స్ - ఫ్రెంచి రాజకీయవేత్త, బూర్జువా రిపబ్లికన్, జాతీయ రక్షణ ప్రభుత్వంలో సభ్యుడు(1870). పారిస్ కమ్యూన్‌ను అణచివేయటంలో భాగస్వామి.

ఫెర్డినాండ్ II (1810-1859) - నేపుల్స్ రాజు 1848 విప్లవంలో పలెర్మో, మెసినాలను దారుణంగా గుండ్లదాడికి గురిచేసినందుకు, బొంబారాజు అనిపిలువ బడ్డాడు.

ఫెర్రీ జూల్స్ (1832-1893) - ఫ్రెంచి సేనాని, రాజకీయవేత్త పారిస్ కమ్యూన్ హంతకులలో ఒకడు. 1880-81, 83-85ల మధ్య ప్రధాని.

ఫ్లోరెన్స్ గుస్టాన్(1838-1871) - ఫ్రెంచి బ్లాంక్విస్టు విప్లవవాది, పారిస్ కమ్యూన్ సైనిక కమిషన్‌లో సభ్యుడు. ఏప్రిల్ 3న, కమ్యూన్ దళాలపై వర్సెల్స్ దళాలు జరిపిన దారుణమైన దాడిలో అమానుషంగా హత్యచేయబడ్డాడు.

ఫ్రెడరిక్ II (1712-1786) - ప్రష్యారాజు (1740-1786).

గలిఫెట్ గాస్టన్ (1830-1909) - ఫ్రెంచి సేనాని. పారిస్ కమ్యూన్ హంతకుడు గంబేటా లియోన్ (1838-1882) - ఫ్రెంచి రాజకీయవేత్త బూర్జువా రిపబ్లికన్, జాతీయ రక్షణ ప్రభుత్వంలో సభ్యుడు (1870-71), ప్రధాన మంత్రి, విదేశాంగ మంత్రి (1881-1882).

గనెస్కో గ్రిగరీ (1830-1877) - ఫ్రెంచి పాత్రికేయుడు. రుమేనియా దేశస్తుడు. రెండవ సామ్రాజ్య కాలంలో బోనపార్టిస్టు పిమ్మట థియర్స్ ప్రభుత్వ తోడ్పాటుదారు.

గొర్చకోవ్ అలెగ్జాండర్ మికెలోవిచ్ (1798-1883)-రష్యన్ దౌత్యవ్యవహర్త. రాజకీయవేత్త, విదేశాంగ మంత్రి(1856-1882) గుయెడ్ అల్ఫాన్జో సైమన్-ఫ్రెంచి సేనాని. ఫ్రాంకో ప్రష్యన్ యుద్ధంలో పాల్గొన్నవాడు. 1870 పారిస్ ముట్టడి సమయంలో, ఫిరంగి దళ అధ్యక్షుడు.

గీజో, ఫ్రాంకో-పిరి (1787-1874)-ఫ్రెంచి బూర్జువా చరిత్రకారుడు. రాజకీయవేత్త, రాచరికవాది.

హేల్స్‌జాన్-మొదటి అంతర్జాతీయ సంస్థ జనరల్ కౌన్సిల్ సభ్యుడు.

హోస్‌మన్ జార్జిస్ యూగిని (1809-1891)-పారిస్‌లో ఒక ప్రభుత్వ విభాగ అధ్యక్షుడు. బూర్జువా వర్గ ప్రయోజనాలకై రాజధాని నిర్మించాడు.

హేకిరిన్ జార్జిస్ చార్లెస్ (1812-1895)-ఫ్రెంచి రాజవంశీకుడు, రష్యాలో చాలాకాలం జీవించాడు. అలెగ్జాండర్ పుష్కిన్‌ను హత్య చేసినవాడు. తర్వాత బోనపార్టిస్టు ఐనాడు. 1851 డిసెంబరు 2 కుట్రలో ప్రధాన భాగస్వామి.

హెర్వే ఎడురాడ్ (1835-1879) - ఫ్రెంచి రాచరికవాద ప్రచారకుడు.

హోహెన్ జోలర్న్‌లు - బ్రాండెన్‌బర్గు పాలక వంశం (1415-1701) ప్రష్యా రాజులు (1710-1918) జర్మన్ చక్రవర్తులు (1871-1918) హక్స్లీ థామస్ హెన్రీ(1821-1895) - ఇంగ్లీషు ప్రకృతి శాస్త్రజ్ఞుడు, డార్విన్ స్నేహితుడు, శిష్యుడు.

జాక్విమెట్ - ఫ్రెంచి మతగురువు. 1848లో, పారిస్ ఆర్చిబిషప్‌కు ఉప మతాధిపతి.

జోబర్ట్ ఫ్రాంకోస్(1798-1874) ఫ్రెంచి రాజకీయవేత్త రాచరికవాది. థయర్స్ ప్రభుత్వంలో పబ్లిక్ వర్క్స్ మంత్రి (1840). జాతీయ శాసనసభ సభ్యుడు (1871-77).

బొంబారాజు-ఫెర్దినాండ్ II

లఫీటె జాక్వెస్ -(1767-1844) - ఫ్రెంచి బ్యాంకరు.

లెకొక్లాడ్ మార్టిన్ (1817-1871) - ఫ్రెంచి సేనాని. 1871 మార్చి 18న మాంట్ మార్టిపై అర్ధరాత్రి దాడిలో భాగస్వామి. ప్రజల పక్షానికి మారిన అతని మనుష్యులే అతడ్ని చంపివేశారు.

లేఫ్లో అడోల్ఫ్ ఎమాన్యుల్ ఛార్లెస్ (1804-1887)-ఫ్రెంచి సేనాని. రాచరికవాది, రాజ్యాంగ నిర్ణయ, శాసన నిర్ణాయక సభలలో సభ్యుడు. (1848-1851). 1870-71లో యుద్ధమంత్రి.

లూయీ బోనపార్టీ - నెపోలియన్ III

లూయీ XVI - ఫ్రాన్సు రాజు (1774-1752)

లూయీ ఫిలిప్పి-ఫ్రాన్సు రాజు (1830-1848)

మక్ మాహన్ మేరి ఎడ్మి పాట్రిఫ్రె మారిస్ (1808-1893)-ఫ్రెంచి సేనాని. 1871లో వర్సేల్స్ సేనలకు నాయకత్వం వహించాడు. కమ్యూన్ హంతకులలో ఒకడు, మూడవ రిపబ్లిక్ అధ్యక్షుడు(1872-1879)

మార్కోవస్కీ - ఫ్రాన్సులో జారిస్టు ప్రభుత్వ ఏజంటు, 1871 థయర్స్ అనుచరరడు.

మార్క్సు కారల్(1818-1883)

మిలిరి జీన్ బాప్టిస్టె(1817-1871)- వామపక్ష ప్రౌడానిస్టు, పాత్రికేయుడు,

పారిస్ కమ్యూన్‌లో భాగస్వామి, వర్సేల్స్ సేనలచే మేలో కాల్చివేయబడ్డాడు.

మాంటిస్క్యు చార్లెస్ (1689-1755)-ఫ్రెంచి రచయిత, చరిత్రకారుడు, చట్టబద్ధ రాచరికవాద సిద్ధాంతకర్త.

నెపోలియన్ I - (1769-1821)

నెపోలియన్ III - లూయీ బోనపార్టీ

ఆర్లియన్స్ డ్యూక్ - లూయీ ఫిలిప్పీ

ఆర్లియన్స్ - ఫ్రెంచి రాచరిక వంశం.

పాలికో - కసిన్ మంటాబన్

పెనె హెన్రీ - (1830-1888) - ఫ్రెంచి పాత్రికేయుడు, రాచరికవాది. లెజిటిమిస్టు, పిమ్మట బోనపార్టిస్టు 1871, మార్చి 22న ప్రతీఘాత విప్లవ చర్యలను సన్నద్ధ పరచిన వారిలో ఒకడు.

పిక్ జూల్స్ - ఫ్రెంచి పాత్రికేయుడు. బోనపార్టిస్టు ఎటెండార్డ్ వార్తా పత్రికలకు బాధ్యుడైన ప్రచురణకర్త.

పికార్ట్ ఆర్థర్-ఫ్రెంచి రాజకీయవేత్త పాత్రికేయుడు. రాచరికవాది. 1876 నుండి చేంబర్ ఆఫ్ డిప్యూటీస్‌లో సభ్యుడు.

పికార్డ్ ఎర్నెస్టు (1821-1877)-జాతీయ రక్షణ ప్రభుత్వంలో ఆర్థిక శాఖా మంత్రి. థయర్స్ ప్రభుత్వంలో అంతరంగిక శాఖామంత్రి.

పియిట్రి-(1820-1902) 1851 డిసెంబరు రెండు కుట్రలో ప్రధాన భాగస్వామి. రెండవ సామ్రాజ్య కాలంలో పోలీసు శాఖలో ఒక విభాగానికి అధిపతి.

పోయర్ క్వెర్టియర్ ఆగస్టు థామస్ (1820-1891) - బోనపార్టిస్టు థయర్స్ ప్రభుత్వంలో ఆర్థిక మంత్రి.(1871-72)

ప్రౌడాన్ పియరె జోసెఫ్-(1809-1865).

సైసెట్ జీన్(1810-1879)-ఫ్రెంచి ఉప నౌకా సేనాని, రాచరికవాది. సైమన్‌జూల్స్ (1814-1896)-ఫ్రెంచి ప్రచురణ కర్త, జాతీయ రక్షణ ప్రభుత్వంలో విద్యామంత్రి.

సుల్లా లూసియన్ కార్నీలియస్ (38.78 క్రీ.పూ) -రోమన్ నియంత.

సుసెన్ లూయీ (1810-1876)-ఫ్రెంచి సేనాని. 1871 ఫిబ్రవరిలో యుద్ధ మంత్రి.

టాసిటన్ పబ్లిస్ కర్నీలియస్(55-120 క్రీ.శ)-రోమన్ చరిత్రకారుడు. టాల్ ఫేర్ - బోన పార్టిస్టు పత్రిక ఎటెండార్ట్ ప్రచురణకు సంబంధించిన మోస కృత్యాలలో భాగస్వామి.

టామర్లేన్(టెమూర్) (1336-1405)-మధ్య ఆసియా సేనాని, విజేత.

టమిసెర్ ఫ్రాంకోలారెంటి అల్ఫోన్జో(1809-1880)- ఫ్రెంచి సేనాని రిపబ్లికన్, పారిస్ జాతీయ రక్షక దళ సర్వ సేనాని.

థయర్స్ లూయీ అడాల్ఫ్ (1797-1877)-ఫ్రెంచి బూర్జువా చరిత్రకారుడు. రాజకీయ వేత్త. పారిస్ కమ్యూన్ హంతకుడు.

థామస్ క్లెమెంటో(1809-1871) పారిస్ జాతీయ రక్షక దళాధిపతి. పారిస్ కమ్యూన్ సమయంలో ప్రజల తరఫున చేరిపోయిన సైనికులచే కాల్చి చంపబడ్డాడు.

టోలెన్ హెన్రీ లూయీ(1828-1897)-ఫ్రెంచి కార్మికుడు. మొదటి అంతర్జాతీయ సంస్థ ఫ్రెంచి విభాగ స్థాపకులలో ఒకడు. ప్రౌఢానిస్టు,పారిస్ కమ్యూన్ రోజులలో వర్సైల్స్ సేనల వైపు చేరిపోయాడు. అంతర్జాతీయ సంస్థ నుండి బహిష్కరించ బడ్డాడు.

ట్రోచు లూయీ జూల్స్(1815-1896)-ఫ్రెంచి సేనాని. జాతీయ రక్షకదళ ప్రభుత్వాధిపతి(1870)-పారిస్ కమ్యూన్ హంతకులలో ఒకడు.

వైలాంట్ ఎడురాడ్ (1840-1915)-బ్లాంక్విస్టు, మొదటి అంతర్జాతీయ సంస్థ. జనరల్ కౌన్సిల్లోనూ, పారిస్ కమ్యూన్లోనూ సభ్యుడు. ఫ్రెంచి సోషలిస్టు పార్టీ స్థాపకులలో ఒకడు. తర్వాత సంస్కరణవాదిగా మారాడు.

వాలెంటిస్ లూయీ ఎర్నెస్టు - ఫ్రెంచి సేనాని. బోనపార్టిస్టు. 1871 మార్చి 18 తిరుగుబాటు సమయంలో పారిస్ పోలీసు శాఖాధికారిగా వ్యవహరించాడు.

వినోయ్ జోసెఫ్(1800-1880) - ఫ్రెంచి సేనాని. బోనపార్టిస్టు, పారిస్ కమ్యూన్ రోజులలో వర్సైల్స్ సేనలకు నాయకత్వం వహించాడు. పారిస్ కమ్యూన్ హంతకులలో ఒకడు.

వాల్టెరు ఫ్రాంకోమేరి-(1694-1778)

వేల్స్ రాకుమారి -అలెగ్జాండ్రా.

విలియం I- 1797-1888.

◆ ◆ ◆



భూస్వామ్యవ్యవస్థ కడుపులో పుట్టి పెరిగిన పెట్టుబడిదారీవ్యవస్థ దాన్ని కూల్చినట్లుగానే పెట్టుబడిదారీవ్యవస్థలో పుట్టిన కార్మిక వర్గం అనివార్యంగా దాన్ని కూలుస్తుందని, దోపిడీరహిత సమాజాన్ని - సమసమాజాన్ని నిర్మిస్తుందని మార్క్స్ - ఎంగిల్స్‌లు 'కమ్యూనిస్టు ప్రణాళిక' లో (1848) ప్రకటించి ప్రపంచాన్ని కుదిపిలేపారు. అందుకు 1864 ఫస్ట్ ఇంటర్నేషనల్ (మొదటి అంతర్జాతీయ కార్మికసంస్థ) ను ఏర్పాటుచేసారు. ఐరోపాఖండంలోనూ అమెరికావంటి దేశాలలో దాని శాఖలు ఏర్పడ్డాయి. ఇది ఏర్పడిన 7 సం॥లకే పారిస్‌నగరంలో తొలి కార్మికవర్గరాజ్యస్థాపన జరిగింది. దానిని తీవ్రమైన కక్షతో, క్రూరంగా పెట్టుబడిదారీవర్గం అంతర్యుద్ధాన్ని లేవనెత్తికూల్చింది. ఆ చరిత్రే యీ **'ఫ్రాన్సులో అంతర్యుద్ధం'**.

978-93-88566-10-0




ప్రజాశక్తి బుక్‌హౌస్

PSBH



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA109B163 |
| పుస్తకం పేరు | ఫ్రాన్సులో అంతర్యుద్ధం |
| తారీఖు | 11 February 2025 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 109 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | C1, 4, 10, BC1 |
| లేని పేజీలు | Nil |
| తయారు చేసినది | Sharmila |
| పేజీలు విడదీసినది | Sireesha |
| స్కాన్ చేసినది | Bhanu |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |